ప్రత్యేక సంచిక

సంపుటి : 1
సంచిక : 12
రు. 20/-లు
తెనాలి



1993-2013 నడుస్తున్న చరిత్ర

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

ఫిబ్రవరి 2016

అంతర్జాతీయ
మాతృభాషా దినోత్సవ
శుభాకాంక్షలు

ధాకాలో మాతృభాషకై జరిగిన పోరాటంలో
1952 ఫిబ్రవరి 21న కాల్పులకు బలైన వీరుల స్మారక చిహ్నాలు...



ఇవి 2000 సం.నుండి ప్రతి ఏటా
అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవ
సందర్భంగా యునెస్కో విడుదల చేసే పోస్టర్లు.
ఏడాదికొక కోణంలో అమ్మనుడి ప్రాధాన్యాన్ని,
చేయాల్సిన పనుల్ని సూచిస్తూ...
యునెస్కో సంచాలకుడు సందేశాన్ని విడుదల చేస్తారు.
(ఆ వివరాలు లోపలి పుటలలో...)






































దేశభాషాభిమానము తోడిదే దేశాభిమానము. ఏ కులము వారైనా, ఏ మతము వారైనా, ఏ దర్జా వారైనా తెలుగు మాతృభాషగా గల వారందరూ ఒక్క సంఘము వారనిన్ని, సంఘములోని వారందరూ అభివృద్ధి పొందితేనే కాని, సంఘము అభివృద్ధి పొందదనిన్ని, ఎవరు వెనుకబడ్డా సంఘఃమునకు నష్టమే అనిన్ని, ఎవరు త్రికరణశుద్ధిగా భావిస్తారో వారే దేశాభిమానము గలవారని చెప్పవలెను. స్వాభిమానము లేని వారికి స్వాతంత్ర్య వాంఛ పుట్టదు....

తెలుగువారికి పండిత పామర సామాన్యమైన దేశభాష కలదు. ప్రజాస్వామిక పరిపాలనము నిర్వహించడమునకు తగినవారుగా తెలుగువారిని తర్ఫీయత్ చేసే సంస్థలను స్థాపించాలి.

అన్ని విద్యలూ తెలుగువారికి నేర్పడమునకు తెలుగే తగిన సాధనము.

**– గిడుగు రామమూర్తి**

(సుమారు 80 ఏళ్ళ క్రితం తెలుగు పత్రికల సంపాదకులకు లేఖ నుండి)


రచనలకు, ఉత్తరాలకు

**డాక్టర్ సామల రమేష్‌బాబు,**

సంపాదకుడు, **అమ్మనుడి,**

జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com

దూరవాణి: కార్యాలయం : 0866-2439466

సంపాదకుడు : 9848016136




'యునెస్కో' అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవంగా 1952 ఫిబ్రవరి 21ని ప్రకటించడానికి కారణం – ఢాకాలో మాతృభాష కోసం జరిగిన ఉద్యమంలో నలుగురు యువకులు అసువులు కోల్పోయిన రోజు అది. ఆ బలిదానానికి చెరగని గుర్తుగా ఢాకాలో నిర్మించిన జ్ఞాపక చిహ్నం ఇది. ఢాకా విశ్వవిద్యాలయంలో రంగుల గ్రానైట్‌తో చిత్రించిన ఆ అమరవీరుల రూపాలివి. బంగ్లాదేశ్‌లో తెలుగువారి ఆచూకీ కోసం తెలుగువాణి ప్రముఖ కార్యకర్తలు డిసెంబరు నెలలో అక్కడ పర్యటించిన సందర్భంగా తీసిన చిత్రాలివి....




## లోపలి పుటలలో....



### కవితలు




కైసేత-ముఖచిత్రం : **కలిమిశ్రీ** రేఖాచిత్రాలు : **బాలి** పకపకలు : **సరసి**

తెలుగుజాతి పత్రిక
అమ్మనుడి
మాసపత్రిక
• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు

శాలివాహన శకం 1937 : మన్మథనామ సంవత్సర పుష్య మాసము
*(తైందాపి) బహుళ అష్టమి సోమవారము నుండి మాఘ *(వేగాపి)
బహుళ షష్టి సోమవారము వరకు
* తైందాపి * వేగాపి : తెలుగు నెలలు

### చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 6 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 600 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు NEFT / RTGS ద్వారా **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.
**AMMA NUDI - AXIS BANK, TENALI**
అక్కౌంట్ నెం. **915020010550189**
**IFSC Code : UTIB0000556**
ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆ వెంటనే దయతో – చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా

**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా – 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com

**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంపగలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ – పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరు, పోస్టాఫీసు పిన్‌కోడ్ నెంబరు తదితర పూర్తివివరాలను మీ చిరునామాలో తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి.
4. మీ చిరునామా మారినట్లయితే దయచేసి వెంటనే తెలియజేయండి.

## చందాదారులుగా చేరండి! చేర్పించండి!!

ఈ సంచికతో 'అమ్మనుడి' ఇప్పటికి 12 సంచికలు వచ్చాయి. చదువరుల నుండి అభినందనలను అందుకొంటున్నాం. ప్రోత్సహిస్తున్న అందరికీ ధన్యవాదాలు.

- ❊ అమ్మనుడి పత్రికను ప్రతినెల పోస్టులో పొందటానికి చందాదారులుగా చేరవలసిందే. బయట పత్రికలు అమ్మే స్టాల్స్‌లో ఈ పత్రిక లభించదు. చందాదారులకు మాత్రమే పంపిస్తాము.
- ❊ చందాల మీద ఆధారపడే ఈ పత్రికను నడుపవలసి ఉంది. అందువల్ల ఈ పత్రికలోని అంశాలు మీకు నచ్చినట్లయితే దయచేసి మీరు చందాదారులుగా చేరి/కొనసాగుతూ మీ మిత్రులను కూడా చేర్పించండి. పత్రికను ఆర్థికంగా శక్తివంతం చేయండి.
- ❊ ఇంతవరకు పత్రిక పరిచయం లేనివారికి కోరినచో ఒక సంచికను ఉచితంగా పంపగలము. వారి చిరునామా, ఫోన్ నెంబరు తెలియజేయండి.

## 'నడుస్తున్నచరిత్ర' చందాదారులకు...

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్న చరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్న చరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారి చందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటి వరకూ సరిపోతుందో – పత్రికను పెట్టి పంపే కవరుపై చిరునామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాము.

## నడుస్తున్న చరిత్ర శాశ్వత చందాదారులకు

'నడుస్తున్నచరిత్ర'కు రు.1000/-లు చెల్లించి, శాశ్వత చందాదారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వత చందా రు.5000/-లకు గాను రు.4000/- లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన. 'అమ్మనుడి'కి శాశ్వత చందాదారులుగా కొనసాగలేని వారు సాధారణ చందాదారుగా చేరి పత్రికను తెప్పించుకోవచ్చును. దయచేసి సహకరించగోరుతున్నాము.

## శ్రీ నెమ్మాని వెంకటరమణయ్య, తిరుపతి ఫోన్ :94926 55144



లోగడ 'నడుస్తున్న చరిత్ర'ను ఇప్పుడు 'అమ్మనుడి'ని అమితంగా అభిమానించే శ్రీ నెమ్మాని వెంకటరమణయ్య గారు నిబద్ధత కలిగిన తెలుగు పండితులు. వీరి స్వగ్రామం చిత్తూరు జిల్లా మదనపల్లి దగ్గర గల ముదివేడు గ్రామం. నెల్లూరు, చెన్నయ్, తిరుపతిలలో విద్యాభ్యాసం చేసి తెలుగు లెక్చరరుగా శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయంలో ఉద్యోగ విరమణ చేశారు. ఇప్పుడు 82 ఏళ్ళ వయసులో హైదరాబాదులో విశ్రాంతి తీసుకుంటున్నారు. పద్యం పట్ల మక్కువ, పద్య రచనపై పట్టు కలిగిన రమణయ్య గారు కొన్ని రచనలు చేశారు. తమ గురించి ఎక్కువగా రాయడానికి ఒప్పుకోని ఈ వినమ్రపండితవర్యులు తెలుగు భాషోద్యమానికి పూర్తి ప్రోత్సాహాన్నిస్తున్నారు. తెలుగుజాతి ట్రస్టు స్థాపన చేసినందుకు ఎంతో సంతోషిస్తూ 'ప్రోత్సాహకులు'గా విరాళం రు.10,000/-లు అందజేశారు.

## శ్రీ సడ్లపల్లె చిదంబరరెడ్డి, హిందూపురం ఫోన్ :94400 73636



కవి, రచయిత, వ్యవసాయ జీవితంలో ఓడిన రైతుబిడ్డ. రాయలసీమ రైతు సమస్యల మీద అక్కడి ప్రజల సజీవ ప్రాంతీయ యాసలో అనేక కవితలు, కథలు వ్రాశారు, వ్రాస్తున్నారు. తెలుగు ఉపాధ్యాయునిగా ఉద్యోగ విరమణ చేసిన చిదంబరరెడ్డిగారు ఇప్పుడు అంతర్జాల పత్రికలలో ఎక్కువగా వ్రాస్తున్నారు. నడుస్తున్న చరిత్రలో, అమ్మనుడిలో వీరి కథలు వచ్చాయి. 1952లో స్వాతంత్ర్యదినోత్సవం నాడు పుట్టిన వీరు ఆధిపత్య వాదాన్ని వ్యతిరేకించడంతోపాటు తన నేలను ప్రజలను అమితంగా ప్రేమించి, స్థానిక భాషా పదజాలానికి గౌరవం తేవడమనే ఆశయంతో రచనలు చేస్తున్నారు. భావనా పల్లవం, దృశ్య ప్రవాహం, అనే కవితా సంపుటాలను, ఇసక, కొల్లబోయిన పల్లె అనే కథా సంపుటాలను వెలువరించారు. ఇంకా కొన్ని ప్రచురణకు సిద్ధమవుతున్నాయి. వీరి కవితలు చాలా పురస్కారాలు పొందాయి. ప్రోత్సాహకులుగా రు.10,000/-లు తెలుగుజాతి ట్రస్టుకు విరాళం ఇచ్చారు. (52వ పుట కూడా చూడండి) ❊

# తెలుగుజాతి (ట్రస్టు) విన్నపం

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరిగింది. దానినే ఇప్పుడు **అమ్మనుడి** కొనసాగిస్తున్నది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు కొన్ని పుస్తకాలను ప్రచు రించవలసిన అవసరం ఏర్పడింది. పరిశోధన, శిక్షణ కార్యక్రమాల్ని కూడా చేపట్టవలసివుంది. ఇందుకోసం ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నమోదు చేయించాము. (92/2014). తెలుగు 'అమ్మనుడి"గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది.

2015 మార్చి నుంచి అమ్మనుడి పత్రికను ప్రచురిస్తున్నాము. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో భాగంగా తొలుత స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'**ను విడుదల చేశాము. త్వరలో మరికొన్ని ప్రత్యేకమైన పుస్తకాలను వెలువరించ బోతున్నాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో ఏర్పరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.



**ట్రస్టుకు విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.**

| | |
|---|---|
| రాజ పోషకులురు. 1,00,000/–లు | పోషకులు రు. 25,000/–లు |
| విశిష్ట పోషకులు రు. 50,000/–లు | ప్రోత్సాహకులు రు. 10,000/–లు |

దాత ఫొటోను, క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము. పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి. యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.

అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136 ట్రస్టీలు : **పారుపల్లి కోదండరామయ్య** 9505298565, **డా॥వెన్నిసెట్టి సింగారావు** 9393015584, **స.వెం.రమేశ్** 8500548142, **సామల లక్ష్మణబాబు** 9440448244



# తెలుగు భాషోద్యమ సమాఖ్య

## అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం-2016

# పిలుపు

2003 ఫిబ్రవరి 21 అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం నాడు 'తెలుగు భాషాద్యమ సమాఖ్యను స్థాపించడంతో తెలుగునేలపై భాషోద్యమ స్ఫూర్తి వెల్లివెరిసింది. తెలుగు భాషోద్యమ సమాఖ్య ప్రభుత్వాన్ని అనేక సమస్యలపై నిగ్గదీసి ఫలితాలను రాబట్టింది. 1 నుండి 10వ తరగతి వరకు తెలుగును ఒక సబ్జెక్టుగా తప్పనిసరి చేసిన జి.ఒ.86(2003), తెలుగుకు మంత్రిత్వశాఖను ఏర్పాటుచేసిన జి.ఒ.ఎం.909 (2013)లతో సహా ఎన్నో కీలక నిర్ణయాలను మార్పులను రాబట్టింది. తెలుగువారిలో మాతృభాషను రక్షించుకోవాలన్న ఆలోచనను నింపింది. ఆ స్ఫూర్తితో రచయితల సంఘాలు, ఉపాధ్యాయ సంఘాలు కూడా ముందుకు వచ్చాయి.

అయితే గత పన్నెండేళ్ళలో ప్రభుత్వాలు మరింతగా తెలుగును అణచివేయడానికి పూనుకొన్నట్లుగా వ్యవహరిస్తున్నాయి. ప్రభుత్వ నేతలు ఏమాత్రం పట్టని తీరులో వ్యవహరిస్తున్నారు. విద్య, పరిపాలనా రంగాలలో భాషను కాపాడుకొనేందుకు, భాషను అభివృద్ధి చేసుకొనేందుకు పెద్ద ఎత్తున ఉద్యమించక తప్పదు.

సమాఖ్య ఉద్యమం వల్ల తెలుగుకు ప్రత్యేక మంత్రిత్వశాఖ- రెండు రాష్ట్రాల్లోనూ ఏర్పడింది. కానీ వాటిముందు ప్రత్యేక కార్యక్రమమేమీ లేనందున అవి లాంఛనంగా ఉన్నాయి. ఇప్పుడు మనం మూడు డిమాండ్లతో ఉద్యమించవలసి ఉంది. వీటి సాధనకై ఉద్యమాన్ని ఈ అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం నుండి సాగిద్దాము.

**నిక్కచ్చులు (డిమాండ్లు)**

1) **ప్రాథమిక విద్యను రెండు రాష్ట్రాలూ తెలుగు/మాతృభాషలో తప్పనిసరి చేయాలి.**
2) **సమకాలీన అవసరాలకు తగ్గట్లు తెలుగును పెంపొందించుకోవడానికి ప్రత్యేకంగా ఒక తెలుగు ప్రాధికార సంఘాన్ని (డెవలప్‌మెంట్ అథారిటీని) నిపుణులతో నియమించాలి.**
3) **రెండు తెలుగు రాష్ట్రాలూ తమ సమగ్ర భాషావిధానాన్ని ప్రకటించాలి.**

ఈ మూడు నిక్కచ్చు(డిమాండ్లు)లతో మనం ముందుకు సాగాలి.

**2016 ఫిబ్రవరి 21 కార్యక్రమం**

రెండు రాష్ట్రాల్లోనూ- ఉద్యమ సంఘాలు, ఉపాధ్యాయ సంఘాలు, రచయితల సంఘాలు ఆ రోజున తమకు వీలైన విధంగా సభలు, ఊరేగింపులు జరిపి జిల్లా కలెక్టర్ గారికి, ఆర్.డి.ఒ.కు పై డిమాండ్లతో వినతిపత్రం ఇవ్వాలి. ఆ సమాచారాన్ని పత్రికలకు, మీడియాకు విడుదల చెయ్యాలి. నేరుగా ముఖ్యమంత్రికీ, ప్రభుత్వ ముఖ్య కార్యదర్శికీ, భాషా మంత్రిత్వశాఖకూ పంపాలి.

ఎవరికి వారే పూనుకొని కార్యక్రమాలను చేపట్టాలని విజ్ఞప్తి చేస్తున్నాము.


**డా॥ చుక్కా రామయ్య**
గౌరవాధ్యక్షులు
**డా॥ వి.సింగారావు,** ఆం.ప్ర.కన్వీనర్
సెల్ : 93930 15584

**డా॥ సామల రమేష్‌బాబు** అధ్యక్షుడు
98480 16136
**తిరువరంగం ప్రభాకర్** తెలంగాణ కన్వీనర్
98483 36848

సంపుటి : 1 సంచిక : 12
**అమ్మనుడి**
ఫిబ్రవరి 2016

సంపాదకీయం

# అమ్మనుడితోనే అభివృద్ధి

ప్రజల భాషలు ప్రవాహాల్లాంటివన్నమాట నిజం. వాటిలో మార్పులు చేర్పులు చోటుచేసుకొంటాయన్నదీ నిజమే. అయితే అదంతా ఆ భాషకు పుష్టిని కలిగించడానికి ఉపయోగపడాలి గాని, దాన్ని పరాయీకరించడానికి కాదు. ప్రజలపై పరభాషల పెత్తనం ఒక ఆధిపత్య లక్షణం. అన్ని ఆధిపత్యాలకు అది రహదారి. నేటి ప్రపంచీకరణ తొలిదెబ్బ ప్రజలు భాషల మీదపడింది. అది జాతి నడుమును విరగ్గొట్టి ఆత్మస్థయిర్యాన్ని పోగొడుతోంది. దీన్ని ఎదుర్కోకుండా ఏ ఇతర రంగాలలో ఆధిపత్యవాదాన్నీ మనం ఎదుర్కోలేం. భాషాస్వాభిమానాన్ని కోల్పోయి, పరభాషల కౌగిలిలో బందీలమైపోయిన తర్వాత– ఇక మన జీవన మూల్యాలన్నింటినీ కోల్పోవడం జరుగుతుంది. దీన్ని నిరోధించడం ఎట్లా అనేదే మనముందున్న ప్రశ్న. ఏ భావజాలానికి చెందిన రాజకీయ పార్టీ అధికారంలో ఉన్నా ఈ కోణాన్ని వదిలివేయకూడదు. స్వాభిమానాన్ని వదిలివేసిన తర్వాత నిజమైన అభివృద్ధి అంటూ ఉండదు. ఏ రంగంలో ప్రతిభతో ఎంత ఎదిగినా, మనది కిందిస్థానమే అవుతుంది.

ప్రపంచంలో 6000కు పైగా వున్న భాషలలో చిన్న చిన్న భాషలనేకం ఉన్నాయి. వాటిలో లిపి లేనివీ వున్నాయి, అతితక్కువ జనవాళి మాత్రమే మాట్లాడేవీ ఉన్నాయి. నాగరకత పెరిగేకొద్దీ, రాజకీయ అవసరాలు పెరిగే కొద్దీ, చిన్నభాషలు ఆ సమాజంలో వున్న పెద్ద భాషలతో కలిసిపోతాయి. కాని రాజ్యవ్యవస్థలు కుదురుకున్న సమాజాల్లో, దేశాల్లో పెద్ద భాషలు అధికార భాషలుగా కుదురుకొని ఎదుగుతాయి. భారతదేశంలో వందలాది భాషలున్నా పురాతన చరిత్ర, సాహితీ సంపద కలిగి వుండి కోట్లాది జనసమూహాల ఊపిరిగా వున్న 24 భాషలు రాజ్యాంగ రక్షణతో ఉన్నాయి. తెలుగు మాతృభాషగా గలవారు 18 కోట్లమంది ఉన్నారు. తెలుగుప్రజలు చారిత్రక, రాజకీయ కారణాల వల్ల చీలికలు పీలికలై వున్నా, కనీసం 9 కోట్లమంది తెలుగు ప్రజలతో రెండు రాష్ట్రాలున్నాయి. ఇవి పూర్తి భాషారాష్ట్రాలుగానే ఏర్పడ్డాయి. అన్ని అవసరాలకు ప్రజల భాష తెలుగును వాడుకొంటేనే అది ఎదుగుతుందనీ, అదే సరియైన ప్రజాస్వామ్య విధానమనే ఇంగితజ్ఞానం పాలకులకు లేకపోవడంవల్ల,ఇతర భాషల పెత్తనం నానాటికీ ఎక్కువయింది. ఇప్పుడు తెలుగు నెత్తిన కూర్చొని శాసించే స్థాయికి ఇంగ్లీషును పెంచుతున్నారు. ప్రాథమిక విద్యనుంచే ఆంగ్లంలో  చదువుకోవలసివచ్చినప్పుడు, విద్యార్థి తన అమ్మనుడి తనకు ఉపయోగం లేనిదైనందున దానిని క్రమంగా కోల్పోతాడు. వేలాది ఏండ్ల వారసత్వ విజ్ఞాన సంపదకు దూరమవుతాడు. తన సొంతదనాన్నే కోల్పోతాడు. ఇప్పుడు జరుగుతున్నదిదే.

తెలుగు మన ఊపిరి. దాన్ని తొలగించడమంటే ప్రజల ఉసురు తీయడమే. ఇది భావోద్వేగ సమస్య మాత్రమే కాదు. జాతి చావుబ్రతుకుల సమస్య. సాంస్కృతిక కార్యక్రమాలను, పండుగ పబ్బాలను ప్రభుత్వమే పెద్ద ఎత్తున నిర్వహించటం, సాంప్రదాయిక మతవిశ్వాసాలను పెంచి పోషించడం–ఇదంతా సంస్కృతిని కాపాడడమనీ, అదే భాషారక్షణ అనే భావనను పాలకులు ప్రచారం చేస్తున్నారు. పాలకులతోపాటు వారికి వత్తాసు పలుకుతున్న నేతలు, కొందరు రచయితలు భాషకు చేస్తున్న ద్రోహం అంతా ఇంతా కాదు. విద్య, పాలనా రంగాల్లో మటుమాయమైన తర్వాత, బ్రతుకుతెరువుకూ, వికాసానికీ తెలుగు సాధనం కాదని తేలిన తర్వాత–ఇక మిగిలేదేమిటి?

మన నేతలు ఇప్పుడు 'అభివృద్ధి' అనే మంత్రాన్ని జపిస్తున్నారు. వారిని ఎన్నికల్లో గెలిపించడమే కాదు, ఆర్థిక ప్రయోజనాలను కూడా ఈ నినాదం సమకూర్చిపెడుతోంది. ఆ అభివృద్ధిని సాధించటానికి ఇంగ్లీషుభాషే శరణ్యమని వారి నమ్మకం. అందువల్లనే ఇంగ్లీషుకూ దానితో కలిసి వస్తున్న పాశ్చాత్య సంస్కృతికీ తలుపులు బార్లా తెరిచారు.

# సంపాదకీయం

ప్రపంచీకరణ వల్ల వ్యాపారం, మార్కెటింగ్, ఉత్పత్తి రంగాలను బహుళజాతి సంస్థలు ఆక్రమించడంతో ఈ భాషా సాంస్కృతిక దాడి బలంగా వ్యాప్తి చెందుతోంది. ఇంతకూ వారు చెప్పే ఆ అభివృద్ధి అంటే ఏమిటి? దేశంలో కేవలం అయిదారుగురు చేతుల్లోనే దాదాపు 5 లక్షల కోట్ల సంపద ఉండటం, ధనికులకు పేదలకు మధ్య దూరం నానాటికీ పెరిగిపోతుండడం అభివృద్ధికి నిదర్శనమెట్లా అవుతుంది? ప్రజలు తమ మౌలిక భాషా సంస్కృతులకు తిలోదకాలిచ్చి, ప్రపంచ ఆధిపత్య శక్తులకు లొంగి, వారికి ఊడిగం చెయ్యడాన్ని అభివృద్ధి అంటామా? జాతులు స్వంత వ్యక్తీకరణ స్వేచ్ఛను, వారసత్వాన్ని కోల్పోవడమంటే ఆధిపత్య వాదులకు లొంగిపోవడమే కాదా!? ఇంతకాలం మన దేశీయ ఆధిపత్యవాదులు కులాన్ని మతాన్ని అడ్డుపెట్టుకొని చేసిన పెత్తనాన్ని సహించినట్లే ఇప్పుడు పెచ్చుమీరిపోతున్న భాషా సాంస్కృతిక ఆధిపత్య వాదానికి తలొగ్గవలసిందేనా? ఏ స్థాయిలోనైనా, ఏ దశలోనైనా ఆధిపత్యవాదుల నెదుర్కోకుండా మానవ సమూహాలు నిలద్రొక్కుకోగలవా? వికసించగలవా?

కావలసిన వైజ్ఞానిక సహకారాన్ని ఇచ్చిపుచ్చుకుంటూ ఎదగడమా–లేక, అన్నిటికీ మోరలెత్తుకొని, చేతులు చాపి 'భిక్షాందేహి' అనడమా? పురోగతికి దారి ఏది?

కేవలం రాష్ట్ర ప్రభుత్వాన్నో కేంద్రప్రభుత్వాన్నో కాదు; మొత్తం మన రాజకీయ పాలనా వ్యవస్థను, రాజకీయ పార్టీలను, నేతలను అన్నిటిని, అందరిని దృష్టిలో పెట్టుకొనే ఈ మేధోమథనాన్ని మీ ముందుకు తెస్తున్నాం. స్వదేశీ, స్వావలంబన, అధికార వికేంద్రీకరణ ఆశయాలుగా ఎదిగి, పాలనలో కొచ్చిన పార్టీలు– అందుకు పూర్తి విరుద్ధంగా ప్రవర్తిస్తుంటే, ప్రతిపక్ష పార్టీలు తమ సిద్ధాంతాలకు, జాతి ప్రయోజనాలకు తిలోదకాలిచ్చి, అధికారపక్షాన్ని కూలదోయడమే అజెండాగా పనిచేయడం జరుగుతున్నది. అభివృద్ధి పేరుతో రాజ్యాధికారాన్ని పొందిన మన నాయకులు ప్రజల స్వాభిమానాన్ని పెరగకుండా చేసేందుకే భాషా సంస్కృతులను మొదలంటా కూల్చివేయడానికి శ్రమిస్తున్నారు.

అభివృద్ధి అంటే జాతి ఆత్మవిస్మృతి కాదు. అభివృద్ధి అంటే–తమ జాతి విలువల్ని కాపాడుకుంటూ తమదైన శైలిలో ఎదుగుతూనే ప్రపంచ విజ్ఞానపుటంచులను అందుకోవడానికి అన్ని రంగాల్లో పోటాపోటీగా నిలబడగలిగే స్థాయిని సముపార్జించుకోవడం. అభివృద్ధి అంటే– బీదరికాన్ని సమూలంగా నిర్మూలించి, ప్రజలందరికీ విద్యను, విజ్ఞానాన్ని, సుఖమైన జీవనాన్ని అందుబాటులోకి తేవడం. అందరికీ సమన్యాయాన్ని, సామాజిక భద్రతను, గౌరవాన్ని కలిగించడం. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని వారి భాషలోనే వారికందించి, వారిని అభివృద్ధి కృషిలో భాగస్వాముల్ని చేయడం. ఇదీ నిజమైన అభివృద్ధి.

ఈ 21న మళ్ళీ అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవాన్ని జరుపుకోబోతున్నాము. 16 ఏళ్ళ క్రితం ఐక్యరాజ్యసమితి విద్యాసాంస్కృతిక విభాగం 'యునెస్కో' ఎన్నో సర్వేలు, చర్చలు జరిపిన తర్వాత, ఫిబ్రవరి 21ని అన్ని భాషల వారూ అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవంగా జరుపుకోవాలని పిలుపు ఇస్తూ, ప్రతి ఏడూ మాతృభాషల రక్షణకై చేపట్టవలసిన కార్యక్రమాలను గురించిన అంశాలతో సందేశాన్నిస్తున్నది. 1952లో ఢాకాలో తమ మాతృభాష కోసం ఉద్యమిస్తున్న విద్యార్థుల బలిదానం ఫిబ్రవరి 21నే జరిగింది. కనుక యునెస్కో ఆ తేదీని మాతృభాషల పరిరక్షణకు ఒక ఉద్యమ సంకేతదినంగా ప్రకటించింది.

తెలుగు భాషోద్యమానికి సంబంధించి 2003 ఫిబ్రవరి 21నే మన కార్యాచరణతో మొదలైంది. దాన్ని ఇంకా ముందుకు తీసుకుపోవాలి. మన ప్రభుత్వం తప్పుడు విధానాల వల్ల మన మేధావుల పట్టనితనం వల్ల ఇప్పుడు మన భాష ప్రమాదపుటంచులకు చేరుతున్నది. మన ఊపిరైన అమ్మనుడి తెలుగును రక్షించుకోవడానికి ఈ సందర్భంలో మళ్ళీ మనం పునరంకితులం కావాలి. 'అమ్మనుడి తోనే అభివృద్ధి' అని మనం నినదించాలి.

**1-2-2016**

సామల రమేష్ బాబు

-కొయిషిరో మత్సూరా

అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవం సందర్భంగా

# యునెస్కో డైరెక్టర్ జనరల్ నుండి వెలువడిన సందేశాలు

**అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం (ఫిబ్రవరి 21) సందర్భంగా ప్రతి ఏటా 'యునెస్కో' డైరెక్టర్ జనరల్ ఒక సందేశాన్ని విడుదల చేస్తారు. తొలి అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవాన్ని 'యునెస్కో' కచేరిలో 2000 సం.ఫిబ్రవరి 21న జరపడంతో ఇది మొదలైంది.**

**ఈ సంచికలో 2000, 2001, 2002, 2004 సంవత్సరాల్లో యునెస్కో డైరెక్టర్ జనరల్ సందేశాలను ప్రచురిస్తున్నాం. తక్కిన వాటిని కూడా తర్వాతి సంచికల్లో ఇస్తాము. ప్రతి ఏడూ ఒక ప్రత్యేకమైన అంశంపై వెలుగు ప్రసరింపజేస్తున్న ఈ సందేశాల వల్ల మాతృభాషల్ని కాపాడుకోవడం, అభివృద్ధి చేసుకోవడంపై ఎన్నో కోణాల నుంచి విస్తారమైన సమాచారం మనకందుతుంది. విద్యాసంస్థలు, పరిశోధకులు, భాషోద్యమకారులు వీటిని గమనించాలని కోరుతున్నాం. -సం.**

## తొలి సందేశం 21 ఫిబ్రవరి 2000

అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం నేడు మొట్టమొదటి సారిగా యునెస్కో ప్రధాన కచేరిలో ఇవాళ జరుపుకుంటున్నాం. నవంబర్ 1999లో యునెస్కో సాధారణ సదస్సులో ప్రస్తావించబడిన మాతృభాష-మాతృభాషా దినోత్సవం చర్చాంశాలు, ఆపై యునెస్కో విడుదల చేసిన విధానం ఆధారంగా ఇవాళ ఈ పర్వదినం మొదలయింది.

మాతృభాషలకు ఒక రోజును అంకితమివ్వడం ద్వారా యునెస్కో సభ్య దేశాలు భాషలను మనిషి యొక్క సాంస్కృతిక వారసత్వాల్లో ఒక ముఖ్యమైన భాగమే కాక సమస్త మానవ కల్పనకూ, వైవిధ్యానికి చిహ్నమని భావించి గుర్తిస్తున్నాయని చెప్పడానికి ఎంతో సంతోషంగా వుంది. దాదాపు ఆరు వేల భాషలను ఇవాళ మనం మాట్లాడుతున్నాం. ఇవి మానవుడు తన పరిసరాలతో, తోటి మనుషులతో మాట్లాడుకునేందుకు రూపొందించుకున్న అద్భుతమైన పనిముట్లు, ఆయా భాషలను సంస్కృతికి అద్దం పట్టి సాంస్కృతిక సంపదను పదిలపరచడం జరుగుతుంది. ఏ సమాజంలో ఈ భాషలు ప్రాణం పోసుకున్నాయో, ఏ సమాజపు చరిత్ర పుటలను తమ అక్షరాలతో తయారు చేశాయో, ఆ సమాజం యొక్క ప్రతిబింబాలుగా నిలుస్తున్నాయి ఈ భాషలు. సమాజాలు ఏనాడూ ఒక దానిని విడిచి మరొకటి విడిగా అస్తిత్వంలో లేనే లేవు.అలానే భాషలు కూడా పలు సమాజాల మధ్య ఆడుతూ పాడుతూ పెరిగాయి. అన్ని భాషలూ ఆ విధంగా సంకర భాషలే.

చిన్నప్పటి నుండి పలు భాషలలో విద్యనభ్యసించడం ద్వారా, బహుభాషా విద్యావిధానం ద్వారా సాంస్కృతిక బహుళత్వాన్ని కాపాడవచ్చు. అంతర్జాతీయ సమభావన, సహనం, ఒకరినొకరు గౌరవించుకోవడం లాంటి భావాలు, అలాంటి స్థితిగతులు ఏర్పడతాయి. భాష అనేది మనిషి రూపొందించుకున్న సంపదలలో అతి విలువైనది, అలాగే అతి సున్నితమైనది కూడా. మన సంస్కృతి- సంప్రదాయాలను, విజ్ఞానాన్ని రూపొందించి, భద్రపరిచి, పంచే అవసరాలకు మాతృభాషను మించిన సాధనం లేదు. అదే సమయంలో **పరభాషా వ్యామోహం ద్వారా, మాతృభాష అస్తిత్వానికే** గొడ్డలిపెట్టు పెడుతున్నాము. భాష ఎంత సున్నితమైనదంటే **ఒక రెండు తరాలు భాషను వాడకుంటే, భాషకు మనుగడే ఉండదు.**

## రెండవ సందేశం -21 ఫిబ్రవరి 2001

మన అమ్మనుడి మనం నేర్చుకునే భాష మన లోలోపలి ఆలోచనలకి పుట్టినిల్లు. మనం దేశ దేశాలు ప్రయాణించి ఉండవచ్చు. ఆఖరుకి పరదేశంలో మన స్థిరనివాసం ఏర్పరుచుకుని ఉండవచ్చు గాక. వేరే భాషలను ఈ సందర్భంగా నేర్చుకుని, ఆ భాషలపై పూర్తి పట్టును సాధించి ఉండవచ్చు గాక. కానీ మన జీవితాంతం మనం మొట్ట మొదటిసారిగా మన చుట్టూ ఉన్న లోకాన్ని చూస్తూ నేర్చుకున్న మాతృభాషలోని పదాలే లోకాన్ని మరింత చక్కగా అర్థం చేసుకోవటానికి దోహదపడతాయి.

మనం మాతృభాషా దినోత్సవాన్ని రెండవసారి జరుపుకుంటున్నాం. మానవత్వం ఇన్నేళ్ళుగా అభివృద్ధి పరుచుకున్న భాషాభావావేశాన్ని గుర్తు చేసుకుని గౌరవించుకునే తరుణం ఇది. రమారమి ఆరువేల ఏడు వందల భాషలలో భూ ఉపరితలంపై మనం ఒకరినొకరం మాట్లాడుకుని మన భావాలను పంచుకునేందుకు వాడుకుంటున్నాం. ఒక్కో భాష ప్రత్యేకమైనది. మొత్తం ప్రపంచం ఆయా భాషలలో రూపుదిద్దుకొని ఎన్ని భాషలున్నాయో, అన్ని ప్రపంచాలను మనకు కనపడేలా చేస్తున్నది. రకరకాల శబ్దాలు, భావాలు, కూడికలు, చిహ్నాలు, కాలం-గమనం గురించి తెలిపే పదాలు ఎన్నో, ఎన్నెన్నో.

ఖచ్చితంగా, కొన్ని భాషలు, దైవ సందేశాన్ని తెలిపే మాధ్యమంగా ఐతేనేం, ప్రభుత్వ భాషగా ఐతేనేం మన సమాజంలో ఇతర భాషలకు మించి గౌరవాన్ని, పెద్ద స్థానాన్ని పొందాయి. మరికొన్ని భాషలు భౌగోళిక హద్దులు దాటి మానవ సంభాషణలకి అనువైనవిగా చెలామణి పొందుతూ, ఇతర భాషలను కింది స్థాయికి దించుతున్నాయి. అయితే ప్రతి ఒక్క భాష-తన సొంత సంప్రదాయాలను, తర్కాలను, భాషను మాట్లాడే వ్యక్తుల కాల్పనికతను రంగరించుకుని మానవ జీవితానికి సమానంగా హక్కును పొందింది. సాటి మనిషి ప్రాణం ఎంత విలువైనదో, ఎంత ప్రత్యేకత కలిగినదో, అదే విధంగా ప్రతి భాష కూడా అంతే విలువైనది. మన భాషల వైవిధ్యాన్ని ఒక పటంపై

ఒక్కో భాషకీ ఒక్కో రంగు చొప్పున చూపిస్తే, మానవాళి తన కోసం సృష్టించుకున్న వేవేల హరివిల్లులు గోచరిస్తాయి. పుస్తకాలు, గ్రంథాలు ఉన్న భాషలు బలమైనవి. అవి లేని భాషలు బలహీనమైనవి, అంత రించడానికి దగ్గరగా ఉన్నాయి.

భాషలు సమాజంలోకి మరింత లోతుగా చొచ్చుకుపోవడానికి 'అర్థం కాకపోవటమనే' విషబీజాలు అడ్డంకిగా ఉన్నాయి. అయితే అర్థం కాకపోవటం వలన, మరింత సులువైన పదాల సృష్టి. ఆ వైపుగా ఆలోచనలు అడుగువేయటం మొదలుపెడితే, భాషలు మరింత సమృద్ధమవుతాయి. ఇలా జరగటానికి మనిషి ఆలోచించటం మొదలు పెట్టాలి, **ఆ ఆలోచనల ద్వారా చేసే ప్రతి పనికీ, ప్రతి అడుగుకూ భాషను జోడించాలి.** అందుకు ప్రశాంతంగా నిర్మల మనస్కులై భాష గురించి ఆలోచించాలి.

ఇతర భాషలను నేర్చుకోవడాన్ని (అంతకన్నా ముందు స్వభాషలో పట్టు సాధించడం) ప్రోత్సహించడం, అనువాదాలను అభివృద్ధి పరచడం, చర్చల ద్వారా ఒకరికొకరికి పడని భాషా సమూహాల మధ్య (మరియు ఒకే భాష మాట్లాడే వివిధ సమూహాల మధ్య) సారూప్యతలను పెంచడం–శాంతి వైపుకు పయనించడంలో తొలి అడుగులు. అలాంటి చర్చలు జరిగే సమయంలో కనీసం రెండు గొంతులు విని పించాలి. అంటే రెండు భాషలు తప్పనిసరిగా వాడబడాలి. అంతకన్నా మెరుగైన పద్ధతి–భాషల **సారూప్యతలను గుర్తించి వ్యత్యాసాలను గౌరవించి, వివిధ భాషల అస్తిత్వాన్ని తెలియపరచడం, ఈ భాషలలో ఉన్న ఎన్నో విలువైన పదనిధులను పంచుకోవడం, భాషల వ్యత్యా సాలను మానవ ఆలోచనలలో గల వైవిధ్యానికి ప్రతీకగా గుర్తించడం; ఇవన్నీ చేయడం ద్వారా మానవత్వం పరివర్తన సాధించి, జీవితాన్ని–మనసును మరింత తేజోమయం చేసుకోవచ్చు.**

## మూడవ సందేశం -21 ఫిబ్రవరి 2002

స్పానిష్ మాటొకటుంది–హాబ్లాండో, సీఎంతెయిందె ల హెం తె– అర్థం– 'మాట్లాడ్డం ద్వారా మనుషులు ఒకరినొకరు అర్థం చేసు కుంటారు" అని. మన రోజువారీ జీవితాలలో భాషను ఏదో మన జీవితంలో వచ్చిపోయే మనుషుల్లా, వస్తువుల్లా పరిగణించి, ఇవ్వాల్సినంత ప్రాధాన్యత ఇవ్వము. భాష మన జీవితాలలోకి ఎంత పెనవేసుకుపోయిందంటే, భాషకున్న మౌలిక పనితనం–ఒక సంభా షణా పనిముట్టుగా, ఎదుటివారి భావాలను అర్థం చేసుకునే సాధనంగా పని చేయడం మానేసి, వేరే ఏదో భాష చేత చేయిస్తున్నాం. ఎదుటివాడు మాట్లాడలేని విధంగా మాట్లాడ్డం, ఎదుటివాడికి అర్థం కాని విధంగా పదప్రయోగం చేయడం– పెద్ద పెద్ద భాషలకు మనం తొడిగించిన కిరీటాలు, కవచాలూను. ప్రపంచంలో మాట్లాడబడే అన్ని భాషలలోకి మన భావప్రకటనను చేయడానికి, వేరొకరు చెప్పింది సరిసూటిగా అర్థం చేసుకోవడానికి ఒక ప్రత్యేక భాష ఉంది. ఈ భాషను మనం తొలిసారిగా మన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని గుర్తిస్తూ నేర్చుకున్నాం. మనకంటూ ఒక లోకం ఈ భాషలో ఎన్నటికీ పదిలంగా తయారు చేసుకున్నాం.మన అమ్మానాన్నలు, స్నేహితులు, ఆత్మీయులు, బడి అన్నిచోట్లా ఈ భాష ద్వారానే వేరే భాషలకు వంతెనలు కట్టుకున్నాం. అదే మన మాతృభాష, ఇదే మన చిన్ననాటి భాష, మన కుటుంబ అనురాగాల భాష, తొలిసారిగా సమాజమనే యుద్ధరంగంలోకి అడుగుపెట్టినపుడు మన వద్ద ఉన్న ఒకే ఒక్క బ్రహ్మాస్త్రం ఈ మాతృ భాష. మూడోసారి అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవాన్ని జరుపు కుంటున్నాం. రెండేళ్ళ క్రితం మొదటిసారి జరుపుకున్నాం. ఈ ఆచరణ ద్వారా ప్రపంచ భాషల వైవిధ్యాన్ని, వేరు వేరు సాంప్రదాయాల మధ్య వారధిగా అవి పోషిస్తున్న పాత్రను, వాటి సృష్టి–అభివృద్ధిలలో గల మానవకృషిని గౌరవిస్తున్నాం. మనం ఇవాళ ప్రపంచవ్యాప్తంగా ఆరువేల పైబడి భాషలలో మాట్లాడుకుంటున్నాం. ప్రతి భాషకు తనదైన ధ్వనులు, అర్థాలు, వ్యాకరణం ఉన్నాయి. కొన్ని భాషలు ఎక్కువ భౌగోళికంగా వ్యాప్తి చెంది ఉంటే, మరికొన్ని భాషలు ఎక్కువమంది మాతృభాషీయులను కలిగి ఉన్నాయి. కొన్ని భాషలకు లిపి ఉంది, కొన్ని భాషలస్సలు వ్రాయబడవు. వివిధ సంప్రదాయాలకు అద్దం పడుతూ ఆయా భాషలలో వ్రాసే విధానాలు, సైగలు, కవళికలు ఉన్నాయి. ఇన్ని వైవిధ్యాలున్నప్పటికీ పెద్దంతరం చిన్నంతరం అని భాషలను గుర్తించకుండా, **అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం సందర్భంగా మనం అన్ని భాషలకు సమాన గుర్తింపును ఇస్తున్నాం. ఎందుకంటే ప్రతి ఒక్క భాష మానవత్వానికి ప్రతీక, మనం గర్వించి దగ్గర చేసుకోవాల్సిన నిధి.**

**ఈనాడు, మరే ఇతర రోజుకూ తీసిపోకుండా, ఇతరుల మాతృ భాషా సంస్కృతులను గుర్తిద్దాం, మన భాషా సంస్కృతులకు సమాన హోదాలో చూద్దాం. ఎవరికి వారు వారి మాతృభాషను గౌరవించినట్టే అందరం అన్ని భాషలను గౌరవిద్దాం. ఎందుకంటే ఈ భాషలే మన అస్తిత్వానికి ఒక 'అక్షర' రూపం.**

## నాలుగవ సందేశం -21 ఫిబ్రవరి 2003

ఈ సంవత్సరం మనం మాతృభాషా దినోత్సవాన్ని నాలుగవసారి జరుపుకుంటున్నాం. ఈ వేడుకను జరుపుకోవటంలో గల మన లక్ష్యం మాతృభాషని ప్రోత్సహించి, అభివృద్ధి పరిచి, బోధనా మాధ్యమంగా వాడేవిధంగా తీసుకోవాల్సిన అన్ని చర్యలను కార్యరూపం దాల్చేలా చేయడం.

**మాతృభాష** గురించి ఇంత ప్రచారం ఎందుకు? ఎందుకంటే భాష **అనేది మానవాళి యొక్క కాల్పనికతను, అందులో గల వైవిధ్యాన్ని చూపగలిగే ఒకే ఒక్క సాధనం. భాష మనం మాట్లాడుకునేందుకు గల ఒకే ఒక్క మార్గం. మనం అర్థం చేసుకునే మాధ్యమం, మనం అర్థం చేసుకున్న విషయాల గురించి ఆలోచించే వాహిక. మనం ప్రపంచాన్ని చూసే కిటికి ఈ భాష, మన గతానికి, ఇప్పటికీ, భవిష్య త్తుకీ మధ్య గల లంకెలను కలిపేది భాష, ప్రతి భాష కూడా తనతో పాటు తన అభివృద్ధి జరిగిన కాలాన్ని, తిరిగిన దేశాలను, కలిసిన వివిధ జాతుల ప్రజల శబ్దాలను తనలో నిక్షిప్తం చేసుకుంటుంది. ప్రతి భాషకు ఈ విధంగా ఎంతో గొప్ప చరిత్ర ఉంది.**

మాతృభాష ప్రతి వ్యక్తి జీవితంలో ఒక ప్రత్యేకత కలిగి ఉంది. మనిషి పుట్టినప్పటి నుండి అతని లోకాన్ని అతనికి అర్థమయ్యేలా చూపిస్తుంది. ఆ రూపు మనిషి జీవితాంతం మరిచిపోడు. కానీ అదే వ్యక్తి మరెన్నో భాషలను నేర్చుకుంటాడు, మర్చిపోతాడు కూడా. ఇతర భాషలను నేర్చుకోవడమంటే, ఇతరులు లోకాన్ని చూసే దృక్కోణంలో

క
వి
త

# అగాధంలోంచి...



**ముం**దు మనం నిలవాలి, నిలబడాలి!
మోకాళ్ళపై కాదు, ముంజేతులపై కాదు
కాలి మునివేళ్ళపై ముద్రాక్షరంలా నిలబడాలి!
కలల అంచున కక్కుబట్టిన కాగితంలా నిలబడాలి!
కళల మించున ఎక్కుబెట్టిన కాకలా, కేకలా నిలవాలి!
అక్షరం ఆలాపన కావాలి...
సభ సకల కళల సమర చైతన్య సాధనం కావాలి!

**క**రుచుకొనే గడ్డీ గాదం, నాచూ పీచూ దులుపుకొని
తెంచుకోవలసిన తూళ్ళూ, తాళ్ళూ తుంచుకొని
పెంచుకోవలసిన పాత్రా, పరవళ్ళు పంచుకొని
తెలుగుజాతి అడుగు చెలమగా, కాల్వగా, నదిగా
చెమట జెల్ది చేరుకొని చెళ్ళు పెళ్ళున పోరెత్తి పోటెత్తాలి!

**క**లసివచ్చే కరళ్ళతో కదం తొక్కి
తెల్సి హెచ్చే హోరుగాలై, ప్రతి అడ్డంకినీ కూలదొయ్యాలి
అప్పుడే అక్కడో ఆట..ఇక్కడో పాటగా చెంగులెత్తే
రంగుల రాజకీయాలకు తెరపడ్తుంది.
దొంగతొత్తుల వేషాలకు ముగింపు వస్తుంది.
ఎప్పుడైతే కాసుబాసల పొంగుకు గండిపడి
కుచ్చీలు పోసే కాపట్యానికి కాలం చెల్లిపోతుందో
అప్పుడు జనం నుడికి సత్తువ చేరుతుంది, తేటతనం వస్తుంది!

**పా**త్రధారులూ, సూత్రధారులూ తేలిపోయాక
పడవ తెరచాప దించటమెందుకు?

**ఒ**డ్డునున్నవాళ్ళు ఒడ్డనే వుంటే
తెడ్డువేసేవాడేగా తీరం దాటేది!

**అ**వసరమైతే మనిషి తాబేల్లా లోనికి జరిగి
అవకాశాలన్నీ అందుకోవాలి!
కొట్టెకాకిలా ప్రతి తెరువూ పట్టుకోవాలి!

**అ**లల నెమ్మది చూచి సముద్రం అణిగి వుందనుకుంటే ఎట్టా?
అగాధం సందిట్లోనేగా బడబానలం దాగుండేది!

**–వెలుగు వెంకట సుబ్బారావు**
92909 42433

మన లోకాన్ని మార్చుకోవడం, వేరే విధంగా లోకాన్ని చూడటం.

మాకు సంతృప్తినిస్తున్న విషయమేమిటంటే ఈ వేడుకలు మరింత విజయవంతంగా జనాలు జరుపుకోవటం. ఎన్నో దేశాల్లో మాతృభాషా సంబంధ కార్యక్రమాలు జరుపుకోవటం, భాషల నిధులను గుర్తించటం పెరుగుతోంది.

కొసోవోలో ఈ రోజున "వేరు వేరు దేశాల వేరు వేరు విద్యార్థులు" అన్న అంశంతో తమ విద్యార్థులను వేరే దేశ –భాష– సంస్కృతుల మధ్యకు పంపడం, వేరే దేశ విద్యార్థులను తమ దేశ –భాష– సంస్కృతులను తెలుసుకునేందుకు ఆహ్వానించే కార్యక్రమాన్ని మొదలుపెట్టారు. మెక్సికోలో మాతృభాషలో కవితా పఠనం, పాటలు, గేయాలు, కథలు, నాటకాలు వేయడం ద్వారా జరుపుకున్నారు. ఫిలిప్పైన్స్‌లో 'ఇన్ ది గాలక్సీ ఆఫ్ లాంగ్వేజెస్, ఎవ్రీ వర్డ్ ఇజ్ ఎ స్టార్' (**భాషలనే పాల పుంతల్లో ప్రతి పదమూ ఒక నక్షత్రమే!** ఒక స్టార్) పేరున ఒక కార్యక్రమం జరిపారు. బాంగ్లాదేశ్‌లో అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవ సంస్థను ఢాకాలో నెలకొల్పారు. ఈ సంస్థకు శంకుస్థాపన ఐక్యరాజ్యసమితి సెక్రెటరీ–జనరల్ శ్రీ కోఫీ అన్నన్ 2000లో చేశారు.

మన కృషికి తగ్గ ఫలితాలు మనం పొందుతున్నందుకు నాకు చాలా గర్వంగా ఉంది. సాంస్కృతిక, భాషా వైవిధ్యాలు గుర్తింపు పొంది, గౌరవించబడి, ఉత్సవాలు జరుపుకుంటున్నందుకు ఒకింత సంతోషంగా కూడా ఉంది. ఇంకెన్నో ఫలాలను మనం రుచిచూడ బోతున్నాం. **మాతృభాషా పరిరక్షణ ద్వారా స్థిరమైన అభివృద్ధి సాధ్యమౌతుంది. జీవ వైవిధ్యం–భాషా వైవిధ్యం రెండూ వేరు వేరు అంశాలు కావు. భాషలు అంతరించిపోవడం వలన ప్రపంచంలోని కొన్ని జీవనిధులు కూడా కనుమరుగైపోయాయి. మానవాళికి కనిపించని నిధి ఈ భాషలు. మనిషి జీవితంలో విడదీయరాని బంధం భాషలది.** భాషలు కూడా మనిషి లాగానే పుడతాయి, పెరుగుతాయి. ఐతే ఏ స్థాయిలో, ఏ స్థితిలో ఉన్న భాషలను పరిరక్షించుకోవాలి. మన సాంస్కృతిక వైవిధ్యాన్ని కాపాడుకునేందుకు అదొకటే మార్గం. యునెస్కో ఈ దిశగా తన అవిరళ కృషి ద్వారా ఎన్నో పనులను చేపట్టింది, చేపడుతుంది. బహుభాషా సమాజాలలో చిన్ని భాషల మనుగడ కష్టమవుతుంది. అలాంటి చోట్లా, ఇతర సమాజాల్లోనూ, అన్నింటా భాషా విధానాలను రూపొందించే దిశగా మాతృభాషల ప్రోత్సాహానికి కృషి చేస్తుంది. ❊

(2004 నుండి తక్కిన సందేశాలను
వచ్చే సంచికలో చూడండి)

-డా॥గారపాటి ఉమామహేశ్వరరావు

# భాషా సంక్షోభం-ప్రపంచీకరణ

**భా**షలకు జనసత్వాలూ కాలానుగుణమైన మనుగడనూ చేకూర్చేది వాటి వాడుకే. అంతేకాదు, వాడవలసిన అన్ని రంగాలలోనూ వాడటమే భాషల జవజీవాలకు నిదర్శనం. కానీ, చాలా భారతీయ భాషలు ఇప్పుడు కొన్ని రంగాలకే పరిమితం కావడం ఒక ఊహించరాని పరిణామం. అంటే విద్య, వైద్య, ఉద్యోగ, పరిశోధనా రంగాలలో తమ వాడకం నుంచి భారతీయ భాషలు మెల్లగా వైదొలగడం భవిష్యత్తులో వాటి ఉనికికే చేటు తెచ్చింది ఐతే, భారతీయ భాషల వాడకం ఇట్లా కొన్ని రంగాలకే పరిమితం కావడం ఇదే మొదటిసారి కాదు. ప్రాచీన భారతంలో ఆధునిక భారతీయ భాషల వాడకం ఒకటి రెండు అలౌకిక రంగాలలోనూ ఒకటీ అరా లౌకిక రంగాలలోనూ సంస్కృత ప్రాకృతాలకు తావిచ్చిన సందర్భాలు ఉన్నా, అక్కడ వాటి వాడకం కొంతవరకూ పరిమితమే. అది ఆధునిక భారతీయ భాషల ఉనికికి ఎట్లాంటి విఘాతాన్నీ కలిగించలేదు. అది లౌకిక వ్యవహార రంగం కాకపోవడం చేత ఆధునిక భారతీయ భాషలను మాట్లాడే ప్రజలపై దాని ప్రభావం అతితక్కువ. అత్యంత ముఖ్యమైన లౌకిక వ్యవహార రంగాలలో భారతీయ భాషల స్థానే ఇంగ్లీషు వాడకం విస్తరించడంతో- భారతీయ భాషలకు పరిపుష్టిని కలిగించే వాడుకకు బీటలు పడి, వాటి వినాశనానికి బాటలు వేస్తోంది.

కోట్లాదిమంది వాడుకరులనూ కంప్యూటర్లనూ అనుసంధానిస్తూ అనునిత్యం లక్షలాది పుటల జ్ఞాన సృష్టికి వేదికగా నిలుస్తూ, నేటి ఆధునిక మానవ ఆవిష్కరణలో తలమానికమైన అంతర్జాలం, విశ్వవ్యాప్త జాలికావలయం అత్యంత వేగంతో భూగోళం మొత్తానికీ విస్తరిస్తోంది. ప్రపంచంలో ఆవిష్కృతమౌతున్న సమస్త జ్ఞానమూ ఇప్పుడు అంతర్జాలానికి అందుబాటులో ఉంటోంది. ప్రపంచంలోని సమస్త విపణి వీధులూ అంతర్జాలానికి అనుసంధానించబడుతున్నాయి. విశ్వవిద్యాలయాలూ, పరిశోధనశాలలూ, వైద్య ఆరోగ్య సేవాకేంద్రాలూ, ప్రభుత్వపాలనా వ్యవహారాలూ, బ్యాంకు సేవలూ, పరీక్షలూ అన్నిరకాల రవాణా సౌకర్యాల సేవలకూ సంబంధించిన విషయాలన్నిటికీ అంతర్జాలమే ఆధారం. ఈ పరిజ్ఞానాన్ని అందుకోవడానికి ప్రాప్తి స్థానం అంతర్జాలంలోని జాలికా వలయాలలోని పరిష్కరిణులు, శోధకాలు, వివిధ ప్రాయోగిక ఉపకరణాలు సమస్తం ఇంగ్లీషులోనే కాదు, కొద్దో గొప్పో అన్ని భాషలలోనూ లభ్యమౌతున్నాయి. ప్రపంచీకరణ ప్రముఖ ఉద్దేశం సమాచార సాంకేతిక ఉపకరణాలను ప్రపంచవ్యాప్తంగా అందుబాటులోకి తీసుకురావడమే. అయినా, అది ఊహించని విధంగా ప్రపంచ మార్కెట్లను ఆక్రమించి అభివృద్ధి చెందుతున్న బడుగు దేశాలను ఆర్థిక, సాంస్కృతిక పరంగా అన్ని విధాలా కొల్లగొట్టి, ఆర్థిక అసమానతలను పెంచుతోంది. ఐతే, దీనికి విరుగుడుగా స్థానికీకరణ లేక ప్రాంతీకరణ కూడా ఉంది. అంటే అంతర్జాతీయంగా లభ్యమయ్యే ప్రతి సమాచార సాంకేతిక ఉపకరణమూ స్థానికీకరణం చెంది స్థానిక లేక ప్రాంతీయ భాషలలో లభ్యమౌతాయి. అంతర్జాలంలో దొరికే ప్రతిదీ స్థానికీకరణం పొందవచ్చు. అసలు నేడు భాష అడ్డుగోడగా మారవలసిన అవసరం లేదు. ఎవరి భాషను వారు వాడుకొనేందుకు అంతర్జాలం వీలు కలిగిస్తుంది. ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్న సాంకేతిక భాషాశాస్త్రం (లాంగ్వేజ్ టెక్నాలజీ) భాషలమధ్య యంత్రానువాదాన్ని అందుబాటులోకి తెస్తోంది. దీనితో ప్రపంచంలోని ఒక భాషలోని విషయాన్ని మరొక భాషలోకి అతి స్వల్పకాలంలో అనువదించుకోవచ్చు. భాషలు ఇక ఏమాత్రం అడ్డుగోడలు కావు. ఎవరి భాషలో వారు, వారి వారి కార్యకలాపాలను జరుపుకోవచ్చు. ఎవరి మాండలికంలో వారు రాసుకోవచ్చు వేరొక మాండలికానికి మార్చుకోవచ్చు. నేడు తనకు వచ్చిన మాండలికంలో రాయడం, నచ్చిన మాండలికంలో చదువుకోవడం సాధ్యం. కాళోజీ కన్న కల సాకారమయ్యే రోజులు ఇవి. ఒకరి మాండలికం మరొకరిపై ఒకరి భాషను మరొకరిపై రుద్దవలసిన అవసరం లేదు. ఏదైనా ఒక భాషను గానీ మాండలికాన్ని గానీ ప్రామాణికమని గుర్తించవలసిన అవసరం లేదు. ఎవరికి ఇష్టమైన భాషలో వారు రాసుకోవచ్చు. రాసినదాన్ని మరొక భాషలోకి మార్చుకొనే ప్రక్రియలు ఉపయోగంలోకి వస్తున్నాయి. ఇవాళ అవి గుణాత్మకంగా లేకపోయినా త్వరలో గుణాత్మకమైన భాషాతంత్ర ఉపకరణాలు అందుబాటులోకి వస్తాయి.

ప్రపంచీకరణతో భాషాసంపర్కం అనివార్యం. పరభాషా సంపర్కం వలన భాషల ఉనికికి ముప్పు రావలసిన అవసరం లేదు. అయితే భాషాసంపర్కంలో తూకం మారినప్పుడు ఆయా భాషల మను గడలో మార్పులూ చేర్పులూ జరుగుతుంటాయి. ఈ మార్పులు కీలక మైన సందర్భాలలో భాషాసంపర్కంలోని తూకం కుంటుపడుతుంది. ఇది రెండు రకాలుగా జరగవచ్చు. మొదటిది, భాషలో మార్పులు. రెండవది, వాడకంలో మార్పులు. భాషలో మార్పు, పదజాలంలోనూ, భాషానిర్మాణం లోనూ కావచ్చు. అన్యభాషా పదజాలం ఎంత ఎక్కువగా చేరితే, భాషకు అంత శబ్దసంపద పెరుగుతుంది. దీనివలన భాషలో సందర్భానుసారంగా సాగే గుణం, సర్దుకుపోయే తత్వం పెరుగుతుంది. **అయితే నేడు ఆంగ్లభాష వల్ల తెలుగులోని ప్రాథమిక పదజాలం తగ్గిపోతోంది. ప్రాథమిక పదజాలంలో మార్పులు దూరంగా పొంచివున్న ముప్పుకు సంకేతం.** ప్రాథమిక పదజాలంలో మార్పులు వచ్చాయంటే భాషలోని మిగిలిన పదజాలాన్ని అన్యభాషా పదజాలం ఆక్రమిస్తోందని చెప్పాలి. ఇక రెండవ రకానికి చెందిన **సమతూకంలేని భాషాసంపర్కం వలన వాడకంలో వచ్చే మార్పులు భాషల విధ్వంస కారకాలు. ఈ మార్పు సాధారణంగా సంపర్క భాషలలోని ఒక భాష మరొక భాషను వాడే రంగాలలో తిష్ఠవేయడం వలన వస్తుంది.** అంటే భాషను వాడుతున్న రంగాల కుదింపు మొదలయ్యింది అన్నమాట. ఇంకా చెప్పాలంటే **వాడకంలో తగ్గుదల కనిపించిన భాషలు అవన్నీ**

**అంటే చావు దాపురించిన భాషల జాబితాకెక్కినట్టే. ఇట్లా భాషల వాడుక రంగాలు తరిగిపోవడం- దాపున పొంచివున్న ముప్పుకు సంకేతం.** ఈ రకమయిన నష్టం అంతకు ముందు సంస్కృత, ప్రాకృతాల వలనగానీ, పర్షియను, అరబిక్ లాంటి పరాయి భాషలవల్ల కానీ తెలుగుభాషకి ఎదురుకాలేదు. **ప్రాచీనకాలంలో మత-ధార్మిక రంగాలలో సంస్కృత ప్రాకృత భాషలది పైచేయి అయినా, ఆ రంగాలు భాషల మనుగడకు అంత కీలకమైనవి కావు.**

నేటి భాషాసంక్షోభానికి ప్రధాన కారణం మన భాషలు ఉద్యోగ భద్రతను కలిగించలేక పోవడమేనని చాలామంది ఊహ, ఉద్యోగ భద్రతే జీవికకు ప్రధాన ఆధారం, భారతీయ భాషలలో చదువులు ప్రస్తుతానికి ఉద్యోగ భద్రతనూ జీవన హామీని ఇవ్వలేకపోతున్నాయి అని అంటారు. మన ప్రభుత్వాలు భారతీయ భాషామాధ్యమాలలో చదువుకున్నవారికి ఉద్యోగాలు ప్రత్యేకించడం లేదు. దీనికి కారణాలు అనేకం. ఒకటి- ఇంగ్లీషు మాధ్యమంలో చదువుకున్నవారు ఎక్కువ నైపుణ్యం గలవారనీ, తెలివిగల వారనీ, సంస్కారవంతులనీ, పాండిత్యం ఉన్నవారినీ, ప్రపంచ జ్ఞానం గలవారనీ, మన సమాజంలో ఒక దురభిప్రాయం ఉంది. కొంతమంది పెద్దల ఆలోచన అట్లాగే ఉంది. రెండు- మనవి బహుభాషా సమాజాలు గనుక ఇంగ్లీషు తెలిసిన వారు ఎక్కువమందితో వ్యవహారాలు నడుపగలరు. కానీ **ఇవి ఏవీ నిజం కాదు.** మన రాష్ట్రాలలో నూటికి తొంభై పాళ్లు ఒక భాష మాత్రమే తెలిసినవాళ్లు. అంటే **తొంభై శాతం మందికి తెలిసిన భాషను వదిలి, పరాయి భాషలో పాలన సాగించాలనుకోవడం ప్రజాస్వామ్యం ఎలా ఔతుంది?** ఇక, మన విశ్వవిద్యాలయాలు పరిశోధనలో వెనకబడి ఉండడానికి కారణం, పరిశోధనా పత్రాల ప్రకటనలో ఇతర దేశాల వారితో తులనంలో తక్కువ ఉండడానికి ప్రధాన కారణం **మనకు తెలియని, మనకు రాని భాషలో రాయవలసి రావడమే. మన శాస్త్ర సాంకేతిక రంగాలలో రావలసినన్ని పాఠ్యగ్రంథాలను రాయలేకపోవ దానికి కారణం మనకి ఇంగ్లీషు మీద పట్టు లేకపోవడమే.** ప్రతి ఏడాదీ మన కాలేజీలూ విశ్వవిద్యాలయాలూ దిగుమతి చేసుకునే ఇంగ్లీషు పుస్తకాల విలువే కొన్నివేల కోట్ల రూపాయలు, ప్రపంచంలోనే అత్యధికంగా సైన్సూ, టెక్నాలజీ, ఇంజనీరింగు, గణితశాస్త్ర రంగాలలో గ్రాడ్యుయేట్లను తయారుచేస్తున్నా **పరిశోధనలో వెనుకబడి వున్నాం.** ఈమధ్యనే భారతదేశంలో వైజ్ఞానిక రంగానికి తలమానికమైన బెంగుళూరులోని భారతీయ విజ్ఞానశాస్త్రాల సంస్థలో ఇన్ఫోసిస్ అధ్యక్షుడు నారాయణమూర్తి మాట్లాడుతూ భారతదేశంలో సైన్సూ, ఇంజనీరింగ్, టెక్నాలజీ రంగాలలోని పరిశోధనలలో గత అర్థ శతాబ్దంలో గుర్తించదగ్గ పరిశోధన ఒక్కటి కూడాలేదని చెప్పడం గమనార్హం. **దీనికి ప్రధాన కారణం మన ఇంగ్లీషు చదువులు కావచ్చు. పరాయి భాషలో జరిగే మన చదువులు, జ్ఞాన సముపార్జనలో కంటే, భట్టీపట్టి తిరిగి పరీక్షలలో రాయడానికి మాత్రమే పనికివస్తున్నాయి.** ఈ చదువులు, మన విద్యార్థులకు, అర్థం చేసుకొని చేసే జ్ఞాన సృష్టికీ అవిష్కరణలకూ దోహదం చేయడం లేదు. ఇంగ్లీషులో చదువుకుంటే ఉద్యోగం వస్తుందనీ, విదేశాలు వెళ్లవచ్చుననేది ఇంకొక ప్రతీతి. విదేశాలకు ఎందరు వెళుతున్నారు? ఎవరు వెళుతున్నారు? **ప్రతి సంవత్సరం మన దేశం నుంచి విదేశాలకు వెళ్లేవారు లక్షమంది వరకూ ఉండవచ్చు. అది మన జనాభాలో ఒక శాతంలో వందోవంతు కన్నా తక్కువ. వారికోసం దేశం మొత్తం మన భాష కాని భాషలో విద్య నేర్చుకోవలసిన అవసరం ఏమిటి?** ఒకప్పుడు ఉన్నత విద్యకు మాత్రమే పరిమితమైన ఇంగ్లీషు మాధ్యమం ఇప్పుడు ప్రాథమిక విద్యకు కూడా విస్తరించింది. అయితే **జనాభాలో రెండున్నర లక్షలమందికి మాత్రమే ప్రథమ భాషగా ఉన్న ఇంగ్లీషును విద్యామాధ్యమంగా నిర్ణయించడం మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం వేస్తున్న తప్పటడుగు అని చెప్పక తప్పదు.** ఇంగ్లీషు మాధ్యమ విద్య వలన మన ప్రాంతీయ ఉద్యోగ వనరులు దెబ్బతింటున్నాయి. మనలో భారతీయ భాషలు చదివేవారూ, వాడేవారూ తగ్గిపోవడం వలన ఆయాభాషలలో పుస్తక రచన, ప్రచురణలు తగ్గిపోవడం జరుగుతోంది. దీనికి తోడు అంతర్జాతీయ విపణిలో వెల్లువలా అందుబాటులోకి వస్తున్న ఇంగ్లీషు పుస్తకాలూ, పత్రికలపై మనం ఆధారపడక తప్పడం లేదు. దీనివలన మన విదేశీ ద్రవ్యం వృధా అవుతోంది. అంతేకాక మన సొంత వనరులనూ ఉద్యోగావకాశాలనూ బాగా దెబ్బతీస్తోంది. దీనివలన అంతర్జాలంలో ఇప్పుడిప్పుడే విస్తరిస్తున్న మన భారతీయ భాషలు నిరాదరణకు గురవుతున్నాయి. మాతృ భాషల విద్యామాధ్యమంలో చదువుకున్నవారి ఆలోచనా విధానంలోనే స్వతంత్రేచ్ఛ, స్వేచ్ఛ, ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం, ఉదాత్తమైన ఆలోచనలకు స్థానం ఉంటుంది. దీనికోసం భారతీయ భాషల వాడకానికి సంబంధించిన ప్రతిబంధకాలను తొలగించుకునే ప్రయత్నం చేయాలి.

స్థూల జాతీయ ఉత్పత్తి సాధనలో తెలుగూ తదితర భారతీయ భాషల వాటా సింహభాగం. భారతీయ భాషల మనుగడ కోసం, ప్రత్యేకంగా మాతృభాషపైని మమకారంతోనో తేనె లాంటి తెలుగు అనో, అందమైన అజంత భాష అనో లేక ఆత్మగౌరవం, సంస్కృతీ సాహిత్యం అంటూనో భాషలు బతికి బట్టగట్టే రోజులు కావు ఇవి. భాషల మనుగడకు అసలు సిసలు ఆనవాళ్లు కావాలి. వాటి ఉనికిని వెదికి పట్టుకోవాలి. ప్రజా సేవల వినియోగంలో, గనులూ, వస్త్రాలూ, మందుల తయారీ మొదలైన బడాపారిశ్రామిక రంగాలలో సమాచార వినిమయంలో, వైద్య, వ్యాపార, వాణిజ్య, నిర్మాణ, రవాణా మొదలైన సేవా రంగాలలో, వ్యవసాయం, పాడి, నేత మొదలైన సంప్రదాయ రంగాలలో, సినిమా తదితర మాధ్యమాలలో విరివిగా వాడే భాషలు ఏవి? ఏయే భాషల వాడకం ఎంతెంతో లెక్కలు తేలవలసివుంది. మన స్థూల జాతీయ ఉత్పత్తిలో పద్దెనిమిది శాతంగా ఉన్న వ్యవసాయ సంబంధ రంగాలలో తెలుగూ తదితర భారతీయ భాషలే ప్రధాన భాషలు. సుమారు యాభైఎనిమిది శాతంగా ఉన్న స్థూల జాతీయ ఉత్పత్తికి ఆధారమైన సేవల రంగంలోనూ ప్రధానమైనవి తెలుగూ తదితర భారతీయ భాషలే. ఇక స్థూల జాతీయ ఉత్తత్తిలో ఇరవైనాలుగు శాతంగా ఉన్న పారిశ్రామిక రంగాలలో నగానికి పైగా భారతీయ భాషలే వాడుకలో ఉన్నాయి. అంటే మన స్థూల జాతీయ ఉత్పత్తికి ఆధారమైన మన భాషలను మనం ఎందుకు ఆదరించడం లేదు? వాటిని వాడేందుకు సరైన వాతావరణం కల్పించడం ప్రజా ప్రభుత్వాల బాధ్యత అని గుర్తించాలి గదా. దీనికి ముఖ్య కారణం ఈ రంగాలలో

వాడే తెలుగూ తదితర భాషల వాడుకకు అధికారికమైన ఔపచారిక గుర్తింపు లేకపోవడమే. ఉదాహరణకు, వ్యవసాయ రంగంలో పొలాన్ని దున్ని, నాట్లువేసి, మందులు చల్లి, ఎరువులు వేసి, పంటలు పండించి మార్కెట్లకు చేర్చే వరకూ కావలసిన జ్ఞానాన్ని శాస్త్రీయ పద్ధతులలో వారం పదిరోజులపాటైనా రైతులకు తెలుగులో శిక్షణను అందించ డానికి మనం చేసిన పని ఏమిటి? ఇలాంటివే వందలాది రంగాలలో ఉన్న సంఘటిత అసంఘటిత శ్రామిక వర్గానికి, ఆయా రంగాలలో నైపుణ్యాల పెంపుకు కావలసిన జ్ఞానాన్ని తెలుగులో అందించటానికి ఈ ప్రభుత్వాలు ముందుకు రావాలి. అంటే నైపుణ్యం కొన్ని రంగాలకే పరిమితం కాదు. నైపుణ్యం అన్నిచోట్లా అవసరం. ఎలాంటి పనికైనా ఒక నిర్దిష్ట పద్ధతిలో నేర్చుకున్న నైపుణ్యం ఈ దేశ అభివృద్ధికి దోహదం చేస్తుంది.

చివరికి, దూరదృష్టిలేని మన విద్యావిధానాల వలన మన భాషలన్నీ పూర్తిగా కనుమరుగయ్యే ప్రమాదం ఉంది. ప్రపంచీకరణ ప్రభావం వల్ల శీఘ్రగతిన విస్తరిస్తున్న ఆంగ్లభాష అధిపత్య పదఘట్టనల కింద దేశీయ భాషలన్నీ నలిగిపోతాయి. **విద్యావిధానంలో మాతృభాషా వ్యవహారానికి అవకాశం లేనప్పుడు భాష అంతరించిపోతుంది. దానితో పాటుగా జాతీ, సంస్కృతీ, తమ అస్తిత్వాన్ని కోల్పోతాయి. తద్వారా భావి భారతంలో సమాజం సంక్షోభంలో పడుతుంది. కుటుంబ సంబం ధాలు దెబ్బతింటాయి. పెద్దలపట్ల పిల్లలకు ఆసక్తీ, వ్యక్తుల మధ్య విలువలూ అంతరిస్తాయి. దేశీయ భాషా వ్యవహార జాతులన్నీ త్వరిత గతిన అంతరించిపోయే ప్రమాదం ఉంది. ఇది మూమ్మాటికీ జీవ విధ్వంసమే, పరోక్షంగా జీవ విధ్వంసానికి కారణమయ్యే భాషా విధానాల పట్ల న్యాయస్థానాలూ చట్టసభలూ పునరాలోచన చేయాలి.** జీవ విధ్వంసాన్ని అరికట్టేందుకు మాతృభాషా మాధ్యమం, వినియోగం తప్పనిసరి చేస్తూ రాజ్యాంగ సవరణ చేయాలి. అట్లా కానప్పుడు త్వరలోనే మనం భాషను ఔట్‌సోర్సింగ్ చేసుకోబోతున్నామన్నమాట. అంటే ఆంగ్లం, ఇప్పుడు ఔట్ సోర్సింగ్ భాషగా అవతారమెత్తబోతోంది. మన చేతులకు తడి అంటకుండా, మనకు అనుభవంలోకి రాకుండా పనికానిచ్చుకోవడమే గదా ఔట్‌సోర్సింగ్! దీంతో సమాచార విని మయంలో మన భాషల ప్రమేయాన్ని తోసిరాజనడమే.

(ఆంధ్రజ్యోతి - వివిధ- 4 జనవరి 2016 నుండి.. ధన్యవాదాలతో..)

-రచయిత హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయ ఆచార్యులు.
ఫోన్ : 98661 28846

కవిత

## 'తల్లినుడి' తెలుగును కాపాడుకుందాం

ఎంత ప్రాచీనమో మన తెలుగు మాట
అంత ప్రాచీనమే ఈ తెలుగు పాట ॥

1. కోటిలింగాల నాణాలపై పేర్లుగా
హాల భూపాలు గాథలలో పదాలుగా
రేనాటి చోళుల శిలా శాసనాలుగా
ఏనాడో కనిపించి దినదినము వికసించి,

అద్దంకి తరువోజతో ఆదిపద్యమై
బెజవాడ మధ్యాక్కరల మలికవిత్వమై
కురిక్యాల జినవల్లభుని తొలి కందమై
రెండు వేలేండ్లుగా నిండుగా ఎదిగినది

2. వేంగి నన్నయ భారతము మొదటి గ్రంథము
పాల్కుర్కి సోముకృతి తొలి సొంత కావ్యము
కావ్యమై, శతకమై కమ్మని ప్రబంధమై
రమ్యమౌ జానపదమై యక్షగానమై

ఆధునిక సాహిత్యమందెన్నొ రూపులై
మాటగా పాటగా, మరి పద్యకవితగా
సామెతలు, శాస్త్రాలు, కథలు, పొడుపు కథలు
నవలలై, నాటకాలై, వచన కవితలై
కవనాన వచనాన కమనీయముగ ఒదిగె

3. ఈ తెలుగు సాహిత్యమెంతొ విలువైనది
ఈ తెలుగు అవధానమెంతొ వింతైనది
ఈ తెలుగు సుకవిత్వమెంతొ రసవంతమై
ఈ దేశ పరదేశముల స్తుతుల నందినది

పరప్రాంతముల తెలుగువారలు పరితపించ
స్వంత రాష్ట్రములోనె చతికెల బడె నేడు
ఆంగ్ల భాషా మోహమది కొంత తగ్గించి
'అమ్మనుడి' మన తెలుగు నాదరించితె మంచి

తే.గీ. మాతృభూమిని ప్రేమించు మనిషి మనిషి
మాతృమూర్తిని సేవించు మనిషి మనిషి
మాతృభాషను మాటాడు మనిషి మనిషి
మాతృభాషను కాపాడు మంచి మనిషి

– **'మలయశ్రీ'**, కరీంనగర్,
98665 46220

*(21 ఫిబ్రవరి 2016 అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవ సందర్భంగా)*

-ఎడమ శ్రీనివాసరెడ్డి

# ఆంగ్లం ముఖ్యమే కాని... ఆలోచించే సామర్థ్యం మరీ ముఖ్యం!

**ఇంగ్లీషు భాష రెండు అంచులున్న కత్తి. అది ప్రపంచాన్ని త్వరితగతిన చూడడానికి, అర్థం చేసుకోవడానికి ఉపయోగపడుతుంది. దానివలన ప్రపంచ పోకడలు, నిజమైన అభివృద్ధి ఏమిటో తెలుసుకోవడానికి, ప్రతి వ్యక్తి తన వంతు పాత్రను సరిగ్గా నిర్వర్తించడానికి తోడ్పడుతుంది. మరొకవైపు మనల్ని మనం సరిగ్గా అర్థం చేసుకోకుండా అడ్డుగోడల్ని నిర్మిస్తుంది, బానిసత్వపు మత్తులో ముంచుతుంది. కేవలం వినిమయదారులుగా మారుస్తుంది. వైవిధ్యత, సంస్కృతి ప్రమాదంలో పడేటట్లుగా చేస్తుంది. మొదటి అంచు విముక్తి కోసం అయితే రెండవది కేవలం భావ వ్యక్తీకరణకు మాత్రమే, బానిసత్వాన్ని పెంచేందుకే.**

**1835లో బెంటిక్, మెకాలేల కాలం నుండి బ్రిటీష్ వలస వాదులు ఇంగ్లీషును రెండవ పనికే వాడుకున్నారు. వారి పాలనను సులభతరం చేసుకోవడానికి కేవలం ఇంగ్లీషు రాయడం, చదవడం తెలిసిన వారిని తయారు చెయ్యడమే వారి లక్ష్యం, ఎనభైల తర్వాత ప్రారంభమైన సాంస్కృతిక సామ్రాజ్యవాదం కూడా ఇదే పనిని మరొక లక్ష్యం కోసం మరో రూపంలో చేపట్టింది. ప్రపంచ మార్కెట్‌కు వినిమయదారులను చేయడం, బానిసత్వపు మత్తును తెలియకుండా ఇవ్వడం- దీని లక్ష్యం అయితే, ప్రపంచీకరణ దాని రూపం.**

### ఇంగ్లీషుతో బంధం- చారిత్రక కారణాలు

1921లో బ్రిటిష్ వలసపాలకుల నుండి విద్య మన ఆధీనంలోకి వచ్చింది, 1886 మొదలు మన ఆధీనంలోని విద్యను గ్లోబల్ శక్తులకు అప్పచెప్పడం మొదలయింది. 1921 నుండి 1986 వరకు మనకు సంధి కాలం. మన పునరుజ్జీవనానికి బీజాలను వేయాల్సిన ఈ సంధికాలం ఆ పనిలో వైఫల్యం చెందింది, ప్రయత్నాలయితే జరిగాయి, కాని అప్పటి ప్రాధాన్యతలు, పేదరికం, సంకుచిత రాజకీయ అంశాలు ఈ వైఫల్యానికి కారణాలు, మూడు ప్రధాన విషయాలలో జరిగిన ప్రయత్నాలు గుర్తించ దగినవి, 1. బోధనా మాధ్యమం, 2. వొకేషనల్ విద్య, 3. కామన్ స్కూలు.

పని పట్ల గౌరవాన్ని పెంచడానికి విద్యతో పనిని జోడించే చర్యలు సక్రమంగా జరగక పోవడం వలన వొకేషనల్ విద్యను తగిన విధంగా అభివృద్ధి చెందించడంలో విఫలమయ్యాము. 1921లో బ్రిటిష్ వారి పరిధి నుండి విద్య మన చేతుల్లోకి వచ్చినప్పటినుండి 1947 వరకూ దేశమంతా ప్రాథమిక, సెకండరీ స్థాయి వరకు బోధనా మాధ్యమంగా స్థానిక భాషలను పెంపొందించే ప్రయత్నాలు జరిగాయి. 1947 తర్వాత ఉన్నత విద్యలో కూడా స్థానిక భాషలనే బోధనా మాధ్యమంగా అభివృద్ధి పరచాలనే లక్ష్యాలను ఏర్పరచుకున్నారు. ఇంగ్లీషు భాషను కేవలం భావవ్యక్తీకరణ పరికరంగానేగాక విముక్తి సాధనంగా పరిగణించడమే ఈ లక్ష్యాల పరమార్థం. అయితే ఇతర రాజకీయ ప్రాధాన్యతలు, హిందీని బలవంతంగా రుద్దే ప్రయత్నాలు, స్వాతంత్ర్యం రావడానికి ముందు ఇంగ్లీషుపై ఉన్న అయిష్టత తగ్గడం, ఇంగ్లీషు విద్యను పొందిన వారికి ఉపాధి, ఉద్యోగ అవకాశాలు పెరగడం, సమాజంలో ఎక్కువ గౌరవం లభించడం, వీటి వలన ఇంగ్లీషుపై మోజు అధికమయింది. సంపన్న వర్గాలు, ఆ తర్వాత మధ్య తరగతి వర్గాలు ఇంగ్లీషు విద్య పట్ల మొగ్గు చూపడంతో రెండు రకాల స్కూళ్ళ వ్యవస్థలు ఏర్పడినాయి. ఉన్నత, మధ్య తరగతి వర్గాలకు ఇంగ్లీషు మీడియం స్కూళ్ళు- ఇవి ఎక్కువగా ప్రైవేటువి- మిగిలిన పేద వర్గాలకు స్థానిక మాధ్యమ స్కూళ్ళు- ఇవి ప్రభుత్వ స్కూళ్ళు. స్వాతంత్ర్యం వచ్చిన 17 సంవత్సరాల తర్వాత నియమించబడిన కొఠారి కమీషన్ రెండు రకాల స్కూళ్ళ వ్యవస్థలు సామాజిక అసమానతలకు ఎలా కారణం అవుతున్నాయో వివరించింది. దీనికి పరిష్కారంగా ఈ అసమానతలను తగ్గించే చర్యగా కామన్ స్కూల్ విధానాన్ని ప్రతిపాదించింది. కామన్ స్కూలు విధానం అమలయి ఉన్నట్లయితే రెండు రకాల స్కూళ్ళ వ్యవస్థలు చాలా వరకు తగ్గేవి, బోధనా మాధ్యమ సమస్య కూడా ఇంత తీవ్రంగా ఉండేది కాదు. విద్యా విషయాల్లో ముందంజ వేసి ఉండేవాళ్ళం.

1986 తర్వాత సాంస్కృతిక సామ్రాజ్యవాద ప్రాబల్యం వలన విద్య ప్రైవేటీకరణ పెరిగిపోయింది, దీనితో ఇంగ్లీషు మీడియం వ్యాప్తి పతాక స్థాయిని చేరుకొని ప్రపంచీకరణ సృష్టించిన అవకాశాలన్నిటిని ఇంగ్లీషు మీడియంలో చదివినవారే పొందేటట్లు చేసింది. తీవ్రమయిన ప్రైవేటీకరణ వలన ఈ ప్రైవేటు ఇంగ్లీషు చదువులు కూడా రెండు రకాలుగా విభజింపబడినాయి.

వ్యాపారదృష్టి లేని విద్యా సొసైటీల ఆధ్వర్యంలో నడుపబడిన స్కూళ్ళు ఒకింత నాణ్యతా ప్రమాణాలతోనే చదువులను అందించాయి, కాని వాటి సంఖ్య తక్కువ. లాభాపేక్షతో ఎక్కువ సంఖ్యలో స్థాపించబడిన స్కూళ్ళు మాత్రం ప్రజల బలహీనతలను సొమ్ము చేసుకొని సరైన విద్యా ఫలితాలను అందించలేక పోయాయి.

1986 కు ముందు ప్రాంతీయ భాషల్లో చదువుకున్న వారు కూడా సరైన విద్యా ఫలితాలనే పొందగలిగారు. దేశాభివృద్ధిలో పాలు పంచుకున్నారు. **కాని 1986 తర్వాత విస్తృతమైన ఇంగ్లీషు మాధ్యమం సామాజిక ఉన్నతికి ఇంగ్లీషు మాధ్యమం కావలసిందేననే అపోహను సృష్టించింది.**

మొత్తమ్మీద దేశంలో నానా రకాలైన స్కూలు వ్యవస్థలు ప్రభుత్వ, ప్రైవేటు రంగాలలో ఏర్పడినాయి. ఫలితంగా సామాజిక అసమానతల తీవ్రత ఎక్కువయింది.

## విద్యా నమూనానా లేక బోధనా మాధ్యమమా– ఏది ప్రధాన సమస్య?

ఇంగ్లీషు రాకపోవడం వలన విద్య, ఉద్యోగ అవకాశాల్లో సమానత్వం సాధించలేకపోవడం, అది అసమానతలకు దారి తీయడం, తద్వారా కొన్ని వర్గాలు– ముఖ్యంగా దళిత, బహుజన వర్గాలు సామాజిక వెలి(social exclusion)కి గురవుతున్నాయి. ఇంగ్లీషును నేర్చుకోవడం ద్వారానే సామాజిక సమ్మిళితం (social inclusion) జరుగుతుందని ఈ వర్గాలకు చెందినవారు భావిస్తున్నారు. ఇలా భావించే వాళ్ళంతా ప్రైవేటు స్కూళ్ళ మాదిరి ప్రభుత్వ స్కూళ్ళలో కూడా ఇంగ్లీషు మీడియంను ప్రవేశపెట్టాలని డిమాండ్ చేస్తున్నారు. జాతీయోద్యమ కాలంలో నాయకులంతా ఇంగ్లీషు మీడియంలో చదువుకోవడం వలననే ఉద్యమ స్ఫూర్తిని పొందగలిగారు, పూలే, అంబేద్కర్ లాంటి వాళ్ళు విమోచన ఉద్యమాలను ప్రారంభించగలిగారు, అందుకనే దళిత, బహుజనుల విముక్తికి ఇంగ్లీషు విద్య కావాలని కోరుతున్నారు. ఉత్తరప్రదేశ్ లోని బంకా అనే గ్రామంలో 2010 సంవత్సరంలో గుడి కట్టి. ఇంగ్లీషు దేవతను ప్రతిష్టించారు. కాని ఇంగ్లీషును సరైన రీతిలో నేర్చుకోవడం ఎలా? అనే అంశం విస్మరించబడుతున్నది. ఇప్పుడున్న విద్యా నమూనాను మార్చకుండా ఇంగ్లీషునే కాదు. సరైన రీతిలో జీవించడానికి కావలసిన ఏ ఇతర విద్యావిషయాలను కూడా అందించే పరిస్థితులు లేవు. కాబట్టి **విద్యా నమూనా మార్పు గురించి మాట్లాడకుండా మాధ్యమం మార్పు గురించి మాత్రమే మాట్లాడితే ప్రయోజనం ఉండబోదు. ఇంకా చెడుకు దారి తీస్తుంది.**

పరిపాలన సౌలభ్యం కోసం ఇంగ్లీషు తెలిసిన ఉద్యోగులను తయారుచేయడమే వలస పాలకుల లక్ష్యం అయినప్పటికీ, ఇంగ్లీషును నేర్పడంలోని బోధన, అభ్యసన సూత్రాలను పూర్తిగా మరవలేదు కనుకనే సరైన ఇంగ్లీషును నేర్చుకోగలిగారు. కాని ప్రస్తుత విద్యా నమూనా సైన్సు, లెక్కలకే అతి ప్రాధాన్యతను ఇస్తుంది. భాషను కేవలం భావ వ్యక్తీకరణకోసమే నేర్పుతుంది. ఈ పరిస్థితులలో ఇంగ్లీషును విముక్తి సాధనంగా మార్చడం కష్టం, కాబట్టి విద్యా నమూనాను మార్చకుండా, బోధన, అభ్యసన సూత్రాలను పరిగణనలోకి తీసుకోకుండా యధాతథంగా ఇంగ్లీషును ప్రవేశపెట్టడం వలన లాభం ఉండబోదు. చారిత్రిక కారణాల వలన ఇంగ్లీషుతో సాంగత్యం ఏర్పడిన దక్షిణ అమెరికా, ఆఫ్రికా, భారత ఉపఖండాలలో విద్యా వెనుకబాటుకు ప్రాంతీయ భాషలను నిర్లక్ష్యం చేయడమే ప్రధాన కారణం అని నిపుణులు చెబుతున్నారు. ఈ అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకోకుండా, ప్రజలు కోరుతున్నారు కాబట్టి ఇంగ్లీషును ప్రవేశపెట్టాలనుకోవడం అపరిపక్వచర్య అవుతుంది. ఇది ఎలాంటిదంటే, గతంలో బూతు సంభాషణల సినిమాలను వరుసగా తీస్తున్న ఒక తెలుగు సినిమా దర్శకుడిని ఓ పాత్రికేయుడు, అయ్యా, సినిమా దర్శకులకు సామాజిక బాధ్యత ఉండాలి కదా? అని ప్రశ్నించినపుడు, ప్రజలు చూస్తున్నారు కాబట్టి మేము తీస్తున్నాము అని బదులిచ్చాడు. విద్యా విధాన నిర్ణయాలలో విద్యా విషయక నిపుణుల అభిప్రాయాలకు ప్రాధాన్యత ఉండాలి. చారిత్రిక, సామాజిక, ఆర్థిక, తాత్విక, మానసిక, బోధన అభ్యసన శాస్త్రాల నియమాలననుసరించి అనేక కోణాల నుంచి సమస్యలను విశ్లేషించి నిర్ణయాలను చేయాలి. ఒకే దృష్టి కోణంతో సూచించబడే పరిష్కారాలు సంక్లిష్ట సమస్యలను తీర్చలేవు, తీవ్రతను పెంచుతాయి.

ప్రస్తుత విద్యా నమూనా ఇంగ్లీషును ఒక భావవ్యక్తీకరణ సాధనంగా మాత్రమే పరిగణిస్తుంది. దీని వలన బహుళజాతి కంపనీలకు బానిసలుగా పనిచేసే వారి సంఖ్యను పెంచుకో గలుగుతాం కావచ్చు కాని బానిసత్వపు మూలాలను ప్రశ్నించే, ఛేదించే ప్రజా సమూహాలను నిర్మించుకోలేము. ఎక్కువ జీతాలనిచ్చే చదువులను ఇస్తుందేమో కాని సరైన జీవితాన్ని ఇవ్వలేదు. కనీసం భాషలో అభివృద్ధి పరంగా చూసినా, ఇటు ప్రాంతీయ భాషలోనూ, అటు ఇంగ్లీషు భాషలోనూ రెండింటిలోనూ ప్రావీణ్యం ఏర్పడదు, సంస్కృతి దెబ్బతింటుంది. వైవిధ్యానికి విఘాతం కలుగుతుంది. భాషలో సరైన అభివృద్ధి లేకపోతే భావనాభివృద్ధి జరుగదు, జ్ఞాన వికాసం సమగ్రంగా ఉండదు, సరిగా ఆలోచించలేరు. ఏ రంగంలోనైనా వైవిధ్యం లేకుండా ఏకరూపత ఉన్నట్లయితే ఆ రంగంలోని వ్యాపార వర్గాలకు ఉత్పత్తి వ్యయం తగ్గుతుంది. లాభాలు ఎక్కువగా వస్తాయి. విభిన్నతలు ఎంత ఎక్కువ వుంటే అంత ఉత్పత్తి వ్యయం పెరుగుతుంది, లాభాలు తగ్గుతాయి. కాబట్టి విద్యారంగంలోని వ్యాపారులు కూడా దేశ వ్యాప్తంగా ఒకే రకమైన పాఠ్యాంశాలు ఉండాలని, ఒకే రకంగా బోధించాలని, ఒకే భాషలో నేర్చుకోవాలని, అందరికీ ఒకే పరీక్ష ఉండాలని ప్రవచిస్తూ ఉంటారు. ప్రాంతీయ సాంస్కృతిక వైయక్తిక విభిన్నతలను (idiosyncrasy) విస్మరిస్తూ ఉంటారు. ఈ పరిణామాలన్నీ అంతిమంగా అసమానతలను పెంచేవే.

### బోధనా మాధ్యమంపై పరిశోధనలు

బోధనా భాషకు సంబంధించిన అధ్యయనాలు ప్రపంచ వ్యాప్తంగా వందల సంఖ్యలో జరిగాయి. మాతృభాషలో విద్యాభ్యాసం ఇంగ్లీషు భాష, ఇతర అకడమిక్ విషయాలలో ప్రావీణ్యాన్ని ఏ విధంగా ప్రభావితం చేస్తున్నదన్న అంశంపై ఎ.ఎస్. యూంగ్ (హాంకాంగ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎడ్యుకేషన్), హెర్బర్ట్ మార్ష్, రోజ్ మేరీ సలిమన్ (యూనివర్సిటి ఆఫ్ వెస్టర్న్ సిడ్నీ) సంయుక్తంగా నిర్వహించిన పరిశోధనా ఫలితాలతో 'కెన్ టు టంగ్స్ లివ్ ఇన్ హార్మనీ' అనే పత్రాన్ని అమెరికన్ ఎడ్యుకేషన్ రీసర్చ్ జర్నల్ 2000 సంవత్సరంలో ప్రచురించింది. ఈ పత్ర రచయితలు ఇదే విషయంపై ఇతర పరిశోధకులు తెలిపిన అభిప్రాయాలను కూడా ఉటంకించారు. అవి.

1. ఇంగ్లీషు మాతృభాషగా లేని పిల్లల్లో ఇంగ్లీషును ప్రబలమైన భాషగా వాడితే వారి అకడమిక్ వికాసం కుంటుపడుతుందని 1980 లో మాంట్రియల్ లోని ఇటాలియన్ పిల్లలపై జె.భట్నాగర్ పరిశోధనలో వెల్లడైనది.

2. మాతృభాషను విస్మరించి దాని స్థానంలో ప్రబల భాషగా ఇంగ్లీషును వాడితే రెండు భాషలలోను అభ్యాసకుని అభివృద్ధి కుంటుపడుతుందని లాంబార్ట్ 1975లో తెలిపాడు. అలా కాకుండా మాతృభాషలోనే అభ్యసిస్తూ రెండో భాషగా ఇంగ్లీషును నేర్చుకున్న వాళ్ళలో సులభమైన బుద్ధి గ్రాహ్యత, శాబ్దిక విషయాలను పునఃవ్యవస్థీకరించుకునే నైపుణ్యాలు. భాషా సాంకేతికాలను నేర్పుతో ఉపయోగించుకోవడం పెరుగుతాయని ఆయన తెలియజేస్తాడు.

3. ఇంగ్లీషు బోధనకు ఎక్కువ సమయం కేటాయిస్తే విద్యార్థులలో ఇంగ్లీషు భాషా ప్రావీణ్యం కలుగుతుందనే ప్రతిపాదనను కమ్మిన్స్ (1996) వ్యతిరేకిస్తాడు.

4. అకడమిక్ విషయాలలో పట్టు సాధించడానికి ఇంగ్లీషు కంటే మాతృభాష చాలా ఉపయోగకరమని మన దేశ విద్యార్థులపై మొహంతి 1990లో జరిపిన అధ్యయనంలో వెల్లడైంది.

ఇవే కాక ఇతర పరిశోధకుల అభిప్రాయాలను, తమ పరిశోధనల ఫలితాలను సంగ్రహ పరుస్తూ మాతృభాషలో విద్యాభ్యాసం ఇంగ్లీషు భాషలో ప్రావీణ్యతను సాధించడానికి అడ్డు కాదని తెలియ చేశారు. అంతేగాక మాతృభాషలో ప్రావీణ్యత ఇంగ్లీషు, ఇతర అకడమిక్ విషయాలలో ప్రావీణ్యతకు తోడ్పడుతుందని వివరించారు. ఈ పరిశోధనా ఫలితాలు ఇంగ్లీషు మాట్లాడే దేశాల్లో ఇంగ్లీషు మాతృభాష కాని మైనారిటీ వర్గాలకు సంబంధించినవి అయినప్పటికీ మాతృభాష, ఇంగ్లీషు భాష ఒక దాని ద్వారా మరొకటి నేర్చుకోవడంలో ఉండే పరస్పరాశ్రయతను స్పష్టంగా తెలియ చేస్తున్నాయి.

యునెస్కో 2014లో ప్రచురించిన 'ద ఇంపార్టెన్స్ ఆఫ్ మదర్ టంగ్ బేస్డ్ స్కూలింగ్ ఫర్ ఎడ్యుకేషనల్ క్వాలిటీ' అనే శీర్షికతో ప్రచురించిన నివేదికను కూడా ఈ సందర్భంగా పరిశీలించటం అవసరం. దీనిలోని అంశాలు.

అ) ఆధునిక భావనలను ప్రాంతీయ భాషల్లో వ్యక్త పరచలేము కాబట్టి ఇంగ్లీషు అనివార్యం అనుకునే ధోరణి కూడా సరైనది కాదని స్టాక్ హోమ్ యూనివర్శిటీకి చెందిన కరోల్ బెన్సన్ అంటారు. యూరోపియన్ భాషలే గొప్పవనే భావన వలస వాదుల సృష్టి అనీ, నిజానికి భావ వ్యక్తీకరణ సామర్థ్యం విషయంలో అన్ని భాషలకూ సమాన సామర్థ్యం ఉంటుందనీ, ఏ భాషకయినా అవసరానికి తగ్గ కొత్త పదాలను, నిర్మాణాలను అభివృద్ధి చేసుకోగలిగిన సత్తా ఉంటుందనీ ఆయన తెలిపారు. ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతాన్ని లియపోడ్ సాంగో అనే రచయిత సెనగల్ భాష అయిన వోలఫ్ లోకి అనువాదం చేసి దీన్ని విశదీకరించారు.

ఆ) ఇంగ్లీషును మాతృభాషతో పాటు నేర్పిస్తే, అది గందరగోళానికి దారి తీస్తుందని, కాబట్టి చిన్నప్పటి నుండే ఇంగ్లీషును నేర్పడం సరైనదని కొంతమంది భావిస్తారు. కానీ మాతృభాషలో ఎంత ప్రావీణ్యత సాధిస్తే రెండవ భాషలో అంత ప్రావీణ్యత పెరుగుతుందని అధ్యయనాలు తెలియజేస్తున్నాయి. స్వీడన్ పిల్లలు రెండవ భాషలో మంచి పట్టును కలిగి ఉంటారు. దీనికి కారణం అది మాతృభాషలోనే బోధనను కొనసాగిస్తూ రెండవ భాషను ఒక సబ్జెక్టుగా బోధిస్తుంది.

ఇ) ఉన్నత విద్యను పొందటానికి ఉద్యోగ, ఇతర అవకాశాలను పొందటానికి ఇంగ్లీషు తప్పనిసరి అనే భావన కూడా పూర్తిగా నిజమైనది కాదని, అది బలవంతమైన దేశాలు తమ ఆధిపత్యం కోసం తమ భాషను రుద్దే ప్రయత్నం అని ఫిలిప్పీన్ బ్రతియాజ్ అనే భాషాశాస్త్రవేత్తల చెబుతున్నారు. పేద దేశాల్లో 50% ప్రజలు అసంఘటిత రంగాల్లో ఉద్యోగాలు చేస్తూ ఉంటారు. వీరంతా ప్రాథమిక విద్య దశ నుండే డ్రాప్ అవుట్ అవుతారు. అలాంటప్పుడు ఇంగ్లీష్ తప్పనిసరి అని ఎలా చెప్పగలం అని వీరు అంటున్నారు.

హైదరాబాద్‌లోని ఆర్థిక, సామాజిక అధ్యయనాల కేంద్రం (CESS-Centre for Economic and Social Studies)కు చెందిన శ్రీకుమార్ నాయర్ ఆంధ్రప్రదేశ్, తెలంగాణలకు చెందిన ప్రాథమిక స్థాయి పిల్లలు గణితాన్ని నేర్చుకోవడంపై మీడియం ప్రభావం పై గత సంవత్సరం (2015) అధ్యయనం చేశారు. బోధనా మాధ్యమం అభ్యసన ఫలితాలను ప్రభావితం చేస్తుందా? (Does Medium of Instruction Affect Learning Outcomes) అనే శీర్షికతో ఒక నివేదికను విద్యలో ప్రైవేటీకరణపై పరిశోధనలను చేసే PERI (Privatisation in Education Reasearch Initiatives) అనే సంస్థ 2015లో ప్రచురించింది. పిల్లల సామర్థ్యం, ఇంటి పరిస్థితులు, తల్లిదండ్రుల ఆకాంక్షలు ఇత్యాది విషయాల ప్రభావాన్ని నియంత్రిస్తూ ఇంగ్లీషు, తెలుగు మీడియంలలో చదివే పిల్లల గణిత సామర్థ్యాలను పరిశీలించగా తెలుగు మీడియం విద్యార్థుల సామర్థ్యాలే ఎక్కువ వున్నాయని తేల్చారు. క్రింది స్థాయి నుండే ఆంగ్ల మాధ్యమాన్ని ప్రవేశపెట్టాలనే సంస్కరణలకు ఈ అధ్యయనం ఒక హెచ్చరిక.

## శాస్త్రీయమైన ద్విభాషా విధానమే మార్గం

బోధనా భాషకు సంబంధించి మన లాంటి పరిస్థితులే ఉన్న సౌత్ఆఫ్రికా లోని యూనివర్సిటీ ఆఫ్ జోహానెస్బర్గ్ కు చెందిన విద్యా హక్కులు మరియు పరివర్తన కేంద్రం (Centre for Education Rights and Transformation) విభాగం విద్యా హక్కుల ప్రాజెక్ట్ * (Education Rights Project) ఆధ్వర్యంలో గత దశాబ్ద కాలంలో విభిన్న విద్యా విషయాలపైన ఐక్యరాజ్యసమితి సహకారంతో అధ్యయనాలను చేసింది. పిల్లల భాషా హక్కులకు సంబంధించిన వీరి అధ్యయనం మన దేశ పరిస్థితులకు కూడా అన్వయించదగినది. ఇంటిలో జరిగే భావ వ్యక్తీకరణ రూపం, పరిమాణం, నాణ్యతల పైననే పాఠశాలలో విద్యా విషయాల సాధన ఆధారపడి ఉంటుందని చాలా అధ్యయనాలు చెబుతున్నాయి. కాబట్టి ఇంగ్లీషు మాతృభాషగా లేని వారికి ఇంగ్లీషు నేర్పవలసి వస్తే ద్విభాషా విధానం (Bilingual) సరియైనదని వీరు అభిప్రాయపడుతున్నారు.

ద్విభాషా విధానానికి ఐదు నమూనాలను వీరు ప్రతిపాదించారు.

1. 12 వ తరగతి వరకు మాతృభాషలో బోధనను జరుపుతూ ఇంగ్లీషును అదనపు భాషగా నేర్పడము మొదటి నమూనా.

2. మొదటి తరగతిలో 90 శాతం బోధనను మాతృభాషలో చేస్తూ క్రమంగా ఐదవ తరగతి వరకు దానిని 50 శాతానికి తగ్గించడము, ఇంగ్లీషును మొదటి తరగతిలో 10 శాతం ప్రవేశపెట్టి క్రమంగా అయిదవ తరగతి వరకు 50 శాతానికి పెంచడము, 12 తరగతి వరకు రెండు భాషలను ఇదే పద్ధతిలో కొనసాగించడము.

3. మాతృభాషను మొదటి తరగతిలో 90 శాతంగా ప్రవేశపెట్టి క్రమంగా 9వ తరగతి వరకు దానిని 50 శాతానికి మార్చడము, ఇంగ్లీషును మొదటి తరగతిలో 10 శాతం ప్రవేశపెట్టి 9వ తరగతి కల్లా 50 శాతానికి మార్చడం. ఇది మూడవ నమూనా.

4. ఎక్కువ మైనారిటీ భాషలు ఉన్న ప్రాంతాల్లో ప్రముఖంగా వాడబడే రెండు భాషలను రెండవ, మూడవ నమూనాల మాదిరిగా ఆచరిస్తూ, మైనారిటీ భాషల అభివృద్ధికి ప్రత్యేక చర్యలను చేపట్టడం.

***(తరువాయి 55వ పుటలో)***

# గుజరాతులో తెలుగువాడు- అప్పుడు, ఇప్పుడు, రేపు...

-పాలెపు బుచ్చిబాబు

**అప్పుడు**

మనిషి నడక నేర్చిననాడే వలస వెళ్ళడం మొదలుపెట్టాడు. తెలుగువాడు వందల ఏళ్ళకిందటే గుజరాతులో అడుగుపెట్టాడు. తామర తంపరగా పెరుగుతున్న జాతి, ఉద్యోగాలని, వృత్తులని, వ్యాపారమని, మత ప్రచారానికని, ఉపాధి కోసమని, కొత్తపుంతలు తొక్కడం దీనికి ముఖ్య కారణం. గుజరాతీలు వ్యాపారం వైపు మొగ్గి నంతగా- ఉద్యోగాలకి పోరు. ఎంత పెద్ద ఉద్యోగమైనా వారి దృష్టిలో అది నౌకరీయే. ఆ కారణంగా వైష్ణవమత ప్రచారం కోసమని వల్లభా చార్యుడు, ఆయన అనుయాయులు, చేనేత బట్టలలో మిల్లులలో పని చేయడానికి పద్మశాలీలు, పరిశ్రమల్లో పని చేయడానికి ఉద్యోగస్తులు, చదువుకున్నవారు, విద్యావైజ్ఞానిక రంగాల్లో పని చేసే వారు ఇలా ఎందరో తెలుగువారు అనాదిగా గుజరాతు వైపు ఆకర్షితులయ్యారు.

సుమారు రెండు వందల సంవత్సరాల నాడే 'పటాన్' (ఉత్తర గుజరాతు) సంస్థానంలో తెలుగువారు పట్టుచీరలు నేసే వారని చరిత్ర చెపుతోంది. ఆ చీరలు ప్రపంచ ప్రసిద్ధి చెందినవి. మరికొందరు అహ్మదాబాదు, వడోదరా, సూరత్, బిల్లిమోరా వంటి పట్టణాల్లో స్థిరనివాసాలు ఏర్పరుచుకున్నారు. కొందరు శ్రీకాకుళ ప్రాంతం వారు, రేవు పట్టణాల్లో వడ్రంగి వగైరా వృత్తిపనులు చేపట్టారు. కచ్, ముంద్రా, గాంధీధాం వంటి పట్టణాల్లో నివసిస్తున్నారు. వీరందరూ అన్ని తరాలుగా గుజరాతులో ఉండిపోయినా- అమ్మనుడిని, సంప్రదాయాన్ని మరిచిపోకుండా ఉండడం ఎంతో సంతోషించవలసిన విషయం. ముఖ్యంగా అహమ్మదాబాదులో స్థిరపడిన తెలుగువారు ఒక సమాజంగా ఏర్పడి ఇరవయ్యో శతకం మొదట్లోనే తెలుగుబడిని మొదలు పెట్టడం గర్వించదగ్గది. అది మన భాషాభిమానానికి మచ్చుతునక. వడోదరా (బరోడా) నగరం పరిశ్రమకి పుట్టినిల్లు. కనుక ఇక్కడ తెలుగువారిలో ఉద్యోగస్తులు ఎక్కువ.

**ఇప్పుడు**

ఒకప్పుడు కేవలం కార్మికులు,చేతిపని వారు, శ్రమజీవుల్ని ఆకర్షించిన గుజరాతు, ఇప్పుడు విద్యార్థుల్ని, వ్యాపారస్తుల్ని కూడా ఆకర్షిస్తోంది. దానికి కారణం పారిశ్రామికంగా గుజరాతు సాధించిన ఘన విజయం. బట్టల తయారీ సంస్థలు, నూనె, సహజవాయువు, దానికి సంబంధించిన ఇతర పరిశ్రమలు, మందుల కంపెనీలు, విద్యా వైజ్ఞానిక పరిశోధనా సంస్థలు ఉండడం వల్ల గత నాలుగైదు దశకాల్లో గుజరాతుకి వలస వచ్చే తెలుగుల సంఖ్య బాగా పెరిగింది. వారిలో చాలామంది వెనక్కి వెళ్ళిపోయినా, గుజరాతీల మంచితనాన్ని, శాంతి కాముకతని మెచ్చుకుని, ఇక్కడే స్థిరపడిన కుటుంబాల సంఖ్య తక్కువేమీ కాదు. విశేషం ఏమిటంటే, కేవలం నౌకరీ చేయడమే కాకుండా వారిలో చాలామంది గుజరాతీలని ఆదర్శంగా తీసుకుని, స్వంత పెట్టుబడులతో వ్యాపారాలు చేస్తున్న వారెందరో ఉన్నారు.

ఆ పరిస్థితిని లెక్కలోకి తీసుకుని గుజరాతులో ఎంతమంది తెలుగువాళ్ళు ఉన్నారు? అని ఆరా తీస్తే, సుమారు అయిదు లక్షల మందికి పైచిలుకే అని తేలింది. వీరిలోసింహభాగం అహమ్మదాబాదు, వడోదరా, సూరత్, గాంధీధాం, భరూచ్, అంకలేశ్వర్, వాపి పట్టణాల్లో నివసిస్తున్నారు. ఇంతమంది తెలుగువాళ్ళు ఒక దగ్గర ఉంటున్నారంటే తెలుగు సంస్కృతీ, సంప్రదాయం, పండుగలు విరాజిల్లుతూనే ఉంటాయి. ఆ కోరిక పూర్తి కావడానికి అహమ్మదాబాదు ఆంధ్ర మహా సభ, బరోడా ఆంధ్ర సమితి, సూరత్ తెలుగు మిత్రుల సంఘం....ఇలా ఎన్నో సంస్థలు ప్రతీ ఊరిలోనూ పుట్టి పెరుగుతున్నాయి. వీరందరూ ఆటలు, పాటలు, నాటికలు, విందులు, వినోదాలు జరుపుకుంటూ ఏడాదిలో నాలుగైదుసార్లయినా కలుస్తారు. అహమ్మదాబాదులో వెలసిన శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయం, వడోదరాలోనూ, సూరత్ లోనూ, అన్జార్, కచ్..ఇంకా ఇతర పట్టణాల్లోనూ ఉన్న దేవాలయాలు తెలుగువారి దైవభక్తికి నిదర్శనాలు.

ఇప్పుడు ముఖ్యంగా చెప్పుకోవలసింది ఈ మధ్యనే పుట్టిన 'రాష్ట్రేతర తెలుగు సమాఖ్య' గురించి. దీనికి శ్రీకారం అహమ్మదాబాదులో జరగడం గుజరాతు తెలుగువాడి-వాడికీ, వేడికి మచ్చుతునక. ఈ సమాఖ్య ఉద్దేశం- తెలుగు రాష్ట్రాలు మినహా,దేశంలో అన్ని రాష్ట్రాల్లోనూ ఉన్న తెలుగులందరినీ ఒక తాటి మీదికి తెచ్చి, వారు ఎదుర్కొంటున్న సమస్యలని, తెలుగు ప్రభుత్వాల దృష్టికి తీసుకురావటం, వీలైనంత వరకు ఆయా రాష్ట్రాల సహాయ సహకారాలు పొందే ప్రయత్నం చేయడం. ఈ సమాఖ్య ఆరంభపు సభ. అహమ్మదాబాదులో 2015 జూన్ నెలాఖరున దిగ్విజయంగా జరిగింది. దేశం నలుమూలల నుంచి, ప్రతినిధులు హాజరయి వారి వారి అభిప్రాయాలు చెప్పారు.

**రేపు**

గుజరాతు ఇతర ఉత్తర భారతదేశంలోని వివిధ ప్రాంతాల్లో నివసిస్తున్న తెలుగువారి ఈ తరం పిల్లలు తెలుగు వాతావరణానికి దూరమై 'తలుపు ఖోలేను', 'ఝాడూ చేసింది', 'పాతిక' అంటే ఏమిటి?', 'తెలుగు నేనెందుకు చదవాలి?' అని మాట్లాడుతున్నారు. వీరికి తెలుగు రాదు. స్థానిక భాషల్లో ప్రవేశం ఉండదు. ఏదో సామెత చెప్పినట్టు ఉంటుంది. ఆ రోజుల్లో ఒకాయన అప్పటి మద్రాసు వెళ్ళారట. తమిళం రాలేదు కానీ తెలుగు మరచిపోయారట. అటువంటి పరిస్థితి రాకముందే మనం మేల్కొని, దీనికి తగ్గ నివారణోపాయాలు వెదకాలి. మన పిల్లలకి చిన్నప్పటి నుంచి తెలుగు నేర్పే బదులు, ప్రచార సాధనాలు ఇబ్బడి ముబ్బడిగా అందజేయాలి. దానికి తెలుగు రాష్ట్రాలు మేమున్నామని ముందుకు వచ్చి, ఆదుకోవాలి. ఇంతేకాక, ఇతర రాష్ట్రాలలో తెలుగువారు ఎదుర్కొంటున్న ఆర్థిక, సామాజిక, రాజకీయ సమస్యలని పరిష్కరించడానికి దోహదం చేయాలి. దానికి 'రాష్ట్రేతర తెలుగు సమాఖ్య' తగినంత కృషి చేస్తుందని ఆశిద్దాం.

**ఏమైనా, ఎల్లలు లేని తెలుగు ఎల్లెడలా, ఎల్లకాలం వ్యాపించి ఉండాలంటే, ఈ చర్యలు తప్పనిసరి.** ❋

రచయిత సెల్ : 98250 33946

-డా॥అద్దంకి శ్రీనివాస్

# తెలుగే వెలుగై ఎదగాలి

**అం**తర్జాతీయ మాతృభాషా దినోత్సవానికో లేదా తెలుగు భాషా దినోత్సవానికో తెలుగుభాష గుర్తుకువస్తే అది మాతృభాషాభిమానం అనిపించుకోదు. దేశ విదేశాలలో ఎక్కడైనా భారీ ఎత్తున మహాసభలు జరిగినప్పుడు తెలుగుభాష అందరి నోళ్ళలోనూ నానుతుంది. అవి పూర్తి అయిన తర్వాత స్మృతి నుంచి జారిపోతుంది. ఇది భాషావ్యవహర్తల చిత్తశుద్ధికి ప్రశ్నార్థకం. అంతరించి పోయేభాషలలో తెలుగు కూడా ఉందని యునెస్కో చెప్పిందని కొందరంటే- జీవభాష ఎప్పటికీ అంతరించి పోదని మరికొందరు. ఇలా చర్చోపచర్చలు, తర్జనభర్జనలు, నిరసనలు, ఆలోచనలు, తాత్కాలిక ఆవేశాలు కొన్ని సంవత్సరాలుగా అందరూ చూస్తున్నవే.. వింటున్నవే.

సాధారణ వ్యవహారంలోనే కాక విద్య, పాలన, రచన, వ్యాపారాది అనేకరంగాలలో ఆంగ్లభాషాపదాల వ్యవహారం అనివార్య మయ్యింది. తొలినాళ్ళలో మాతృభాషా వినియోగం పెంచడంకోసం పాత్రికేయులు కృషిచేశారు. వివిధశాస్త్రాలకు పారిభాషిక పదకోశాలను తయారీ ద్వారా అకాడమీలు కృషి చేశాయి. ఆధునికంగా వచ్చిన సమాచార విప్లవం వల్ల తెలుగులో ఆంగ్లపదప్రవేశం ఎక్కువ అయ్యింది. దాన్ని నియంత్రించి, ఆంగ్లపదాలకు తగినట్లుగా తెలుగులో ప్రత్యామ్నాయాలను తయారు చేసే ప్రక్రియ జరుగుతున్నా అది అవసరాన్ని పూర్తి చేసేంతగా లేదు.

**కొత్త పదాలతో కొత్త రక్తం :**

సమానార్థక పదసృష్టి పూర్వం ఒక నియమంగా జరిగేది. అర్థాన్ని బట్టి మనభాషలో ఒక పదాన్ని స్థిరపరచుకొని వాడేవారు. ఇప్పుడు శీర్షికలలో కూడా ఆంగ్లపదాలను వాడుతున్నారు. ఉదా: డ్యూటీలో మద్యం సేవిస్తూ పోలీసులకు దొరికిన డిఇ. తినేసి అకౌంట్ సెటిల్ చేశారు. ఇలాంటి వాక్యాలు పత్రికలలో కోకొల్లలు.

తెలుగు పత్రికలలో కన్నా హిందీ తమిళ కన్నడపత్రికలలో ఆంగ్ల పదాల వాడకం తక్కువ. తెలుగు మాట ఉన్నప్పుడు ఆంగ్లపదాలను వాడకూడదు. క్రికెట్ పరిభాషను గనక పరిశీలిస్తే.... తెలుగుపత్రికలలో తెలుగు పదాలు తక్కువగా కనిపిస్తాయి. తమిళంలో ఆంగ్లపదాలు తక్కువగా కనిపిస్తాయి. వారికి సాధ్యం అయ్యింది మనకు ఎందుకు కాదు?! కొన్ని పదాలు చూడండి. Cricket- మట్టైపందాట, Bowling- పందువీచ్చు, Batsman- మట్టై ఆలర్, Bowler- పందు వీచ్చాలర్, Fast Bowler- వేగప్పందు వీచ్చాలర్, Spin Bowler- సుళళ్ పందువీచ్చాలర్, Player- వీరన్, Captain- నాయగన్, ఆట్టత్తలైవర్, Over- సుట్రు, Doping Test- ఉక్కు మరుందు శోదనై (ఉత్ప్రేరక వినియోగ పరీక్ష) Catch- పందుపిడి, Oneday series- ఒరునాళ్ తొడర్, Opening Batsman- తువక్కనాయగన్, Hitting- అదిరెడి ఆట్టం, Out- ఆట్టమిల, Not out- ఆట్టమిలక్కామల్, Run- ఓట్టం (పరుగు) Wicket- ఇలక్కు (గురి) Innings- సుళైవు, Pitch- ఓడుదళం- (తలం), Stumps- కుచ్చం, Empire- నడువర్, Final- ఇరుది, Semi final- అరైఇరుది పోటీ Quarter final- కాల్ ఇరుది పోటీ. ఒక్క క్రికెట్టేకాదు. మిగిలిన ఆటలకూ తమిళ అనువాద పదాలు ఉన్నాయి. Hockey- కోల్ పందు, Foot ball- కాల్ పందు, మొదలయినవి. స్వైన్‌ఫ్లూ డెంగ్యూ పదాలను మన పత్రికలు అలాగే వాడాయి. కన్నడిగులు 'హందిజ్వర' అనీ తమిళులు పన్టిక్కాచ్చల్, ఎలిక్కాచ్చల్ అనీ అనువదించుకొన్నారు.

రాజకీయ, శాస్త్ర సాంకేతిక, ప్రపంచ వార్తలు రాసేటప్పుడు సమానార్థకపదాలను సృష్టించుకోవలసిన అవసరం ఎంతో ఉంది. ఉదా: సోవియట్ యూనియన్‌లో గోర్బచెవ్ సంస్కరణలు చేసిన వార్తలు మనపత్రికలలోనూ వచ్చాయి. అవి 1.గ్లాస్ నోస్ట్ (glass noste) 2. పెరిస్త్రోయికా (peristroyica) ఇవి రష్యన్ పదాలు, వీటిని మన పత్రికలు యథాతథంగా వాడాయి. అలాకాకుండా 1. గోప్యరాహిత్యం 2. పునర్వ్యవస్థీకరణ అని కల్పించవచ్చు.

**మహాత్ములు నడిచిన దారి**

ప్రసారమాధ్యమాలలో అవసరం లేకున్నా ఆంగ్లపదాల వాడకం పెరిగింది. తొలినాళ్ళలో సమానార్థక పదనిర్మాణానికి మన పత్రికా రచయితలు కొన్ని విధానాలను రూపొందించారు. 1. పరిమితార్థ ప్రయోగాలు. సచివాలయం (secretariat) మంత్రి (minister) 2. కొత్త అర్థాలను ఆరోపించిన ప్రయోగాలు. ఉదా: ఆకాశవాణి (All India Radio), విద్యుత్తు (current), 3. నూతనపద కల్పన. సాక్షరత (Literacy), ప్రత్యర్పణ (resubmission), 4. భావానువాద ప్రయోగాలు ఉదా: కుటుంబ నియంత్రణ (family planning), 5. యథానువాదం ఉదా: శూన్యగంట (zero hour), 6. అన్యదేశ్యాలు. బస్సు, రైలు, లైసెన్సు, వకల్తా, ఖరారునామా, ఎన్ని విధాలుగా ప్రయత్నించినా పదకల్పన సాధ్యం కాని పక్షంలో మాత్రమే అన్యదేశ్యాలు వాడాలన్నదే వీరి అభిమతం. 1908లో ఆంధ్రపత్రికను స్థాపించిన కాశీనాథుని నాగేశ్వరరావు 1938లో పారిభాషిక పదకోశాన్ని నిర్మించారు. ఈ పదకోశంలోని మాటలను కందుకూరి వీరేశలింగం వివేకవర్ధిని, కొండా వెంకటప్పయ్య కృష్ణాపత్రికల ద్వారా ప్రచారం చేశారు. నైట్రోజను- నత్రజని; నికిల్- నిఖిలం; ఆక్సిజన్-ప్రాణవాయువు;ఫోటోసింథసిస్- కిరణజన్య సంయోగక్రియ; నియాన్- న్యోనం మొదలైనవి కాశీనాథుని సృష్టే. విశాఖ మాండలికవ్యవహారంలో ఉన్న డ్రెడ్జర్-తవ్వోడ; సబ్ మెరైన్- దొంగోడ అనే పదాలు నార్ల వారు వ్యాప్తిలోకి తెచ్చారు. రాజకీయ సామాజికాది కారణాలవల్ల కొత్తగా పత్రికలలో ఆంగ్లపదాలనే ప్రయోగించవలసినప్పుడు వాటికి తెలుగు పదాలను విధిగా కల్పించాలని చెప్పిన నార్లవారి మాట వాస్తవం. ఉద్ఘాటన. విజ్ఞప్తి, అభ్యర్థన, ద్రవ్యోల్బణం, తీర్మానం, మూజువాణి వంటి జనవ్యవహారంలో ఉన్న పదాలను స్వీకరించి పత్రికలలో ఆంగ్లపదాలకు ప్రత్యామ్నాయంగా వాడడానికి కావలసిన చక్కని అనువాదాలు పదరూపకల్పనలు నార్లవారే చేశారు. సరళీకరణ ప్రపంచీకరణ లాంటి పదాల ప్రభావం వల్ల గ్లోబలీకరణ, ప్రైవేటీకరణ మొదలయిన పదాలు అర్థబోధకశక్తి ఉన్నందువల్ల వ్యాప్తిలోకి వచ్చాయి. విలేఖకుడు అనే పదాన్ని కాశీనాథుని నాగేశ్వరరావు

ఆంధ్రపత్రికలో ప్రవేశపెట్టారు. ఆ తర్వాత వినసొంపు కోసం విలేఖరి, ఆ తర్వాత విలేకరిగానూ మారింది.

**కృషి ఉంటే సాధ్యమే :**

మాతృభాషాదినోత్సవాలు, ప్రపంచమహాసభల సందర్భంగా దిన వార మాసపత్రికలలో ప్రత్యేకవ్యాసాలు భాషపై వస్తున్నాయి. ఇవి భాషాభిమానులను చైతన్యవంతులను చేయడానికి, భాషపై మమకారం కలిగించడానికి ఉపయోగపడతాయి. కానీ భాషాభివృద్ధికి కండ పట్టి వ్వవు. కనీసం తెలుగుపత్రికలలో వాడుతున్న ఆంగ్లపదాలను గుర్తించి వాటికి ప్రత్యామ్నాయాలను సూచించే దిశగా ఈ ప్రయత్నం ఉండాలి. లేదా నూతన పదరూపకల్పన అనే అంశంపై పాఠకులనే అడగవచ్చు. రోజుకో వారానికో నెలకో ఒకసారి ప్రజలనుండి ఆంగ్లపదాలకు తగిన మాటలను సేకరిస్తే వ్యవహారానికి దగ్గరగా ఉన్న పదాలు వ్యాప్తిలోకి తీసుకువచ్చే అవకాశం ఏర్పడుతుంది. ఇది కొన్ని పత్రికలు చేస్తే చాలదు. అన్ని పత్రికలూ విధిగా చెయ్యాలి. మద్రాసు ఆకాశవాణిలో ప్రతిరోజూ కొత్తపారిభాషిక పదాలకు తమిళంలో సమానార్థక పదాలను సృష్టించి ప్రసారం చేస్తారు. వాటిని శ్రోతలు స్వీకరిస్తున్నారు. ఇదే పనిని ఇప్పుడు ఈనాడు 'తెలుగు వెలుగు' పత్రిక నిర్వహిస్తోంది.

హిందీలో భా,జ,పా; క.పా, మొదలైన హిందీపొడి అక్షరాలు వాడతారు. తెలుగులో ఐ.రా.స.ఐ.కా.స అని కొన్నాళ్ళు పత్రికలు వాడాయి. ఈ పద్ధతిలో వాడుక కొనసాగించాలి. పొట్టి పేర్లనూ తెలుగు లోనే వాడడం అలవాటు చేసుకోవాలి.

రెండు మూడు రకాలుగా పదాల్ని పదబంధాల్ని కల్పించి వ్యవ హారంలోకి వదిలితే వాటిలో సర్వామోదయోగ్యమైనది నిలబడుతుంది. ఈ ప్రయత్నం నిరంతరం జరగాలి. వ్యవహారసౌలభ్యం, ఆవశ్యకతా పూరణం, సొగసు, బిగువు, అనువాదసుందరంగా ఉంటేచాలు- వాడు కలో ఏ పదమైనా ప్రాచుర్యం పొందుతుంది. తెలుగు మాటలు కాని అసలు, మామూలు, అచ్చు మొదలైన ఉర్దూ పదాలు తెలుగుమాటల్లాగే వ్యవహారంలో ఉన్నాయి. 'అమీతుమీ' బెంగాలీ పదం. 'సెబాసు' మరాఠీ పదం. ఆటంబాంబు అనే అర్థంలో అణ్వస్త్రం అని స్థిరపడింది. 'సిరంజి' కి సూది అనీ 'ఇంజక్షన్' కి సూదిమందు అని వాడుతున్నాం. పోర్చుగీసు (పార్తగీజ్) అనే పదానికి మనవాళ్ళు బుడతకీచు అని కల్పించారు. తెలుగులో 150 దాకా పోర్చుగీసు పదాలున్నాయని తూమాటి దొణప్ప గారు నిరూపించారు. అనాస, అలమరు, ఇస్త్రీ, కుంపిణీ, మేస్త్రీ, కమీజు, బొత్తాము, కోస్తా, బొప్పాయి, క్రీస్తు, తువ్వాలు, గమేళా బొంబాయి (తోడుకొనే పనిముట్టు), చెవి (తాళం చెవి) కాజా, కుదేలు, గిడ్డంగి, బాతు, బొంగు, మేజా, వేలాం, సబ్బు మొదలయినవి. సాహిత్యంలోనూ వీటిలో కొన్ని కనిపిస్తాయి. ఇవి అన్యదేశ్యాలని చెప్తే గానీ తెలీదు.

కాలానుగుణంగా ఏర్పడే పరిణామాల వల్ల భాషలోకి కొన్ని కొత్త పదాలే కాదు పదబంధాలూ చేరతాయి. 1857 సిపాయిల తిరుగుబాట ప్పుడు 'ఢిల్లీ చలో' అనే పదం వచ్చింది. తరువాత 'చలో అసెంబ్లీ' 'చలో హైదరాబాద్' లు బయలుదేరాయి. 1886లో దాదాభాయ్ నౌరోజీ స్వరాజ్యం అనేమాటను వాడాడు. అప్పటినుండీ ఆ పదం స్థిరపడింది.

భారత స్వాతంత్ర్యోద్యమ ప్రభావం వల్ల ఇంతకుముందు లేని అనేక పదాలు, పదబంధాలు తెలుగుభాషలో ప్రాచుర్యంలోకి వచ్చాయి. గాంధీటోపీ, మద్యపాననిషేధం, అస్పృశ్యతానివారణ, పాదయాత్ర, చరఖా, ఖద్దరు, రాష్ట్రభాష (జాతీయభాష), సహకారోద్యమం, బేసిక్

## తెలుగు పలుకు 'లో'గుట్టు

**అడియాస :**

అడియాసలు మంచివే, చెడ్డవి కావు.....

ప్రస్తుతం ఈపదం, అందరి కోరిక, వట్టి ఆశ, దురాశ అనే అర్థాలలో వాడుకలో ఉంది. కానీ దీని మొదటి అర్థం అధికం. అడిసిగ్గులు, అడినవ్వులు అనే ప్రయోగాలు ప్రాచీన గ్రంథాలలో కన్పిస్తాయి.

ఉదా "క, అడిసిగ్గులు తమకంబులు, నుడివోవఁగ," మార్క. 4, ఆ.

ఇక్కడ అడిసిగ్గులు అంటే అధికమైన సిగ్గులు అని అర్థం.

శబ్దరత్నాకరము (బహుజనపల్లి సీతారామాచార్యులు) 1912, అడియాస: వి. (అడి+ ఆస) కలుగుననెడి యాశ, ప్రత్యాశ అనే అర్థాలను చూపి భారత ప్రయోగాన్ని ఉదాహరణగా చూపింది.

"సామ్యములఁగోరక పొమ్మడియాసయేటికిన్" భార, ఆర ....ఆ. (చూ.దొడ్డ)

కానీ ఇక్కడ అడి శబ్దానికి అధికమైన అనే అర్థం. వ్యర్థం అనే అర్థంలో ఉన్న మరో భారతప్రయోగం చూడండి.

"క. అడిబీరపుఁదులువ గెలుచునటె పాండవులన్" భార. ద్రోణ ఆ

ఆంధ్ర వాచస్పత్యము (కొట్ర శ్యామలకామశాస్త్రి) 1953, వై.వి. (అడి+ఆస)= అర్థాశ.

దురాశ : చూ, వాంఛ, 1-_ ..... అనీ.

ఆంధ్రశబ్దరత్నాకరము (చెలమచెర్ల రంగాచార్యులు) 1966, వై.వి. వ్యర్థమైన ఆశ. ప్ర, అతి+ఆశా, అత్యాశా, వ్యు. ఆడి+ఆస. (కర్మ.స) అనీ.

తెలుగు వ్యుత్పత్తి కోశం (ఆంధ్రవిశ్వకళాపరిషత్తు) 1978 వి.వట్టి ఆశ; భార. ఆర. 4,349; భార ఉద్యో. 1,314 అటియాసె, అడియాసె, వట్టి ఆశలు, << అడి (2) అనీ... అర్థాలు చూపాయి.

పై నిఘంటుప్రమాణాలను బట్టి అడి అనే పదానికి అర్వా చీనంగా వ్యర్థం అనే అర్థం వచ్చింది.

ఇతర ద్రావిడ భాషలలోనూ అధికం అనే అర్థమే ఉంది.

=క. అడ్డ. అధికం; అట్టు, క్రిక్కిరియటం; తు. అట్టి, కుప్పు, ధాన్యపురాశి; త.అటై, పోగుచేయు, సన్నిహిత మగు; అటి. -పెయల్, పెద్ద వాన; మ.అటై, ఎడతెరపిలేని;

మొత్తానికి అడియాస అంటే అధికమైన ఆశ అనేది ప్రాథమిక అర్థం. దీనికి ప్రమాణంగా ఒక ప్రాచీన సినీకవి (ఈనాటి ఈ హాయీ కలకాదోయి నిజమోయీ అనే పాటలోని చరణంలో... నీ కోసమే ఈ అడియాసలన్నీ) ప్రయోగం కూడా ఉంది. ఇందులో ఎక్కువ ఆశలనే అర్థం. అలాగే అడి అంటే పాదం, అడుగు భాగం అనే అర్థాలూ ఉన్నాయి. తమిళంలో నేటికీ వ్యవహారంలో ఉంది. కాలడి మన్ను అంటే పాదధూళి అని అర్థం. ఈ అర్థం తెలుగులో నేడు వ్యవహారంలో లేదు. 'అడి' అనే క్రియకు తమిళంలో 'కొట్టు' అని అర్థం. అది వేరు. ఒక కేంద్రబిందువు నుంచి చూస్తే అధికమైనది అడి అనుకుంటే ఆ అధికమైనది నిరుపయోగమైనది కాబట్టి దానికి వ్యర్థం అనే అర్థ విస్తృతికి ఆస్కారం ఉంది. కాబట్టి నిజానికి అడియాసలు ఉండడం మంచిదే నన్నమాట!




విద్య, భూదానం, శ్రమదానం, వృత్తివిద్య, గ్రామపారిశుద్ధ్యం, నిరాహార దీక్ష, సేవాదళం, జిందాబాద్, ముర్దాబాద్, పతాకావిష్కరణ, పతాక వందనం, మతసామరస్యం, భాషాప్రయుక్తరాష్ట్రం, అధిష్ఠానవర్గం, వారోత్సవాలు, మానసపుత్రులు, జమీందారీ వ్యతిరేకోద్యమం, రిలే నిరాహారదీక్షలు, బందులు, ధారణ (ధర్నా- అంటే ఒక ఉన్నతాశయాన్ని ధరించడం) రాస్తారోకో, జాతీయత, మాతృదేశం, భరతమాత, దొర తనం, వయోజనవిద్య, గుండ్రబల్లసమావేశం, జాతీయవిద్య, విదేశీవస్తు బహిష్కారం, సత్యాగ్రహం (గాంధీజీ సత్యమైన ఆగ్రహం అంటే పట్టుదల అనే అర్థంలో వాడారు. ఆగ్రహం కోపంగా అర్థవిపరిణామం చెందింది) వంటి పదాలు స్వాతంత్ర్యోద్యమ నేపథ్యంలోంచి పుట్టుకొచ్చాయి. గుజ రాతీకవి నర్సీ మెహతా మొట్టమొదటసారిగా హరిజనశబ్దం వాడాడు. స్వాతంత్ర్యానికి పూర్వం 'రాష్ట్రపతి' అనే పదం 'కాంగ్రెస్ అధ్యక్షుడు' అనే అర్థంలో ఉంది. నేడు భారతదేశ ప్రథమపౌరుడు అనే అర్థంలో వాడుతున్నాం. ఇప్పటికీ ఇవి కొనసాగుతున్నాయి. భాషలో కృతకప్రామా ణికాలూ (Hyper forms) తయారవుతాయి. ఉదా, ఆరతి- హారతి, అడలు- హడలు, కన్నడంలోని ఎచ్చతికె- హెచ్చరిక, కాబట్టి జనవ్యవ హారానికి పెద్దపీట వెయ్యాలి.

ఇకనైనా సామాన్యవ్యవహర్తలు, సృజనకారులు, అధికారులు, భాషావేత్తలు కలిసి చిత్తశుద్ధితో ఆలోచించాలి. కార్యాచరణ ప్రారంభించ వలసిన సమయమిది. ఆక్స్‌ఫర్డ్ నిఘంటువును ప్రతి అయిదేండ్ల కొకసారి సవరిస్తుంటారు. అన్యదేశ్యాలు చేర్చడం, కొత్త పదాలను కల్పించడం. కొత్త అర్థాలను స్వీకరించడం మొదలైన వాటిని దృష్టిలో పెట్టుకొని సవరణలు చేపడతారు. ఆంగ్లభాషాపదాలకు తెలుగులో సమానార్థక పదాలను కల్పించుకోవడంలో ప్రయత్నలోపం తప్ప, మరే కారణమూ కన్పించదు. దీనికంటే ముందుగా తెలుగులో జరగాలి. అంతకంటే ముందు ఇప్పటివరకూ సేకరించిన మాండలికపదాలన్నింటినీ, కవులపై వచ్చిన పదప్రయోగ కోశాలన్నింటినీ కలిపి సమగ్రమయినరీతిలో మహానిఘంటు నిర్మాణం జరగాలి.


-రచయిత హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయంలో
ఆచార్యులు, ఫోను : 98488 81838


ఈ అంశంపై చర్చను ఆహ్వానిస్తున్నాం. ఈ వ్యాసంలో రచయిత చేసిన ప్రతిపాదనలపైనా, సూచనలపైనా ఒప్పుదల ఉన్నవారు, లేనివారు కూడా వారి తలంపులను తెలుపవచ్చు. రచయిత మచ్చుకు 'అడియాస' అన్నమాటను వివరించిన రీతిలో ఇప్పటికే వాడుకలో ఉన్న మాటలతో పాటు చదువరులు కొత్తమాటలను కూడా సూచించవచ్చు. తెలుగు క్రియా పదాలు ఆధారంగా తెలుగు మాటలను మనం పెంపొందించుకోవడం ఇందుకు తగిన దారి అవుతుంది. ఈ దిశగా 'నడుస్తున్నచరిత్ర' 2012-2013లలో వెలికి తెచ్చిన వేదం పట్టాభిరామశాస్త్రి గారి 'ఆంధ్రధాతుపాఠం' వంటివి మనకెంతో తోడ్పడ్డాయి. ఇలాంటి ప్రతిపాదనలకు, చర్చలకు 'అమ్మనుడి' స్వాగతం పలుకుతున్నది. -సంపాదకుడు

ఎల్లలకు ఆవల...

# టిటాగఢ్‌లో తెలుగువారు



–అంకం శ్యామల

**ప**శ్చిమ వంగ రాష్ట్రం కలకత్తా నగరం– టిటాగడ్‌లో ఈనాడు దాదాపు లక్షలమంది తెలుగువారు ఉన్నారంటే అందుకు నాందీ ప్రస్తావన పలికిన స్వర్గీయ యుధిష్టరుడే కారణం. ఇతను గంజాం జిల్లాలోని రసుల్ కొండ గ్రామవాసి. అప్పట్లో ఇక్కడ ఒకే ఒక టిటాగడ్ జూట్‌మిల్ నెం.1 ఉండేది. దీనిని 1882 సం.లో స్థాపించారు. ఈ పరిశ్రమలోని దుర్గంధాన్ని, రసాయనాల వాసనల్ని భరించలేక చాలా మంది పనులు చేయలేకపోయేవారు. కానీ ఆ పరిస్థితుల్లోయుధిష్టరు గారు తన కుటుంబాన్ని పోషించాలనే తపనతో ఈ పని ఎంత కష్టమైనా మొండిగా అలవాటు పడిపోయారు.

యుధిష్టరుని పని చూసి మిల్లు యజమానులు ఆంధ్రులు కష్టపడి పనిచేయగలరని మరికొంతమందిని తనతో తీసుకురమ్మని ఒప్పించి ఛార్జీలు సైతం ఇచ్చి పంపగా, అటు ఒరిస్సా నుండి ఇటు ఆంధ్ర నుండి ప్రజలు తరలి వచ్చారు. మిల్లు యజమానులు ఉద్యోగుల సౌకర్యార్థమై మిల్లు క్వార్టర్స్‌ను నిర్మించారు. తెలుగువారు టిటాగడ్‌తో పాటు పరిసర ప్రాంతాలైన సోద్‌పూర్, కమర్‌హాటి, ఆలం బజార్, శ్రీరాంపూర్, శకున్‌బగాన్, శ్యామ్‌నగర్, జగద్దల్, అధ్‌పూర్, గొండల్పరా, తెలినిపరా జూట్ మిల్లులలో పనులు సంపాదించారు. రెండవ ప్రపంచ యుద్ధం సమయంలో కొద్దిమంది తెలుగువారు రంగూన్ (బర్మా) నుండి కలకత్తాకు వలస వచ్చారు.

అప్పట్లో అందరూ నిరక్షరాస్యులే. చదువుకునేవారు చాలా తక్కువగా ఉండేవారు. అదే సమయంలో స్వర్గీయ వాకపల్లి సూర్యనారాయణ నాయుడు గారు వచ్చి పాఠశాలను ప్రారంభించారు. తరువాత స్వర్గీయ సైతాల సోమయ్య గారి ప్రయత్నంతో మిల్లు యాజమాన్యం వారి సహాయంతో 1930 సం.లో కినిసన్ లైన్సు, స్వామి వివేకానంద పథ్‌లో జాన్ విలియం సన్ ప్రాథమిక పాఠశాలను స్థాపించారు.

1943 సం.లో టిటాగడ్ ఆంధ్ర సంఘాన్ని స్థాపించారు. దీని సహకారంతో 1960లో టిటాగడ్ ఆంధ్ర విద్యాలయానికై స్థలాన్ని కొని, భవన నిర్మాణం చేపట్టారు. ఇలా టిటాగడ్ ఆంధ్ర విద్యాలయం ప్రారంభమైంది. దీనితోపాటు జ్యోతిర్మయ యువజన విద్యాకేంద్రము, హుగ్లీలో మహేష్ శ్రీ పొట్టిశ్రీరాములు ఆంధ్ర హైస్కూల్ నిర్మించడం జరిగాయి. ఇవే కాకుండా మరో ఐదు ప్రైమరీ పాఠశాలలు, రెండు గ్రంథాలయాలు ఉన్నాయి. 2015లో టిటాగడ్ ఆంధ్ర విద్యాలయం, జ్యోతిర్మయి యువజన విద్యాకేంద్రాలు స్వర్ణోత్సవాలు జరుపుకున్నాయి.

ఆ రోజుల్లో వినోదానికై తోలు బొమ్మలాటలు, వీధి నాటకాలు, సాము గరిడీలు, హరికథలు, బుర్రకథలు, పురాణ పఠనాలు జరిగేవి. తరువాత పౌరాణిక, సాంఘిక, డిటెక్టివ్ నాటికలు, నాటకాలు ప్రదర్శించేవారు. ఇదే దారిలో ఎన్నో సంస్థలు నేటివరకు సామాజికంగాను, సాంస్కృతికంగాను వివిధ రకాల కార్యక్రమాలను నిర్వహించడం కూడా కనిపిస్తోంది. 2014 సం.లో బెంగుళూరు ప్రవాస ఆంధ్ర థియేటర్ అకాడమీ (PATA) వారు నిర్వహించిన పోటీలలో పాల్గొన్నారు. 2015 సం.లో రాష్ట్రేతర తెలుగు సమాఖ్య అహ్మదాబాదులో మహిళల నాటికను ప్రదర్శించారు కూడా. టిటాగడ్‌లో అనేక రకాల భాషల, జాతుల ప్రజలు కన్పిస్తారు. భిన్నత్వంలో ఏకత్వం అన్నట్టు భిన్న సంస్కృతులు కన్పిస్తాయి. ఇక్కడ అమ్మవారి జాతరలు, సంక్రాంతి వేడుకలు, ఉగాది కలయికలు, బెంగాలీ దుర్గ పూజలు కూడా జరుపుకుంటారు.

టిటాగడ్‌లో ఈనాడు మనకి కావలసిన సాంప్రదాయిక సామగ్రి, నిత్యావసర వస్తువులు అన్నీ లభ్యమవుతున్నాయి. మనవాళ్ళే వ్యాపారాలు చేస్తూ ఒక కుటుంబంగా కలిసి మెలసి మన ఆచార వ్యవహారాలను కాపాడుతూ తెలుగు భాషలో మాట్లాడుతూ తెలుగు భాష అభ్యుదయానికై పాటుపడుతున్నారు.

1983వ సం.లో ఆంధ్ర విద్యాలయ వాణి సావనీరు ప్రారంభించారు. తరువాత అది 'స్రవంతి'గా రూపాంతరం చెందింది. ఇవే కాకుండా 1990 సం.లో 'ముందడుగు' పత్రిక చేరాత పత్రికగా ప్రారంభమై 2003 సం.వరకు వెలువడి, మధ్యలో పత్రికతోపాటు విజ్ఞాన, చలనచిత్ర కార్యక్రమాలు, స్లైడ్ షోలను నిర్వహిస్తూ, ఆంధ్ర రాష్ట్రంలో కూడా ప్రదర్శిస్తూ ప్రస్తుతం త్రైమాసిక పత్రికగా రూపాంతరం చెంది, ఆర్థిక సామాజిక రంగాలకు సంబంధించిన అభ్యుదయ రచనలను ప్రాంతీయంతో పాటు అందించే దిశలో నడుస్తోంది. అలానే, 2008 నుండి జాగృతి బులెటిన్లు విడుదలయ్యాయి. 2014 నుండి ఇవే బులెటిన్లు జాగృతి సమీక్ష ఆర్థిక సామాజిక త్రైమాసిక పత్రికగా రూపాంతరం చెందింది.

ఈనాటి యువకులు కొందరు మంచి ఉద్యోగాలు చేస్తూ ఉన్నత స్థాయిలలో ఉన్నారు. అంతేకాకుండా టిటాగడ్ పురపాలక సంఘంలో మన తెలుగువారు వార్డు కౌన్సిలర్లుగా (ఓ మహిళా కౌన్సిలరుతో పాటు) ఎన్నికై ప్రజాసేవ చేశారు. ఈనాటి టిటాగడ్ మహిళలు విద్యా, సాంస్కృతిక సేవలలో ఉత్సాహంగా పాల్గొంటున్నారు.

టిటాగడ్ వాసులు ప్రకృతి వైపరీత్య బాధితులకు విరాళాలు సేకరించి ఆదుకుంటున్నారు. ఇక్కడ ప్రభుత్వ సహకారం మాకు అంతంత మాత్రమే. కాబట్టి విద్యా, సాంస్కృతిక, కళా రంగాల అభివృద్ధికై మాకు రెండు తెలుగు రాష్ట్రాల సహకారం ఎంతైనా అవసరం.

❋

ఏ రాష్ట్రంలో ఉన్నా,
ఏ దేశంలో ఉన్నా
తెలుగువాళ్ళంతా ఒక్కటే

-రామక్కగారి సుమ

# మొరసునాడు తెలుగువారి బతుకులు

ఇప్పటి ఆంధ్ర, కన్నడ, తమిళనాడులలో మూడు ముక్కలయి నిలిచి ఉంది మొరసునాడు. కర్నాటకలోని గౌరీబిదనూరు, చిన్నబళ్ళాపురం, బెంగుళూరు, కోలారు, శ్రీనివాసపురం, చింతామణి మరియు ఆనేకల్లు; ఆంధ్రప్రదేశ్‌లోని హిందూపురం, బీరంగి కొత్తకోట, మదనపల్లి, పుంగనూరు, పలమనేరు మరియు కుప్పం; తమిళనాడులోని హోసూరు మరియు డెంకణికోట తాలూకాలన్నిటినీ కలిపితే మొరసునాడు అవుతుంది. మొరసు (ఎర్రగులక)ఎక్కువగా ఈ ప్రాంతంలో ఉన్నందువల్ల మొరసునాడు అయ్యింది.

మొరసునాడు కడలి మట్టానికి సరాసరిగా 2500 అడుగుల ఎత్తులో ఉంటుంది. నిండు ఎండతరిలో కూడా చల్లగా ఉండే తావు ఇది. నిండు చలితరిలో కూడా ఎముకలు కొరికే చలి ఉండదు. 35 డిగ్రీల సెంటిగ్రేడుకు మించని ఎండ 13 డిగ్రీలకు తగ్గని చలితో ఏడాది పొడవునా వెచ్చల్లని తావు ఇది. ఏనుగు మల్లమ్మ కొండ (హార్స్‌లీ హిల్స్), నందికొండ, తల్లి వంటి వేసవి విడుదులు అయితే 3500 అడుగుల కంటే ఎక్కువ ఎత్తులో ఉంటాయి.

ఇక్కడి మందికి ముక్యమైన తిండి పంట రాగి. అనుములూ, వెర్రినూగులూ కూడా ఈ తావున ప్రత్యేకమైన పంటలు. ఈ తావులోనే తినగలిగిన వంటకాలు, ఈ తావులోనే కనిపించే పల్లెకళలూ పండగలూ పరసలూ, ఈ తావులోనే వినగలిగిన తెలుగు సొబగులూ పద్దెనిమిది కోట్ల తెలుగుజాతిలో మొరసునాడు గొప్పతనాన్ని ఎత్తి చూపుతుంటాయి. మొరసునాడు మొత్తం మీద నూటికి ఏభైమంది తెలుగువాళ్లూ, ముప్ఫయిమంది కన్నడిగులూ, పదిమంది తమిళులూ, పదిమంది వేరే నుడులవారూ ఉంటారు. హోసూరు తావు తమిళనాడులో ఉండిపోవడం వలన తమిళ ప్రభుత్వాలు పనికట్టుకొని ఈ నేలకు తమిళులను ఎగుమతి చేసి తమిళ నుడి లెక్కలను పెంచినాయి.

అట్లాగే కోలారు బంగారు గనులలోనూ బెంగళూరు నగరంలోనూ పనిపాటల కోసం వచ్చి కుదురుకున్న తమిళులు కూడా ఉన్నారు. ఇప్పటి బెంగళూరు నగరం కర్నాటకకు తలనగరం అయినాక, వేరే తావుల నుంచి ఉద్యోగం కోసం వచ్చి కుదురుకొన్న కన్నడిగులూ ఎక్కువే. ఇవన్నీ లెక్కకట్టినా కూడా నూటికి ఏభైకి తగ్గదు తెలుగువాళ్ళ లెక్క. ఇదీ మొరసునాడులోని తెలుగువారి బతుకు.

ఇప్పుడు మొరసునాడులో తెలుగుదీపాన్ని ఆరిపోకుండా కాపాడుతున్న హోసూరు తెలుగువారి బతుకు వెతలను తెలుసుకుందాము. ఆంధ్రరాష్ట్రములో కలవ వలసిన హోసూరును చేరనివ్వకుండా కొంత మంది రాజకీయులు అడ్డుకున్నారు. హోసూరుని ఆంధ్రలో కలవనివ్వకుండా చేసిన రాజాజీ ఈ తావులోని తొరపల్లి గ్రామంలో పుట్టినవాడే. ఆనాడు రగిలిన నుడి సమస్య ఇప్పటికీ రగులుతూనే ఉంది.

తమిళనాడులో ఎక్కువగా తెలుగుబడులున్న ప్రాంతం హోసూరు. ఇప్పటికీ నాలుగు నూర్లకు పైగా తెలుగు బడులున్నాయి. పిల్లలందరూ తెలుగులో చదువుకుంటున్నారు. ఏ ఊరికి పోయినా తెలుగుబడి,




తెలుగుమాట, తెలుగుపాట, తెలుగు కత, తెలుగు ఆట సజీవంగానే కనపడుతాయి. కతా గేయాలు, బుర్రకతలు, హరికతలు, కోలాటలు, పండరి బజనలు, కేళికలు, నాటకాలు, గొబ్బియాళ్ళ పాటలు, నలుగు పాటలు, పొగిడింపులు ఇట్లా చెప్పుకుంటూ పోతే, ఎంత తవ్వినా తరగని జానపద గని ఉంది మా తావున.

తెలుగు నుడిని కాపాడుకోవడానికి ఎన్నో తెలుగు సంగాలు పనిచేస్తున్నాయి. ఆంధ్ర సాంస్కృతిక సమితి, తెలుగు సాహిత్య పరిషత్తు, తెలుగు యువశక్తి, తెలుగు భాషోద్యమ సమాఖ్య, బస్తి యువక బృందము, ఘంటసాల అబిమాన సంగం, సినీ అభిమాన సంగం మరియు తెలుగు రచయితల సంగం లాంటివి తెలుగు నుడి కోసం నిరంతరంగా పనిచేస్తున్నాయి.

కృష్ణగిరి జిల్లా తెలుగు రచయితల సంగం ప్రతి నెలా మొదటి ఆదివారం సమావేశం అయ్యి తెలుగునుడిలో వ్యాసాలు, కవితలు, కతలు రాయటం మొదలు పెట్టింది. రచయితల సంగం ద్వారా 2010 నుంచీ ఇప్పటివరకూ 12 కతల పుస్తకాలు వెలువడినాయి. దాదాపు 20 మంది రచయితలు తయారు అయినారు. ఈ సాహితీ సేవ వలన తెలుగువారి గుండెల్లో హోసూరు తావు నిలిచిపోయింది.

ఇంత తెలుగుదనం ఉన్న హోసూరులో తమిళులు నుడికి కీడు చేస్తున్నారు. 'తమిళభాష రాయిపుట్టి, మన్ను పుట్టకముందే పుట్టిన నుడి. ప్రపంచభాషలన్నిటిలోనూ శ్రేష్టమైన భాష. ప్రపంచ భాషలన్నీ తమిళంలో నుండే పుట్టినవి కాబట్టి తమిళనాడులోని ప్రజలందరూ తమిళాన్నే చదవాలి' అంటూ నిర్బంధిస్తున్నారు.

**తమిళనాడు ప్రభుత్వం 2006 సం॥రంలో అమలు చేసిన నిర్బంధ తమిళ భాషాచట్టం తెలుగు విద్యార్థులకు శాపంగా మారింది.** 2006 సం॥రము నుంచి తెలుగు నుడిలో పాఠాలు నేర్చుకొన్న విద్యార్థులచే ఈ విద్యాసంవత్సరంలో (2016 మార్చి) మొదటినుడిగా తమిళాన్ని రాయిస్తున్నారు. 10 సం॥రాలు తెలుగునుడిలో చదివిన విద్యార్థులను ఇప్పటికిప్పుడు తమిళములో పరీక్షలు రాయమని నిర్బంధించి, తల్లి నుడికి ద్రోహం చేస్తున్న రాష్ట్రం ఇది.

10, 12 వ తరగతి చదివే తమిళ విద్యార్థులు మొదటి ర్యాంకుల్లో

(తరువాయి 24వ పుటలో)

–ఓట్ర పురుసోత్తం

# ‘తొండనాడు’లో తెలుగు




తేట అయిన నీరు పారే పొలములకూ ఎరుకవలకూ నెలవుగా సంగ నానుడిలో చెప్పబడినది తొండనాడు. వక్కణాన(ఉత్తరాన) తిరుపతినీ తెక్కణాన (తెన్‌పెన్న)దక్షిణ పెన్నేరునూ తూర్పున బంగాళా గాతమూ ఏలగిరులూ తొండనాటికి ఎల్లలుగా ఉండేవి.

నగరాలలో పవిత్రమయినది అని గొప్పగా పొగడబడిన కంచి– తొండనాటికి తలనగరముగా ఉండేది. తెలుగువాళ్లూ, తమిళులూ కలసి మెలసి ఉండే తావు తొండనాడు. శైవ, వైష్ణవ, జైన, బౌద్ధ మతములు పెద్దగా వెలిగిన తావు తొండనాడు.

కంచిని తలనగరు చేసుకొని పల్లవులు ఏలినప్పుడు తొండనాడు చాలా గొప్పగా వెల్లి విరిసింది. దొరికిన మెలన చరిత్రను పట్టి తొండనాడు అంతకుముందు అరువానాడు అనబడి ఉండాది. నాగులు ఎక్కువగా ఉండినందువల్ల ఆ పేరు వచ్చి ఉండచ్చు అని అరయికరులు (పరిశోధకులు) అంటున్నారు. వనవాసి నాగులు గురించి పల్లవుల శాసనాల్లో ఉండాయి. వాళ్లు తెలుగువారే అనేది కొందరు అరయికరుల వాదన.

నేటికాలంకు వస్తే నుడుల పేర్లతో ఆనెములు (రాష్ట్రాలు) ఏర్పడినప్పుడు తొండనాడు రెండుగా చీలిపోయింది. తొండనాడు లోని ఎక్కువ భాగం తమిళనాడుకు చేరగా మిగిలిన కొంత భాగం ఆంధ్రలో కలిసిపోయింది.

చెన్నయ్, తిరువళ్ళూరు, కాంజిపురం, వేలూరు, తిరువణ్ణామల్తై, విళుప్పురం, కడలూరు జిల్లాలు తమిళనాడులో కలిసిపోయిన తొండనాటి భాగం. ఇందులో చెన్నయ్ తమిళనాడుకి తలనగరు అయినందువల్లా, అక్కడ పలు కళాచారాలు కలకలసిపోయి కొత్త కళాచారం పుట్టుకొచ్చింది. అట్లాగే పుదుచ్చేరి కూడాను.

మామింద తమిళ ముద్రపడి, మేము తమిళనాడుతో కలిసి పోయినాక, ఇక్కడ ఉండిన తెలుగుబడులు కొంచెం కొంచెంగా మూత పడిపోయినాయి. ఆ తావులను అంతా తమిళబడులు ఆక్రమించు కున్నాయి. తిరువళ్ళూరు జిల్లాలో ఆంధ్ర సరిహద్దు ప్రాంతాలలో మాత్రం ఇంకా కొన్ని బడులు మాత్రం మిగిలి ఉన్నాయి. అవి కూడాను కొన ఊపిరితోనే వేలాడుతూ ఉన్నాయి.

తమిళనాడు ప్రభుత్వం ఇరునుడి చట్టం తేవడమూ తమిళము చదివినవాళ్ళకు మాత్రమే ప్రభుత్వ ఉద్యోగాలు వస్తాయి అనే పరిస్థితి రావడమూ– తెలుగు బడులు మూతపడి పోవడానికి కారణాలు. తమిళనాడు ప్రభుత్వం 2006లో ఒక చట్టాన్ని తెచ్చింది. దాన్నిపట్టి తెలుగు మాధ్యమంలో చదివే పిల్లోల్లు కూడా ఇకముందు తమిళంలోనే పరీక్షలు రాయవలసి ఉంటుంది. మిగిలి ఉండే తెలుగు బడులు కూడా త్వరలో మూతపడిపోయే పరిస్థితి నేడు వచ్చింది. (అమ్మనుడిలో ఈ వివరాలు ముందే అచ్చు అయినాయి కూడా).

పైర్లు చేయడానికి పనికి రాని తావుల్లో పారిశ్రామిక వాడలను ఏర్పరచుతూ ఉంటారు. అయితే తమిళనాడు ప్రభుత్వం గుమ్మిడిపూడి మొదలుకొని హోసూరు వరకు ఆంధ్ర సరిహద్దు ప్రాంతాలలో పారి శ్రామిక వాడలను పెట్టింది. దానివల్ల మిగిలిన తావులలో ఉండి ఉద్యోగాల కోసం వలస వచ్చిన తమిళులతో ఈ ప్రాంతాలు నిండి పోతున్నాయి. ఇక తెలుగువాళ్లు కూడా కొంచెం కొంచెంగా తమ తెలుగు ఆనవాళ్ళను దాచుకోవలసి వచ్చింది.

కొంగు, చోళ, పాండియనాడుల్లోని తెలుగువారు తమిళ జాతీయత అంటూ మాట్లాడే సంగముల చిక్కి నలిగిపోతూ ఉంటే, తొండనాడులోని తెలుగువారూ తమిళులూ ఒక తల్లి బిడ్డలలాగా కలిసి కాలం గడిపేవారు. అయితే ఇప్పుడు ఇక్కడ కూడాను తమిళర్ మున్నేట్ర సంగం లాంటి కొన్ని సంగాలు మొలకలు ఎత్తుతూ ఉన్నాయి.

కడసిగా ఒక మాట. తెలుగువాణి అనే సంస్థ వేలూరు జిల్లాలో తరగతులు నడిపి నాలుగువేలమందికి తెలుగు రాతలు నేర్పింది. కంచి జిల్లాలో కూడా కొన్ని తరగతులు నడిపింది. తెలుగువాణి లాంటి సంగాలు తోడు వచ్చి ఒక తొండనాడు మాత్రమే కాదు, తమిళనాడు అంతటా మన తెలుగునుడి పెద్ద ఎత్తులో వెలుగుతుంది.

రచయిత చిరునామా :
కొట్టిపాక్కం, వేలూరు జిల్లా, తమిళనాడు.
ఫోన్ : 097516 78607

(23వ పుట తరువాయి)

ఉత్తీర్ణత సాధిస్తే నగదు బహుమతులు, జ్ఞాపికలు, ప్రోత్సాహక బహు మతులు మరియు ల్యాప్‌టాప్‌లు ఇచ్చి గౌరవిస్తారు. ఇలాంటి ప్రోత్సాహ కాలను మన తెలుగునుడి విద్యార్థులకు ఇవ్వకుండా, అవమానించి నిరుత్సాహపరుస్తున్నారు. హోసూరు, డెంకణికోట ప్రాంతాల్లో తెలుగు నుడిపై జరుగుతున్న అన్యాయాన్ని ఎదుర్కోవటానికి అన్ని సంగాలు కలిసి పనిచేయాలి. ఈ మట్టిలోనే పుట్టి పెరిగిన మమ్మల్ని, అమ్మనుడికి దూరం చేస్తున్న వారికి బుద్ధి చెప్పాలి.

**–రామక్కగారి సుమ**, దేవిసెట్టిపల్లి, హోసూరు,
ఫోను : +91 97154 20302

–చలసాని నరేంద్ర

# తమిళనాట అనాదిగా సాగుతున్న తెలుగు వారి ప్రాభవంపై విద్వేషం

**నే**డు తమిళనాడులో తెలుగులో చదువుకోవడం పట్ల ఎదురవుతున్న ప్రతిబంధకాలు యాదృచ్ఛికంగా జరుగుతున్నవి కావు. పలు శతాబ్దాలుగా ఆ ప్రాంతంలో కొనసాగుతున్న తెలుగు ప్రజల ప్రాబల్యం పట్ల, తమిళ్ జాతీయవాదులలో చెలరేగుతున్న విద్వేష భావనలకు సూచిక అని భావించవచ్చు. **నేడు తమిళనాడులో తమిళం కన్నా తెలుగు మాతృభాష గల ప్రజలు ఎక్కువ సంఖ్యలో ఉన్నారని అందరికీ తెలుసు.** వారిలో చాలామంది తెలుగులో మాట్లాడలేకపోవచ్చు. తెలుగు చదువలేకపోవచ్చు. ఎంత నిర్లక్ష్యంగా చూస్తున్నా, వారి తెలుగు సంబంధం మాత్రం కొనసాగుతున్నది.

ప్రస్తుత తమిళనాడు ప్రాంతానికి తెలుగు ప్రజలు పెద్దసంఖ్యలో వలసగా పోవడం 650 సంవత్సరాలుగా జరుగుతున్నది. ముఖ్యంగా రెండు సందర్భాలలో పెద్ద సంఖ్యలో జరిగినదని చెప్పవచ్చు. మొదటగా 14వ శతాబ్దంలో మధురై సుల్తాన్‌లను విజయనగర సామ్రాజ్య అధిపతి కుమార కంపన్న ఓడించినప్పుడు జరిగింది. 14వ శతాబ్దం మొదట్లో మాలిక్ కాపూర్, ఉలుఘ్ ఖాన్‌లు రెండు పర్యాయాలు దక్షిణాదిపై దాడులు జరిపి పలుచోట్ల విధ్వంసం సృష్టించారు. మాలిక్ కాపూర్ ఎక్కువగా బంగారం, వెండి ఆభరణాలను అపహరించడం పట్ల దృష్టి సారించగా, తరువాత మహమ్మద్ బిన్ తుగ్లక్‌గా మారిన ఉలుఘ్ ఖాన్ మధురైని ఆక్రమించి ముస్లిం సామ్రాజ్యాన్ని స్థాపించాడు. అది 1335 నుండి 1378 వరకు సాగింది.

మధురై సుల్తాన్‌లను బుక్కరాయలు కుమారుడైన కుమార కంపన్న ఓడించి విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించాడు. తదుపరి తమిళ ప్రాంతంలో చాలా ప్రాంతాలకు ఆయన సామ్రాజ్యం విస్తరించింది. నాయక్‌లుగా పిలువబడే గవర్నర్‌లను మదురై, తంజావూర్, సెంజిలలో నియమించి పాలించేవారు. దానితో 15వ శతాబ్దం అంతా తెలుగు మాట్లాడేవారు చాలామంది వచ్చి తమిళనాడు అంతా స్థిరపడ్డారు. వారిలో కొందరు పరిపాలనలో నాయక్‌లకు సహాయపడ్డారు. ఇతరులు వ్యాపారం, వృత్తులు చేసుకొనేవారు. విజయనగర సామ్రాజ్యం కూలిపోయిన తరువాత నాయక్‌లు తమలో తాము పోరాడుకోవడంలో, మరాఠాలు తంజావూరుకు వచ్చి తమ పాలన చేపట్టారు. ఆర్కాట్ కేంద్రంగా నవాబ్ పాలన స్థాపించడానికి హైదరాబాద్‌లో నిజాం తన సేవలను పంపారు. ఈస్టిండియా కంపెనీ తమిళ ప్రాంతంలో వ్యాపారం చేయాలనుకొన్నప్పుడు వారు నాయక్, మరాఠా, నవాబ్‌లతో ఎక్కువగా సంబంధాలు పెట్టుకున్నారు. దక్షిణ భారతంను చాలావరకు మద్రాసు రాష్ట్రం క్రిందకు వారు తీసుకువచ్చారు.

ఈస్టిండియా కంపెనీ హయాంలో రెండో పర్యాయం పెద్ద సంఖ్యలో తెలుగువారి వలసలు పెరిగాయి. చేనేత, ఇతరవృత్తి చేసే వారిని ఆంధ్ర నుండి మద్రాసుకు తీసుకువచ్చి బ్రిటన్‌లోని తమ కంపెనీలకు ముడిసరుకు సరఫరాకు నియమించారు. తరువాత విద్యార్థులు, విద్యావంతులు, ఇతర తెలుగువారు రావడం ప్రారంభించారు. తమిళనాడులోని చాలా కులాల వారికి తెలుగు మాతృభాష. నాయుడు, నికార్ (నాయక్కర్), రెడ్డియార్, కొందరు చెట్టియార్ (చెట్టి), ఇతర షెడ్యూల్డ్ కులాల వారు కొన్ని ఉదాహరణలు. ఈ కులాల వారు రాష్ట్రం అంతా వ్యాపించారు. తమిళనాడును పరిపాలించిన వారిలో అత్యధికులు తెలుగువారే కావడం గమనార్హం.

**పాలకులలో తమిళులు నామమాత్రమే**

మద్రాసు ప్రెసిడెన్సీ/ప్రావిన్స్‌కు ప్రీమియర్‌లు, ముఖ్యమంత్రులుగా ఉన్నవారు : సుబ్బరాయలు రెడ్డియార్ (1920–21), పనగంటి రామరాయనిగర్(1921–26), పి.సుబ్బరాయన్ (1926–30), బి.మునుస్వామి నాయుడు (1930–32), బొబ్బిలి రాజు రామకృష్ణ రంగరావు (1932–37), కె.వెంకటరెడ్డి నాయుడు (1937), సి.రాజగోపాలాచారి (1937–39), టి.ప్రకాశం పంతులు (1946–47), ఓ.పి.రామసామి రెడ్డియార్ (1947–49), పి.యస్.కుమారస్వామి రాజ (1949–52), సి.రాజగోపాలచారి (1952–54).

1920 నుండి 1954 వరకు అసలు తమిళులు ఇద్దరే– పి.సుబ్బరామన్, సి.రాజగోపాలాచారి పరిపాలకులుగా ఉన్నారు. మిగిలిన వారంతా తెలుగువారే. 1952లో ఆంధ్రరాష్ట్రం విడిపోయిన తరువాత వచ్చిన ముఖ్యమంత్రులు : కామరాజ్, భక్తవత్సలం, అన్నాదురై మాత్రమే అసలు తమిళులు. కె.కామరాజ్(1954–63), యం.భక్తవత్సలం (1963–67), సి.యస్.అన్నాదురై (1967–69), కె.కరుణానిధి (1969–76, 1989–91, 1996–2001, 2006–11), యం.జి.రామచంద్రన్(1976–87), జానకి రామచంద్రన్ (1988), జె.జయలలిత (1991–96, 2001, 2002–06, 2011–14, 2015)

యం.జి.రామచంద్రన్ తండ్రి గోపాలమీనన్ మలయాళీ. రామచంద్రన్ శ్రీలంకలో జన్మించారు. రామచంద్రన్‌ను మలయాళీ అని పిలుస్తూ, బయటవాడని, తమిళనాడును పాలించటానికి అనుమతించరాదని అంటూ కరుణానిధి తీవ్రంగా ప్రచారం చేశారు. అప్పుడు కరుణానిధి కూడా తమిళుడు కాదని అంటూ రామచంద్రన్ చెప్పేవారు. తన తండ్రి తమిళ్‌కు చెందిన మన్రదియార్ కులానికి చెందినవారని, కేరళకు వలస వెళ్ళామని రామచంద్రన్ చెప్పేవారు. కరుణానిధి పూర్వులు ఆంధ్రకు చెందిన తెలుగు మాట్లాడేవారని ఆయన ఆరోపించేవారు. *(ఆయన ముత్తాత కృష్ణాజిల్లాలోని మొవ్వ గ్రామంలో ఉండేవారని, తీవ్రమైన కరువువల్ల కుటుంబంతో నేటి ప్రకాశం జిల్లా ప్రాంతానికి తరలి వెళ్ళారని, అక్కడినుండి తంజావూరుకు వెళ్ళి స్థిరపడ్డారని ప్రచారం ఉంది. –సం.)*

రామచంద్రన్ మృతి అనంతరం కొద్దికాలం ముఖ్యమంత్రిగా ఉన్న ఆయన భార్య జానకి రామచంద్రన్ కూడా కేరళ నుండి వచ్చారు. రామచంద్రన్ తరువాత ఆయన పార్టీని కైవసం చేసుకున్న జయలలిత కర్ణాటక నుండి వచ్చారు. అయితే తమిళ బ్రాహ్మణ తల్లిదండ్రులకు ఆమె పుట్టారు. *(తెలుగు సినీ నటి 'సంధ్య' ఆమె తల్లి అని లోకానికి తెలిసిన సంగతి. -సం)* కరుణానిధి, జయలలితల తరువాత తమిళ నాడులో నేడు బాగా ప్రాధాన్యత గల నాయకులు వైకో, విజయకాంత్‌లు కూడా తెలుగు మాట్లాడేకులాలకు చెందిన వారు. సోషల్ మీడియాలో వారిని రాష్ట్రం విడిచి వెళ్ళమంటూ కామెంట్స్ వస్తున్నాయి.

తమిళ జాతీయ వాదులకు ఈ పరిణామాలు గిట్టడం లేదు. "రాష్ట్రంలోని నాయుడు, నాయకర్ వంటి తెలుగు కులాలవారు మౌనంగా ఉంటూ ఉంటే తెలుగు మాట్లాడే నీవు నాయకత్వం కావాలి అనుకుంటావు? తిను, మౌనంగా ఉండు" అంటూ విజయకాంత్‌కు వ్యతిరేకంగా వ్రాతలు కూడా వస్తున్నాయి. "ఓ తమిళులారా! ఎక్కడకు వెళ్ళారు? వలస వచ్చినవారు నీ మాతృభూమిని ఆక్రమించుకొంటు న్నారు" అంటూ పోస్టర్లు వస్తున్నాయి. పరియర్ పెరవై అనే దళిత్ గ్రూప్ -ఈ పోస్టర్‌ను ఉంచింది.

అయితే వైకోకు వ్యతిరేకంగా ఇటువంటి దాడులు జరగడం లేదు. ఎందుకంటే ఆయన తమిళులకు, యల్.టి.టి.ఇ.కి ఈలంకు అనుకూల విధానాలు అవలంబించడమే అందుకు కారణం. జాతీయ మీడియా దృష్టికి ఆకర్షించని సంఘటన ఒకటి ఈ మధ్య జరిగింది. 'నామ్ తమిలర్' (మేము తమిళులము) అనే పార్టీ అధిపతి, ఈలం అనుకూల తమిళ జాతీయవాది సీమన్- 17వ శతాబ్దంలో మదురై నుండి పాలించిన నాయక్ పాలకుడు తిరుమల నాయక్‌పై విరుచుకు పడ్డాడు.

మధురైలో హెరిటేజ్ మందిరంగా భావించే నాయక్‌రాజు నిర్మించిన తిరుమల నాయకర్ మహల్ దగ్గరలో జరిగిన బహిరంగ సభలో తమిళులను బానిసలుగా పాలించిన పాలకుడు అని నిందిం చారు. దానితో ఆగ్రహం చెందిన నాయకర్ కులస్తుడు ఒకరు సీమన్‌కు ఫోన్ చేస్తే వ్రాయడానికి వీలులేని మాటలతో సమాధానం ఇచ్చాడు. ఈ సంభాషణ రికార్డు కూడా అయింది. నాయకర్ (తెలుగు) రాజులను దుర్భాషలాడ వద్దని మాత్రమే అతను కోరాడు. అయితే తమిళ్ జాతీయ వాదులు చాలామంది ఇటువంటి దుర్భాషలు వాడుతున్నారు. తమిళ నాడులోని తెలుగు మాట్లాడే కులాల సంఘాలు నిరసన ప్రదర్శనలు జరపాలని నిర్ణయించినా పూర్తిగా కార్యరూపం దాల్చలేదు. ఈ సంఘటన గురించి ప్రధాన మీడియా పట్టించుకోలేదు.

**ద్రావిడ పదాన్ని వ్యతిరేకిస్తున్న తమిళ జాతీయవాదులు**

తమిళజాతీయ వాదుల అభిప్రాయం ప్రకారం 'బయటవారు' తమ రాష్ట్రంలో శాంతియుతంగా జీవించవచ్చు. కాని తమిళులను పాలించరాదు. అందుకనే వారు 'ద్రావిడ' పదాన్ని సహితం వ్యతిరేకిస్తు న్నారు. ఎందుకంటే ఈ పదం తెలుగు, కన్నడ, మలయాళీలను కూడా కలిపి ఉంచుతుంది. 'ద్రావిడ' అనెడిది ఒకే దారి వాదనగా ఉన్నదని, ఈ పదాన్ని తమిళులే వాడుతున్నారని, పొరుగువారిలో ఆసక్తి కన పడటం లేదని, ఈ పదం వెనుక ఉన్న రాజకీయ వాదాన్ని సహితం పట్టించుకోవడం లేదని గుర్తు చేసుకున్నారు.

హిందూ, బ్రాహ్మణ, సంస్కృత, ఆర్యన్ వాదాలకు వ్యతిరేకంగా ద్రావిడ జాతి వాదాన్ని తెలుగు భూస్వాములు ఏర్పాటు చేసిన జస్టిస్ పార్టీ, మలయాళీ టి.యం.నాయర్, కన్నడ మాట్లాడే పెరియార్ ఇ వి రామసామిలే 'ద్రావిడ' జాతివాదాన్ని ప్రచారం చేశారు. బ్రిటీష్ భారత్‌లో ప్రభుత్వ ఉద్యోగాలపై, కాంగ్రెస్ పార్టీపై తమిళ, తెలుగు బ్రాహ్మణుల ఆధిపత్యానికి వ్యతిరేకంగా ఈ వాదన లేవనెత్తారు. అయితే 'ద్రావిడ్' పదాన్ని తమిళనాడులోని తెలుగు మాట్లాడేవారు స్థానిక తమిళులను ప్రక్కకు నెట్టి, అధికారం తమ చేతుల్లో ఉంచుకోవడానికి ఉపయోగించుకొంటున్నారని తమిళ జాతీయవాదులు నేడు ఆరోపిస్తు న్నారు. మొత్తం మీద ఇటువంటి విభజన రాజకీయాల పట్ల తమిళ ప్రజలు పెద్ద ఆసక్తి చూపడం లేదు.

*('స్వరాజ్యం' ఆంగ్లపత్రిక ఆధారంగా)*

కవిత

## అక్షరాలు-ఆయుధాలు

ఐదో తరగతిలో ఉన్న మా అమ్మాయి అడిగింది
నాన్నా బాచాఖాన్ విద్యాలయంలో
విద్యార్థులనెందుకు కాల్చి చంపారని
సమాధానంగా...ఉగ్రవాదంలోకి మళ్ళకు బేటా
అని తనయుడికి తెలివి చెప్పినందుకు
వాడిచేతిలోనే ఖతమైన ఒక తల్లి గతం,
కొన్నాళ్ళ క్రితం పెషావర్ పాఠశాలలో
పాశవిక దాడిలో ప్రాణాలు కోల్పోయిన పసిమొగ్గలు,
ఇంకొన్నేళ్ళకు ముందు బడికి వెళుతున్నందుకు
బస్సులో తాలిబాన్ల తూటాలు తలలో దిగిన
బంగారు బాల మలాలా గుర్తుకొచ్చారు నాకు
వెరసి ఒక శ్మశానపు మౌనం మాత్రమే జవాబుగా
నా నిస్సహాయపు చూపు రూపంలో
ప్రసరించింది మా పాప వైపుకి
అక్షరాలను ఆయుధాలుగా
మలుచుకుని చేతనను చిగురింప చేస్తూ
పుస్తకాలను అవపోసన పట్టి
ప్రపంచ శాంతికై పాకులాడాలి కానీ
ఆత్మాహుతి దళాల్లో చేరి
తుపాకీ గుళ్ళను దేహాల్లోకి దింపితే ప్రయోజనమేంటి?
ఉగ్రవాదాన్ని ఉగ్గుపాలతో రంగరించే
కరడుగట్టిన కొన్ని దేశ మాతల్లారా
వేర్పాటు వాదాన్ని విడిచి, మతతత్వవాదాన్ని మరచి
అక్షరాల ఆసరాతో అవ్యాజమైన అనురాగాన్ని
విశ్వవ్యాప్తంగా ప్రవహింపచేయండి
మారణాయుధాలు లేని మరో ప్రపంచాన్ని మరొక్కసారి నిర్మించండి!
(బాచాఖాన్ యూనివర్శిటీలో ఇటీవలి నరమేధానికి స్పందనగా)

-శివ్
సెల్ : 98485 27109

ప్రదర్శన కోసం

-ప్రజాసాహితి నాగరాజు

# తెలుగుతల్లి మనోవేదన

## ఏకపాత్రాభినయం

**ఈ ఏకపాత్రను పాఠశాలల్లోగాని, ఇతరత్రా గాని ప్రదర్శించడానికి ఎటువంటి అనుమతినీ మా నుండి కోరనక్కరలేదు. ఆ సందర్భంలో వేదిక మీద రచయిత 'ప్రజాసాహితి నాగరాజు గారు అనీ 'అమ్మనుడి'లో ప్రచురించారనీ చూపరులకు తెలియజేస్తే సరిపోతుంది. ప్రదర్శన ఫొటో, వివరాలు పంపితే పత్రికలో ప్రచురిస్తాం.** -సంపాదకుడు

కన్నతల్లిదండ్రుల్ని వృద్ధాశ్రమానికి, కన్నబిడ్డల్ని వసతిగృహాలకి తరిమేస్తున్న సంస్కృతి నేటిది.

'అమ్మభాష'ను - తెలుగును- బడి నుండి తరిమేస్తున్న విధానాలు మనవి.

'తెలుగు' గురించి మాట్లాడటం ఒక మనోభావం(సెంటిమెంట్)గా తీసిపారేస్తున్న సందర్భంలో నిలబడి వున్నాం.

'తెలుగు' ఎందుకంటే 'అమ్మ' ఎందుకో 'తెలుగు' అందుకు - అని అనడానికి కూడా ధైర్యం చాలని పతన విలువల మధ్య కొట్టుమిట్టాడుతున్నాం.

ఈ కొలిమిలో మండుతూ 'తెలుగుతల్లి మనోవేదన'ను ఏకపాత్రగా రచించాను.

ఆలోచించి, ఆగి పరిశీలించుకొనే తీరిక లేని వర్తమాన పరుగుల్లో ఈ 'మనోవేదన' వినబడుతుందో లేదో? కానీ...వినిపించక తప్పదు. సాహిత్యానికి ఒక చారిత్రక కర్తవ్యం వుంది కదా! కాలాన్ని నమోదు చేయాలి కదా! -రచయిత

*(చింపిరి గుడ్డలు. ముగ్గు బుట్టవంటి తల- ముడుతలు దేరిన శరీరం. గాజుపెంకుల్లా కాంతి లేని కళ్ళు. చారికలు కట్టిన కన్నీళ్ళు)*

పిల్లల్లారా! పెద్దల్లారా!

మీతో ఒక మాట చెప్పాలని వచ్చాను.

అరే. నే నెవరని అడుగుతున్నారా!

చూశారా! నన్ను పోల్చుకోలేని స్థితిలో మీరున్నారు. ఔనులే! నన్నెలా పోల్చుకుంటారు?

ఇప్పుడు నాకో ఊరా? పేరా? చోటా? పేటా? దిక్కా! మొక్కా!

మీ అమ్మా నాన్నలే నన్ను వెలివేశారు.

పరాయి వ్యామోహంలో మిమ్మల్ని పెంచుతున్నారాయె! అమ్మమ్మనా! నాయనమ్మనా!

మీ కుటుంబాల్లో వాళ్ళకే దిక్కులేదు! నేనో లెఖ్ఖా?!

* * *

నా కంటి మీద కునుకులేదర్రా! కంటికీ మంటికీ ఏకధారగా కుమిలిపోతున్నాను!

ఆంగ్లం అంగళ్లలో నా బిడ్డలు గుక్కపట్టి ఏడుస్తున్నారు! 'అమ్మా' అన్నందుకు లేత ఒళ్ళు నెత్తుటి తట్లు తేరుతున్నాయి! తెలుగులో- మాతృభాషలో మాట్లాడినందుకు దారుణంగా శారీరక, మానసిక శిక్షలు అనుభవిస్తున్నారు!

ఇంగ్లీషు చదువులు అర్థంకాక,

తెలుగులో రాయకూడదు కనుక,

ఆలోచించకూడదు కనుక

రెంటికి చెడ్డ రేవళ్ళై విలపిస్తున్న బిడ్డల గుండెగాయాలు

నా నుదిటిరాతలై నెత్తురోడుతున్నాయి!

పుట్టుకదగ్గరా, పరాయిభాషలో నవ్వలేరు

చావు దగ్గర కూడా ఎరువు భాషలో ఏడ్వగలరా!?

మరి మీ మానసిక ప్రపంచానికి

ఒక రూపాన్నిచ్చే మీ జాతి తల్లినే!

నన్ను గుర్తు పట్టలేరా?

నేనండీ మీ తెలుగుతల్లిని!

కన్నతల్లిని గుర్తించలేనంత ఎత్తుకి ఎదిగిపోయారిప్పుడు!

మీరేం చేస్తారు! ప్చ్!

నా యింట్లో నేను లేను!

నా మాట నాదికాదు!

నా పిల్లల బడిలోంచి కూడా నన్ను మెడ పట్టుకు గెంటేయాలనే

ఆలోచనలు కమ్ముకొస్తున్నాయి!

నాకో మాట చెప్పండి!

"భాష కోసం జ్ఞానమా?

జ్ఞానం కోసం భాషా?"

నేను నా పిల్లలకి ఉపాధీ ఉద్యోగం చూపించలేనంత

చేతకాని దాన్నై పోయానని- నన్ను- కన్నతల్లిని-

ఇంటినుంచి, బడి నుంచి తరిమేస్తున్నారు!

నా చేతిలో నిజంగా ఉపాధి శక్తి లేదంటారా?!

అలా లేకుండా చేస్తున్న రాజకీయ విధానాల్ని

పల్లెత్తి, ఒక్క మాటైనా అనరేం? నాకు బతికుండగానే దినం పెడుతున్నారు.

నా విగ్రహాలకి, చిత్రపటాలకి పూజలు చేస్తూ.

నా పేరు రాజకీయ పార్టీలకు కూడా పెట్టుకుంటూ

నన్ను మాత్రం వెలివేస్తున్నారు.

పడమటి వెర్రిగాలులకు నన్ను బలిచేస్తున్నారు!

గ్లోబల్ వేదిక మీద నా ఆత్మని పాతరేస్తున్నారు!

కనీసం కొత్త రాజధాని ఆహ్వానాల్లో నైనా నాకు చోటులేదు! శంకుస్థాపన రాతి పలకల పైనా నా అక్షరమే లేదు.

నేను పాలనకు పనికిరానంట!

ఓట్లు అడుక్కునేది నేను నేర్పిన తెలుగు భాషలో,

చట్ట సభల్లో కాట్లాడుకుంటూ తిట్టుకొనేది

నేను నేర్పిన మాతృభాషలోనే కానీ,

చదువును నేర్పడానికి ఈ తెలుగు తల్లి పనికిరాదు.

పరిపాలనలో ఈ పిచ్చితల్లి కొరగాదు!

నాకో మాటచెప్పండి!

"నీటిలోకి దిగితే ఈతవస్తుందా?

ఈత వచ్చాక నీటిలోకి దిగుతారా?"

"సాధనమున పనులు సమకూరు ధర లోన"

అని అంటాడు నా ముద్దుబిడ్డ వేమన!

ఆనాటి నా దిట్టబిడ్డలు నాచన, పాల్కురికి, తిక్కన్నల

12-13 శతాబ్దాల కాలం నాటికే

అపారమైన జానుతెలుగు అపారమైన పద సంపదతో

అటు కావ్యాల్లో, ఇటు ప్రజల్లో నేను సగర్వంగా విరాజిల్లుతున్నప్పుడు

ఈ ఆంగ్లం అప్పుడు ఒక కుగ్రామంలో

ముక్కి మూల్గుతోంది.

పారిశ్రామిక విప్లవంతో పెట్టుబడిదారీ ప్రయోజనాల్లో భాగంగా-

లాటిన్ గ్రీక్‌లాంటి అనేక భాషల్ని తనలో కలుపుకొని

ప్రపంచవ్యాప్తమైన ఆంగ్లభాష- ఆధిపత్య భాషగా

మన లాంటి భావదాస్యపరుల చేత

భాషాదాస్యం కూడా చేయించుకుంటోంది!

నిజానికి చెప్పండి!... ఎన్ని ప్రపంచ దేశాల్లో ఇంగ్లీషు వుంది?

కనీసం 20 శాతం దేశాల్లోనైనా ఆంగ్లం వాడుకలో వుందంటారా? ప్రపంచభాష అనడానికి ప్రామాణికత ఏంటి?

లెక్కాచారం ఆలోచించారా?

ప్రపంచంలో అగ్రదేశాల్లోనే ఆంగ్లం

ఫక్తుగా ప్రజల భాష కాలేకపోయింది! కాదంటారా?!

శ్రీకాకుళం జిల్లా టెక్కలికి చెందిన ఆచార్య రోణంకి అప్పలస్వామిగారు

పద్నాలుగు ఐరోపాభాషల్ని- దేశం గడప దాటకుండా

ఎలా నేర్చుకున్నారు?

నా వెచ్చని ఒడిలోనే తెలుగు అంత బాగా నేర్చుకున్నారు కనుకనే!

ఆ విషయం ఆ సూర్యుడు ఋజువు చేశారు!

అదీ అమ్మ ఋణం తీర్చుకోవడమంటే..

అమ్మనుడి పరువు నిలబెట్టడమంటే అదీ!

* * *

జెబిఎస్ హాల్డెన్ అనే ఆంగ్లీయ వైజ్ఞానిక శాస్త్రవేత్త ఏమన్నాడు?

విజ్ఞాన శాస్త్రాలన్నింటినీ వ్యక్తం చెయ్యగల సామర్థ్యం

తెలుగు భాషకుందని చాటి చెప్పాడు!

విద్యా మనోవిజ్ఞాన శాస్త్రవేత్తలు గగ్గోలు పెడుతున్నారు.

పరాయిభాషలో విద్య నేర్పడంవల్ల

పిల్లలు నిరాశా నిస్పృహలకీ,

మానసిక కృంగుబాటుకి,

ఆశాభంగాలకు, నిరుత్సాహానికి గురై

పెరిగిపెరిగి విరిగి

మానసిక రోగులుగా చితికి పోతున్నారు.

మొన్నమొన్న బెంగుళూరు సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ బల్‌బీర్‌సింగ్

తను రాత్రీపగలూ కష్టపడి రూపొందించిన ప్రకల్పన

ఆమోదం పొందలేదని-

కరీంనగర్‌లోని పార్వతీనగర్‌లో

సొంత ఇంటికి వచ్చి మానసికంగా వికలమై,

కన్నతల్లిమీద- వీధిలో వాళ్ళమీద

విచక్షణా రహితంగా కత్తితో దాడులు చేశాడు.

పోలీసులు అదుపు చేయలేక, తప్పనిసరి పరిస్థితుల్లో



**రాజకీయ పార్టీ !**

నిన్న-
ఉన్నవన్నీ రాల్చుకుని
ఆస్తులన్నీ అమ్ముకుని
సమాజాన్ని ఉద్ధరించే
చల్లని నేతలచెట్టు నీడ!

నేడు-
సమాజాన్ని కొల్లగొట్టి
మూటగట్టుకున్న
ఆస్తుల తేనెతుట్టె...
ఆదాయశాఖ గద్దచూపు నుండి
సిబిఐ గాలం నుండి
నిత్యమూ కాపాడే రక్షణ కవచం!

**-కలిమిశ్రీ,** 92464 15150

తుపాకులతో కాల్చి చంపేశారు! నా బడిలో అమ్మనుడిలో చదువుకొని వుంటే

మనోనిబ్బరం ఇలా దెబ్బతినేది కాదుగా!

అసలు ఉద్యోగాలు రావాలంటే

ఆంగ్లంలో చదవాలనే మూఢనమ్మకాన్ని

పాలకులు బలంగా ప్రచారం చేస్తున్నారు.

ప్రైవేటీకరణ సరళంగా ఈ గరళాన్ని

ప్రజలకంత చుక్క చుక్కా మింగిస్తోంది!

ఎంతమంది ఆంగ్లంలో చదివిన వాళ్ళు

ఉద్యోగాలు పొందారో లెక్కలు తేల్చగలరా?!

కులంకన్నా,

మతంకన్నా,

ప్రాంతంకన్నా,

భాషాజాతి గొప్పది!

నేను అంతరిస్తే- తెలుగు సంస్కృతే నశించిపోతుందన్న వాస్తవాన్ని

మీరు అర్థం చేసుకోవటంలేదు!

నేను కేవలం మాతృభాషని మాత్రమే కాదు....

తెలుగు బతుకు ప్రాణాన్ని, గుండె కాయను!

ప్రాణాన్ని కోల్పోయిన వారు సజీవులై వుండగలరా?

సాంస్కృతికంగా నశించిన జాతి

ఆర్థికంగా రాజకీయంగా బానిసత్వంలో కూరుకుపోతుంది అనడానికి

వేరే ఉదాహరణలు కావాలా?

నేటి చెదిరిపోతున్న బతుకుల్ని చూస్తే

జిల్లా అధికారి కావాలన్నా,

రాష్ట్ర ప్రభుత్వంలో ఉన్నత పదవుల్ని పొందాలన్నా,

వైద్యం చదవాలన్నా,

ఏ ఉద్యోగం చేయాలన్నా

ఏ వృత్తి చేపట్టాలన్నా

"తెలుగు" అవసరం ఏర్పడేలా

పరిపాలనా విధానాల్ని రూపొందించడం వల్లనే

మన తెలుగువాళ్ళ ఆత్మాభిమానం,

ఆత్మవిశ్వాసం వెయ్యింతలవుతుంది!

పద్దెనిమిదికోట్లకు పైగా వున్న నా తెలుగు బిడ్డలు

ఏ ఖండంలో వున్నా, ఏ గ్రహం మీద వున్నా-

తెలుగు పతాకాన్ని ఎగురవేస్తారు!

నన్ను- తెలుగును- బతికించండి అంటే
ఈ అమ్మని ఆదరించండి అంటే-
ఇతర ఇరుగుపొరుగు అమ్మలను గౌరవించవద్దని అన్నట్టు
ఎందుకు తప్పుగా అర్థం చేసుకుంటారు?
తెలుగుతల్లిని- నేను కన్నును.
పొరుగు భాషలు కళ్ళ జోడులాంటివి.
కన్ను పొడుచుకుని కళ్ళజోడుతో ఏం చూడగలరు?
మాతృభాషను-నేను- తెలుగుతల్లిని-
నేను మీ ఆలోచనలకు వాకిలిని...
మీ రాకపోకలు నా నుండే
చేసుకోవడం సరైన పద్ధతి.
మాతృభాషలేవైనా- ఇంటికి కిటికీలు లాంటివి.
ఇరుగు పొరుగు ప్రాంతాల, దేశాల, ఖండాల,
గాలి, వెలుతురు, సాంస్కృతిక సువాసనలూ
ఆ కిటికీల ద్వారా మన ఇంట్లోకి-
అంటే మనభాషలోకి-
మన బతుకుల్లోకి ప్రవేశించి
మనల్ని భావజాలపరంగా సంపన్నుల్ని చేయాలి!
పిల్లల్లారా! చెప్పండి!
నేను- మీ తెలుగమ్మను మీ ఇంట్లోకి - మీ బడుల్లోకి
అంటరాన్ని దాన్ని చేసి, వెలివేస్తారా!
పిల్లల్లారా! పెద్దల్లారా! పాలకులారా! అధికారుల్లారా!
నాకు దాహం వేస్తోంది. బడిలో చదువుని మాతృభాషలో చెప్తే-
నా దప్పిక తీరుతుంది!
ప్రజలభాషలో పరిపాలన చేస్తే- నా ఆకలి తీరుతుంది.
నాకు దినంపెట్టి- బతికుండగానే దిక్కుమాలిన దాన్ని చెయ్యకండి!
ఏమిటో!
ఈ ఎరుకమాలిన చిలకపలుకుల చదువుల తరానికి-
నా గుండె గోడు అర్థమయ్యిందో లేదో!
ప్చ్!

రచయిత ఫోన్ : 94419 13829

# తెనుగు లెంక సూక్తులు-7



'తెనుగు లెంక'
'అభినవ తిక్కన'
**తుమ్మల సీతారామమూర్తి.**

***'నేను' విడిచి 'మనము'పై నిచ్చనిడనిచో***
***దేశమెక్కిరాదు లేశమేని***
***క్రొత్త కఱద గాదు ముత్తాతలే యిది***
***సెప్పినారు కన్ను విప్పినారు***

మనిషి సంఘజీవి. సంఘంలో ఒక భాగం. మనుషులెందరో కలిస్తేనే సంఘం అవుతుంది. ఒంటరిగా సమాజానికి దూరంగా ఎవడైనా జీవిస్తూ ఉంటే అలాంటి వ్యక్తిని సంఘం అని ఎవరూ పిలువరు. కాబట్టి మనుషులు ఒకచోట కలిసి జీవిస్తేనే సంఘం అవుతుంది. సంఘంలో ఉండే వ్యక్తి సంఘంలోని ఇతర వ్యక్తుల సహాయ సహకారాలు లేకుండా జీవించలేడు. అతని జీవనావసరాలు తీర్చడానికి అన్ని వృత్తులవాళ్ళు అతనికి సాయపడతారు. ఇతరులతో ప్రమేయం లేకుండా, ఇతరుల సహాయం గ్రహించకుండా తాను ఒంటరిగా ఉంటానంటే అతడు మళ్ళీ ఆటవిక దశకు వెళ్ళక తప్పదు. సంఘ జీవితంలోనే సుఖం వుంటుంది. సంఘ జీవితంలోనే ప్రగతి వుంటుంది. సంఘ జీవితంలోనే శాంతి భద్రతలు వుంటాయి. అది గ్రహించిన మన పూర్వులు సంఘజీవితానికి ప్రాధాన్యమిచ్చారు.

సంఘంలో బ్రతికే ఒక మనిషి 'నేను' అని అనుకోకూడదు. 'మనము' అనుకోవాలి. తాను బ్రతకాలి. తన చుట్టూ ఉండే సంఘ సభ్యులు బ్రతకడానికి తోడ్పాటును అందించాలి. తాను తినాలి. తన చుట్టూ వుండేవారు కడుపునిండా తిన్నారో లేదో గమనించాలి. తినకపోతే వారికి సాయం చేయాలి. కేవలం సంఘంలో ఒక వ్యక్తి మాత్రమే ధనవంతుడై, మిగిలినవాళ్ళందరూ ఆకలితో మాడుతూ ఉంటే ఆ సంఘం - ఆ సంఘ జీవితం ఎంతకాలం మనుగడ సాగిస్తుందో చెప్పలేం. అంతరాలు పెరిగితే అంతర్యుద్ధాలు జరుగుతాయి. కడుపు ఎండినవాడు-కడుపు నిండినవాడిపై తిరగబడతాడు. శరీరంలో ఒక భాగం పెరిగి మిగిలిన భాగాలన్నీ కృశిస్తే, అది రోగం. అలాగే ఒక వ్యక్తి ఉన్నతంగా పెరిగి, సంఘంలోని మిగిలిన సభ్యులందరూ హీనంగా ఉంటే అది సామాజిక రోగం. రోగం ముదిరితే రోగి ఎలా బ్రతకడో, సామాజిక రోగం ముదిరితే సంఘజీవితం ముగిసిపోతుంది.

మనిషికి తృప్తి లేకుండా పోయింది. సాధ్యమైనంత దోచుకోవడం, దాచుకున్నది దోచుకోవడం, ఆ దాచుకున్నదానిని రక్షించుకోవడానికి ఎన్నో అకృత్యాలు, ఎన్నో అన్యాయాలు, ఎన్నో అధర్మాలు చేయడం మనం చూస్తున్నాం. డబ్బును సక్రమమార్గంలో సంపాదించినవారు కొద్దిమందయితే, అక్రమమార్గంలో ఆర్జించినవారు అనేకులు. సంపాదించిన సొమ్మును తాను అనుభవిస్తూ, కొంత భాగమయినా తన తోడివారికి పెట్టే మహానుభావులు ఎందరున్నారో మనందరికీ తెలుసు. సమాజంలో పేదలున్నారు. నిరాశ్రయులున్నారు. నిర్భాగ్యులున్నారు.

పట్టెడు మెతుకుల కోసం పలవరించే అనాథ బాలబాలికలున్నారు. అంగవైకల్యంతో అలమటించే అభాగ్యులున్నారు. వారందరూ భోగభాగ్యాలతో కాకపోయినా కనీసం కనీస అవసరాలకు లోపం కలుగకుండా జీవించే విధంగా 'ఉన్నవాళ్ళు' తోడ్పడాలి. తద్వారా ఆరోగ్యకరమైన సమాజం ఏర్పడుతుంది.

భారతీయులకు ఈ దృష్టి పూర్వకాలం నుంచి వుంది. వారు విశ్వ శ్రేయస్సును కాంక్షించినవారు. 'నేను'తోపాటు ప్రపంచమంతా సుఖ సంతోషాలతో ఉండాలని అభిలషించినవారు, బోధించినవారు. ఇప్పుడు ఆ బోధలు మరచిపోయిన మనుషులకు తెలుగులెంక మళ్ళీ హితబోధ చేయవలసిన అవసరం ఏర్పడింది. అందుకే ఈ పద్యంలో ఆయన ఇలా చెప్పారు: 'నేను' అనే స్వార్థాన్ని విడిచి 'మనము' అనుకోకపోతే దేశం అభివృద్ధి చెందదు. ఇది క్రొత్తగా నేను చేసే హితబోధ కాదు. మన ముత్తాతలే ఈ విషయాన్ని తెలియజేసి మనకు కనువిప్పు కలిగించారు.

మనం 'తెనుగులెంక' మాటలు పాటిస్తే మన సమాజం, మన రాష్ట్రం, మన దేశం ప్రగతిపథంలో పయనిస్తుంది. సర్వాంగ సౌష్టవంతో కళకళలాడుతుంది.

**-డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ,** 98497 99711

ముఖచిత్రం

–ఆర్.ఎం.ఉమామహేశ్వరరావు

# బంగ్లాదేశ్‌లో తెలుగు మాట, ఆట, పాట...

**భా**షోద్యమాలకు స్ఫూర్తి కేంద్రమైన ఢాకా విశ్వవిద్యాలయాన్ని చూడడం గొప్ప అనుభూతి. తెలుగువాళ్ళని కలుసుకోవడానికి స.వెం.రమేశ్, అడపాల సుబ్బారెడ్డి, నేను– క్రిస్మస్ ముందురోజు బంగ్లాదేశ్ చేరుకున్నాం. బంగ్లాదేశ్‌కి మమ్మల్ని పిలిచిన వేపాడ ఆనంద్, క్రిస్మస్ వేడుకల ఏర్పాట్లలో ఉన్నాడు. మధ్యాహ్నం దాకా తెలుగువాళ్ళని కలుసుకునే అవకాశం లేదు. ఉదయాన్నే లేచి ఢాకా నగరంలో తిరగడానికి బయలుదేరాం. ఒక ఆటో మాట్లాడుకున్నాం. ఢాకాలో మోటార్ సైకిళ్ళు దాదాపుగా కనిపించవు. ఎటు చూసినా సైకిల్ రిక్షాలే. నలభై ఏళ్ళ కిందట తెలుగు పట్టణాలు గుర్తుకొస్తాయి. ఆటోలు అక్కడక్కడా ఉన్నా అన్నీ గ్యాస్‌తో నడిచేవే. సహజవాయువు బంగ్లాదేశ్‌లో దండిగా దొరుకుతోంది. పైపులైన్‌ల ద్వారా ఇళ్ళకి కూడా ఇస్తున్నారు. కార్లు కూడా గ్యాస్‌తోనే నడుస్తున్నాయి. ఢాకాలో 83 శాతం కార్లు గ్యాస్‌తోనే నడుస్తాయి. మినీ బస్సులు 91 శాతం గ్యాస్‌తో నడిచేవే. గ్యాస్ ధర కూడా తక్కువే. ఒక క్యూబిక్ మీటర్ 25 టాకాలు. అయినా సొంత వాహనాలు చాలా తక్కువ. ఏ రోడ్డు మీద చూసినా ఒక ప్రవాహంలా రిక్షాలు కదిలిపోతుంటాయి. ఢాకా నగరంలో కొన్ని దారుల్లో కేవలం రిక్షాలను మాత్రమే అనుమతిస్తారు. ట్రాఫిక్ సిగ్నల్స్‌తో సంబంధం లేకుండానే వాహనాలు దూసుకుపోతుం టాయి. ఇక్కడి ఆటోలు ఇనుపతీగలు చుట్టిన గదుల్లా ఉంటాయి. అన్నివైపులా తలుపులుం టాయి. ప్రయాణీకులు ఎక్కగానే గడి పెట్టే స్తారు. ఆటో డ్రైవర్ కూడా తలుపులు గడి పెట్టుకొనే నడపాలి. భద్రతా కారణాల వల్ల ఈ ఏర్పాటు చేశారు. తెలియని టాక్సీలు, ఆటోల్లో ప్రయాణం ప్రమాదకరం అని చెప్పారు. కోల్‌కత్తా నుంచి భారత సరిహద్దు గ్రామం బనగావ్‌కి చేరుకొని, ఇమ్మిగ్రేషన్ తతంగం ముగించుకుని బంగ్లాదేశ్‌లోకి అడుగుపెట్టగానే టాక్సీ డ్రైవర్లు చుట్టు ముట్టారు. ఏ సంకోచమూ లేకుండా మేం ముగ్గురం ఒక టాక్సీలో ఢాకాకి బయలు దేరాం. పది సీట్ల చిన్న వ్యాను అది. అటూ ఇటూ పొలాలూ, నీళ్ళ దొరువులు, నదులూ దాటుకుంటూ ఢాకా నగరం చేరుకున్నాకే తెలిసింది, ఇటువంటి ప్రయాణం చాలా ప్రమాదం అని. కిడ్నాప్‌లు ఎక్కువగా జరుగు తుంటాయంట. డబ్బులు లాక్కుని తలలు నరికేసి వెళ్ళిపోతుంటారని చెప్పారు. మేం దిగిన హోటల్ వాళ్ళ సాయంతో ఒక ఆటో మాట్లాడుకున్నాం, నగరం తిప్పి చూపించేలా. డ్రైవర్ పేరు జలాల్ షేక్. బెంగాలీ భాషకు సమానహోదా కోరుతూ జరిగిన ఉద్యమంలో విద్యార్థులు అమరులైన చోటుకు తీసుకువెళ్ళా లని అడిగాం. ఢాకా యూనివర్శిటీ బయటే ఒక కూడలిలో విద్యార్థి సమూహం విగ్రహాలు స్వాగతం పలికాయి. బహుశా ఇదేనేమో అను కుంటూ ఆటో దిగి, దగ్గరకు నడిచాం. అమ్మా యిలూ, అబ్బాయిలూ ఒకరి చేతులు ఒకరు పట్టుకొని వలయాకారంలో నిలబడి ఉన్న విగ్రహాలు అవి. ఉద్వేగం, ఉద్రేకం, పట్టు దలను ప్రతిబింబిస్తూ ఉన్న ఆ విగ్రహాలు, వామపక్ష విద్యార్థి సంఘాలు ఏర్పాటు చేసి నవి. విద్యార్థి ఉద్యమాలపై రాజకీయ అణచి వేతకూ, హింసకూ వ్యతిరేకంగా వీటిని నెలకొల్పారు. తొలి నుంచీ ఢాకా విశ్వవిద్యా లయం ఉద్యమాలకు వేదికగానే ఉంది. దేశంలో ఎక్కడ ఏ అణచివేత చర్యలు జరిగినా ఇప్పటికీ ఢాకా విద్యార్థుల గొంతులు పిక్కటిల్లు తాయి. బంగ్లా స్వతంత్ర పోరాటంలోనూ, మాతృభాషా పోరాటాల్లోనూ ఢాకా విశ్వవిద్యా లయం కీలక భూమిక పోషించింది. ఈ పోరాటం గురుతులెన్నో కనిపిస్తాయి ఆవర ణలో. పాత భవనాల మీద నినాదాలు మెరుస్తూ ఉంటాయి. ఆర్ట్స్ అండ్ హ్యూమాని టీస్ భవనం ముందు తుపాకులు భుజాన ధరించిన బలిష్టమైన ముగ్గురు మనుషుల విగ్రహాలుంటాయి. ఈ ముగ్గురిలో ఒకరు మహిళ. ఆమె భుజాన మందుల పెట్టె వేలా డుతూ ఉంటుంది. ధైర్యం చెబుతున్నట్లుగా ఉండే ఈ ముగ్గురు యోధుల విగ్రహాలను అపరాజయో బంగ్లా అంటారు. ఓటమి ఎరుగని బంగ్లా అన్నమాట. 1971 స్వతంత్ర పోరాట చిహ్నం ఇది. మేం వెతుకుతున్న స్మారక స్థలం బహుశా ఇది కూడా కాదు. అక్కడికి కాస్త దూరంలోనే మలుపు తిరిగితే ఒక భవనం ముందు నలుగురు విద్యార్థుల ముఖాలను గ్రానైట్ రాతి ముక్కలతో చిత్రిం చారు. భాషోద్యమంలో అమరులైన ఢాకా విశ్వ విద్యాలయం విద్యార్థులు సలామ్, జబ్బార్, బర్‌ఖత్, రఫీక్ ఈ నలుగురూ. భారత్, పాక్ విభజన సమయంలో ప్రస్తుత బంగ్లాదేశ్ తూర్పు పాకిస్తాన్ పేరుతో పాకిస్తాన్ పాలన లోకి వెళ్ళింది. **బంగ్లాదేశ్ జనాభాలో అత్యధిక శాతం ముస్లింలే అయినా వీరి అమ్మ భాష బెంగాలీ. ఉర్దూ భాషను బలవంతంగా రుద్ద డంతో ప్రజలు తిరగబడ్డారు. బెంగాలీ భాషకు ఉర్దూతో సమాన హోదా కావాలంటూ ఆందో ళనలు రగిలాయి. భాషోద్యమానికి ఢాకా విశ్వవిద్యాలయం కేంద్రంగా మారింది. విద్యా ర్థులు ఉప్పెనలా దూకారు. 1952 ఫిబ్రవరి 21న పాకిస్తాన్ పోలీసులు జరిపిన కాల్పుల్లో డజన్ల సంఖ్యలో విద్యార్థులు, ఆందోళన**

తెలుగు సిటీ



**కారులు చనిపోయారు. మరణించిన వారిలో నలుగురు ఢాకా విశ్వవిద్యాలయం విద్యార్థులు. నిరసనగా ప్రపంచమంతా అట్టుడికిపోయింది. పోరాటం వృధా కాలేదు. బెంగాలీ భాషకు సమానహోదా లభించింది. భాషోద్యమంలో విద్యార్థులు అమరులైన ఈ తేదీని మాతృభాషా దినోత్సవంగా ఐక్యరాజ్యసమితి 2000లో ప్రకటించింది.** తెలుగు రాష్ట్రాలు సహా అనేక దేశాలు ఇప్పుడు ఫిబ్రవరి 21ని మాతృభాషా దినోత్సవంగా జరుపుకుంటున్నాయి. అక్కడికి దగ్గరలోనే అమరవీరుల స్మారకస్థూపం కూడా వుంది. కాల్పులు జరిగిన మెడికల్ కాలేజీ ఆవరణలోనే దీనిని ఏర్పాటు చేశారు. షాహిద్‌మినార్ అంటారు దీన్ని. 1971లో ఒకసారి దీనిని ధ్వంసం చేశారు. తిరిగి ఇప్పుడు ఆధునిక శైలిలో నిర్మించారు. దగ్గరిలోనే ఒక కాలువ గట్టున ఉన్న బంగబంధు షేక్ ముజిబుర్ రహ్మాన్ సమాధిని కూడా చూసి మధ్యాహ్నానికి గోల్‌గొత్త తెలుగు చర్చికి చేరుకున్నాం. వందల మంది తెలుగు వాళ్ళు ఒక్కచోట చేరి తెలుగులో పాటలు పాడుతూ ప్రార్థనలు చేస్తున్నారు. శ్రీకాకుళం యాసలో ఆప్యాయంగా పలకరించారు. ఇక అక్కడి నుంచీ మూడురోజులపాటూ ఎన్నో తెలుగు తావుల్లో తిరిగాం. ఎందరితోనో మాట్లాడాం. విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం, బరంపురం ప్రాంతాల నుంచీ ఎప్పుడో వలస వచ్చిన కుటుంబాలు పెద్ద సంఖ్యలో ఢాకా నగర శివార్లలో ఉన్నాయి. పేద దళిత కుటుంబాలే ఎక్కువ. మున్సిపల్ కార్పొరేషన్‌లో చిన్న ఉద్యోగులు వీళ్ళంతా. మంచి చదువులు లేవు. మెరుగైన బతుకులూ కావు. వారీ, కళ్యాణ్‌పురి, గన్తోలి, గోపీబాగ్ రైల్వే కాలనీ, అవుట్‌ఫోల్...ఇంకా కొన్నిచోట్ల తెలుగువాళ్ళున్నారు. ఇరుకిరుకు గూడుల్లో బతుకుతున్నారు. రాజ్‌షాహి, చిట్టగాంగ్, సిలేట్ డివిజన్‌లలోనూ తెలుగువాళ్ళ సంఖ్య గణనీయంగానే ఉందని ఢాకాలోని తెలుగు ప్రజలు చెప్పారు. వీటిలో సిలేట్ ప్రాంతానికి మాత్రమే మేం వెళ్ళగలిగాం. శ్రీమంగల్ సమీపంలోని నర్సన్నటీలాకి వెళ్ళాం. ఈ చుట్టుపక్కల 18 తెలుగు పల్లెలు ఉన్నాయి. అమీన్‌బాగ్, లోఅయినీ, ధొలాయి, పత్రకొల, శోనారూపా, ఛమాయి, శాంసన్‌నగర్, కాలిటీ, రాంగీబోలా, గాజీపూర్, ఛత్లాపూర్, దెబోల్‌చోలా, మధియురా, ఇటా, కరీంపూర్... అన్నీ తెలుగుజనం మాత్రమే ఉండే పల్లెలు. టీ తోటల్లో, రబ్బరు తోటల్లో పనులు చేసుకునే వాళ్ళుండే పల్లెలు. వరి పొలాల్లోనూ అక్కడక్కడా తెలుగువాళ్ళు కనిపించారు. ఢాకాలోని తెలుగువాళ్ళ కన్నా ఇంకా ముందు కాలం నుంచే ఈ ప్రాంతంలో తెలుగువాళ్ళు ఉన్నారు. వీళ్ళ వేషభాషల మీద బెంగాలీ ప్రభావం కొంత కనిపిస్తుంది. అయినా భజనలు, కోలాటాలు ఆడుకుంటూ నలుగు, పెళ్ళి పాటలు పాడుకుంటూ తెలుగుదనాన్ని కాపాడుకుంటున్నారు. ఢాకాలో మాల మాదిగ కులాల వాళ్ళే ఎక్కువగా కనిపిస్తే, సిలేట్ ప్రాంతంలోమాదిగ, మాలతో పాటు తెలగ, సాలె, గొల్ల, కుర్మి, నాయుడు, వాల్మీకి రెడ్డి, దూదేకుల, రెల్లి కులాలున్నాయి. బంగ్లాదేశ్ లోని ఎనిమిది డివిజన్‌లలో నాలుగింటిలో తెలుగు ప్రజలు ఉన్నారని అక్కడి వాళ్ళు చెప్పారు. అయితే ఒక ప్రాంతపు తెలుగు ప్రజలకు ఇంకో ప్రాంతపు తెలుగువాళ్ళతో పెద్దగా సంబంధాలు లేవు. అలాగే ఢాకాలోని తెలుగువాళ్ళకి ఆంధ్ర ప్రాంతంలో ఉన్నంత సంబంధాలు బంగ్లాదేశ్ ఇతర ప్రాంతాల్లోని తెలుగువాళ్ళకి లేవు. ఢాకా తెలుగువాళ్ళు శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ ప్రాంతాల్లో ఆడపిల్లల్ని ఇస్తున్నారు, తీసుకుంటున్నారు.



సిటీ కాలనీ



తెలుగు నేర్పుతున్న పాఠశాల

సిలేట్‌లో మాత్రం అక్కడికక్కడే ఇచ్చిపుచ్చుకోవడాలు కనిపిస్తున్నాయి. తరాలు గడిచి పోతున్నాయి. కాలం మారిపోతోంది. కట్టూ బొట్టూ, తిండీ అన్నింటిలోనూ మార్పు సహజం. బంగ్లాదేశ్ తెలుగువాళ్ళలోనూ బెంగాలీ ప్రభావం ఎంతో కొంత కనిపిస్తుంది. అయితే ఒత్తిడి లేదు. **బంగ్లా ప్రజలూ, ప్రభుత్వమూ కూడా తెలుగు సమాజంతో స్నేహ సంబంధాలు కొనసాగిస్తున్నాయి. బహుశా అందువల్లే అక్కడ తెలుగు భాషకీ, సంస్కృతికీ ముప్పు ముంచుకురాలేదు, కాలంతో పాటూ వచ్చిన మార్పులు తప్ప.** బంగ్లాదేశ్‌లో తెలుగు అంతరించిపోకుండా కాపాడుతున్నవి జానపద కళలు, పాటలు. మన దగ్గర మాయమైపోయిన హార్మోనియం పెట్టెలు అక్కడి తెలుగు పల్లెల్లో కనిపిస్తున్నాయి. సాయంత్రాలు ఊరి రచ్చ బండల దగ్గర యువత ఇప్పటికీ కోలా టాలు, భజనలు నేర్చుకుంటున్నారు. శ్రీకాకు ళంలో అంతరించిపోయిన గెంతుభజనను సిలేట్ పల్లెల్లో కుర్రాళ్ళు ఉత్సాహంగా ఆడు తున్నారు. నేర్పించే గురువులున్నారు. **తెలుగు అక్షరం తెలిస్తే మరింతగా కాపాడుకోవచ్చుని వీళ్ళంతా ఆశ పడుతున్నారు. తెలుగు బడులు లేవు. అడిగితే బంగ్లాదేశ్ ప్రభుత్వం కాదనదు కానీ, నేర్పించే గురువులు కావాలి. నేర్చు కోవడానికి పుస్తకాలు కావాలి. ఈ రెండు సాయాలూ తెలుగు రాష్ట్రాలు చేయగలిగితే బంగ్లా తెలుగు ప్రజలకు మాట్లాడటమే కాదు, రాయడమూ చదవడమూ కూడా వస్తాయి. అక్కడి జీవితాన్ని అక్షరబద్ధం చేసే అవకాశం వస్తుంది. బంగ్లా తెలుగు బతుకులు మరింతగా మనకు దగ్గరవుతాయి.**

రచయిత ఫోన్ : 9985425888



# బంగ్లాదేశ్‌లోని మీవాళ్లం... మీ తోటి తెలుగువాళ్ళం...

–పెరుగు మిఖా
జహంగీర్ నగర్ విశ్వవిద్యాలయం,
బంగ్లాదేశ్ తెలుగు వేదిక కన్వీనర్

**ఈ** నా నాలుగు మాటలు చదివే ముందు ఒక చిన్నమాట. నేను ఉబికి వస్తున్న నా కన్నీళ్ళని ఆపుకోవడానికి నానా తంటాలు పడుతున్నాను. దేశంలోని (మీ ఇండియాని మేము అలాగే పిలుచుకుంటాము దేశం అని, ఇష్టంగా) నా తోబుట్టువులు బహుశా మొదటి సారిగా మా తూర్పువంగదేశం లోని ఒక తెలుగువాడి నాలుగు మాటలు చదవబోతున్నారని తెలిసి వస్తున్నాయి. ఆ కన్నీళ్ళు –కాస్త ఆనందంతోనూ, కాస్త ఆలస్యమైనదేమోనని బాధతోనూ.

మీలాగే మేము కూడా ఏదో అలా బాగున్నాము. మేము కూడా అదే కష్టసుఖాలు, అదే పర్యావరణ సమస్యలు, అలాంటి పరిస్థితుల ప్రభావాలు, భావజాలాల భేదాభిప్రాయాలతో బండి సాగిస్తున్నాము. ఒక విషయంలో కాస్త ఎక్కువగా సుఖం కంటే కష్టం పాలు ఉంది. పలుకు విషయంలో– మరి మా పలుకు ఇక్కడ చెల్లదుగా! మా అమ్మ పలుకు!

ఇంకా ఆలస్యం చేయకుండా ఇక్కడ మన వాళ్ళ గురించి చెప్పేస్తాను.

అందరికీ తెలిసిన చరిత్ర – బ్రిటీషు ఇండియాలోని భాగమైన బర్మాలో వడ్లు, కలప వర్తకాలకి దక్షిణ భారతీయులు రాకపోకలు సాగిస్తున్నప్పుడు, ఒక గుంపు తెలుగువాళ్ళు నూటయాభై ఏళ్లకిందట జనుము తోటలున్న బంగ్లాదేశ్‌ను కూడా తమ మజిలీగా చేసుకుని వలస వచ్చారని, బర్మాకి చేరడానికి ప్రస్తుత బంగ్లాదేశ్‌లోని చిట్టగాంగు ఒక ముఖ్యమైన నౌకారేవు. అందుకని సహజంగా ఈ దేశంలో కూడా కొంతమంది తెలుగోళ్ళు బతుకుతెరువుకు అనువైన దేశమని కుదురుకొన్నారు. అది ఢాకా, చిట్టగాంగ్, రాజషాహి అనే ఒండ్రుమట్టి, జనప నారు ఉన్న ప్రాంతాల్లో.

తెలుసుకోవాల్సిన నిక్కం ఏమిటంటే– ఒక పెద్ద తెలుగు గుంపు అప్పటికే ఇక్కడ ఉందని.

ఈ గుంపు కాలక్రమేణా చెల్లాచెదురై ప్రస్తుతం సిల్హెట్ అని పిలువబడే కొండ ప్రాంతంలో మాత్రమే ఉన్నారు అని. నేను అక్కడి వాడినే. మరి నేను పరిశోధనా విద్యార్థిని కదా, అందుకే ఈ నా నిక్కట్టు. నిజానిజాలు బేరీజు చేసేముందు నా నాలుగు మాటలు వినేసేయండి. అందుకోసం ముందుగా మిమ్మల్ని కొంచెం కాలగతిలో వెనక్కి తీసుకొని వెళ్ళనీయండి.

ఐదువేల ఏళ్ళ కింద ప్రస్తుత ఆస్ట్రేలియా, పసిఫిక్‌ప్రాంతంలో అస్టరాయిడ్ జాతి ఉన్న సమయంలోనే, ఉపఖండ (subcontinent) ఉత్తరాన, అంటే ప్రస్తుత ఆఫ్ఘనిస్తాన్ ప్రాంతానికి మూలజాతి అయిన ద్రావిడ జాతివారు రెండుపాయలుగా వలసవెళ్ళారని, ఒక పాయ ద్వీపకల్పమయిన దక్షిణభారతం వైపు ఎక్కువమందితోనూ, ఇంకొక చిన్న పాయ తూర్పు గంగా మైదానమైన ప్రస్తుత బెంగాల్ వైపు కొద్దిమందితోనూ ప్రయాణం సాగిందని మానవశాస్త్రం చెప్తుంది.

మరి ద్వీపకల్పానికొచ్చిన ఆది ద్రవిడులు తెలుగోళ్ళుగా, గోండులుగా, కొడవలుగా, తుళులుగా, కొలామిలుగా, కురుక్కులుగా, కోయలుగా, గడబలుగా, తర్వాత కన్నడిగులుగా ఇంకాస్త ఆలస్యంగా తమిళులుగా, మలయాళీలుగా ఇంకొన్ని ఉపజాతులుగా ఇంకా ఇంకా సాగుతున్నప్పుడు తూర్పొచ్చిన గంగాద్రావిడులు ఏమైనట్లు? అదే మా విత్తనం అయిఉండవచ్చునని మా వాదన. ఈ ద్రావిడ జాతి పునరావాసం ప్రస్తుతం ఉన్న బంగ్లాదేశంలో మాత్రమే కాదు, మీ దేశ ఈశాన్య ప్రాంతాలైన అస్సాంలో, ఇంకా బర్మాలోనూ, హిమాలయాల అడుగు వరసన కూడా వీరు కుదురుకొని ఉన్నారని, అదే తమ నెలవై, విభిన్న జాతులతో కలసి జీవించడం అలవాటు చేసుకున్నారని, ఆ ద్రావిడం




'వారి' తెలుగు అసోసియేషన్ వద్ద తెలుగువాణి కార్యకర్తలు



అసోసియేషన్ కార్యాలయం లోపల...


'వారి' తెలుగు చర్చి


తేయాకు తోటలో తెలుగు మహిళ

నుండే మా తెలుగుజాతి వచ్చిందనీ, మనకెవ్వరికీ ఇంతవరకూ పరిగణనలోకి రాని విషయం.

**అక్కడి కడలి అవతల శ్రీలంకలోని ముఖ్యమైన మూలవాసుల్లో ఒకటి మన తెలుగు జాతి అని ఒప్పుకున్నట్లే, ఇక్కడి గంగామైదానంలో కూడా మూలజాతిగా మేము ఉన్నామని ఇప్పుడైనా నిర్ధారించాల్సిన అవసరం ఉంది.**

ఆ ఇక్కడి వాళ్ళు కాలక్రమేణా రవాణా విప్లవంతోపాటు, ఆధునిక యుగంలో మైదానం వదిలి, అన్ని చుట్టుపక్కల ప్రాంతాలకు అల్లు కున్నారు. ఆ తర్వాత 1947లో గీసిన గీతవల్ల మాలో మేము కూడా విడిపోవలసి వచ్చింది. గీతకవతల ప్రస్తుత మీ దేశంలోని పర్వత పీఠభూములయిన కూచ్ బిహార్, గౌర్, అస్సాం ప్రాంతాలలో ఇప్పటికీ మా వాళ్ళున్నారు. (ఇప్పటికీ ఇక్కడ మా వాళ్లు అప్పుడప్పుడు కంచె కింద నుంచి వెళ్ళి మన వాళ్ళని పలకరించి వస్తుంటారు కూడా. మరి అంత ఇబ్బంది అయింది ఈ ఇండియా వీసా పొందడం) ఈ నా మూలజాతి ప్రతిపాదన అంతా ప్రస్తుతం విడ్డూరంగానూ, అతి శయోక్తి గానూ, నమ్మశక్యంగా లేకనూ ఉండవచ్చు. ఇప్పుడే గదా మనమధ్య కొత్త వంతెన ఏర్పడింది! ఇకమీదట మాటామంతీ కలిపి అన్నీ చర్చించుకుందాం.

మా నైతిక ఉనికి చెప్పేముందు మొదటగా మా భౌతిక ఉనికి చెప్పనీయండి. మేము ఉంటున్నది గంగ (మా మాటలో పద్మానది) బ్రహ్మపుత్ర (మేఘన) నదులు కలిసే మాగాణానికి ఈశాన్యంగా సిల్హెట్ (సిలహట్ట, శ్రీహట్ట అని కూడా అంటారు. హట్ట అంటే సంత అని) అనే రాష్ట్రంలో ఉన్నాము. మేము ఇప్పుడు ఉంటున్నది ఎక్కువగా తేయాకు పెరగటానికి అనువైన కొండ ప్రాంతాలలో. మా రాష్ట్రం రెండు పెద్ద నదుల పరీవాహక ప్రాంతంలో ఉండటం వల్ల కాల చక్రంలో బాగానే రాకపోకలు సాగాయి. ఆర్యులు, అహోంలు, అర బ్బులు, పార్సీలు, చీనీలు, తుర్కులు, ఇటీవల ఆంగ్లేయుల దాకా అందరూ మమ్ముల్ని పలకరించినవారే.

ఇప్పుడు మాలో మేము ఇక్కడి ఈశాన్య యాసలో బంగ్లా భాషలో మాట్లాడుకొంటాము. ఇక్కడి బయటి బతుకుభాష అదే కదా మరి. అయినా, మా అమ్మ పలుకైన తెలుగుని మేము పూర్తిగా మర్చిపోలేదు. కానీ మా తెలుగుయాస మాత్రం దేశంలోని ఆంధ్ర తెలంగాణ (ఈమధ్య రాజకీయ మార్పులు మాకు తెలుసు. ఎంతయినా అన్నదమ్ములం, అక్కాచెల్లెళ్ళం కదా. చరిత్రలో మీ రకరకాల పోరాటాలలో కూడా కొద్దో గొప్పో వేన్నీళ్ళకు చన్నీళ్ళుగా ఉన్నోళ్ళం కదా. అందుకే మీ విషయాలు, బాగోగులు తెలుసుకోవాలని ఉబలాట..అంతే), రాయల సీమ, తమిళ, కర్ణాటక, మరాట, మాకు దగ్గరగా ఉన్న ఒడిసా నుండి, దవ్వున ఉన్న లంక వరకు అన్ని తెలుగు ప్రాంతాలలో ఉన్న 18 కోట్ల (మా మెట్రిక్ సిస్టంలో 180 మిలియన్లు అంటామండి) తెలుగుజాతి మాట్లాడే అన్ని తెలుగు యాసలతో ఏ కొంచెం పోలికా లేనిది మా యాస- మా సిలట్టి తెలుగు యాస, కొద్ది పదాలు, ఇంకొంచెం మాండలికాలు కలవవచ్చునేమో కానీ మా పలుకు తీరే వేరు. (మాండలికము అంటే వేరు, యాస అంటే వేరు అనే విషయం మీకు వేరుగా చెప్పనవసరం లేదు) ఇదే నా వాదనకి మొదటి బలం.

మేము తెలుగు చదవటం రాయటం చెయ్యలేము కానీ, ప్రసార మాధ్యమాల్లో వచ్చే తెలుగు వింటుంటాం, చూస్తుంటాం. అందుకే మన తెలుగువారి ఉనికిని ఎప్పటికప్పుడు తెలుసుకుంటుంటాం. మేము ఈ ప్రాంతంలో సంఖ్యలో తక్కువే కానీ ఇక్కడే ఉన్న మైదానపు ప్రాంతా లైన ఢాకా, రాజషాహి అనే రాష్ట్రాలలో మనవారు ఇంకా ఎక్కువ వున్నారు. మొదట చెప్పినట్టు కొద్ది వందల ఏళ్ళ కింద పడవలో, రైలులో వచ్చినోళ్ళు వాళ్ళు.

అక్కడ మైదానాల్లో ఉన్న తెలుగు వారికీ, కొండకోనల్లో ఉన్న మాకూ మాటా-తీరూ సంస్కృతీ-సాగూ, పాడీ-పంట, తిండీ -తిప్పా, ఏదీ కలవదు. ఇప్పుడిప్పుడే సంబంధాలు మాత్రం కలుపుకుంటు న్నాము. వారికి మాత్రం ఎప్పటినుండో ఉత్తరాంధ్ర వారితో ఇచ్చిపుచ్చు కోవటాలు, పొలాలూ సొమ్ములూ, లావాదేవీలు, రాకపోకలు సాగు తున్నాయి. మాకైతే అన్నీ ఇక్కడే. ఈ పరిస్థితి కూడా మా మూలవాసు లన్న వాదనకి మరింత బలాన్నిస్తుంది. ఇక్కడి అధికులైన మా వంగ బంధువులు మాత్రం మమ్ముల్ని ఆదివాసులని పిలుస్తుంటారు. నేర్పులేని వారు అన్న అర్థంతో.

1912లో వంగ విభజన తర్వాత భారతదేశంలో అతిపెద్ద గుంపు మాట్లాడే భాషగా తెలుగుభాష మొదటి స్థానానికి ఎక్కిందని మాకు తెలుసు. కానీ అది మూల విసిరివేయబడ్డ మాలాంటి వారికి అందలమే అయ్యింది. ఎందుకంటే మొన్నటివరకు ఊరంతా ఉన్న మన తెలుగు మాట నిన్నటికి ఇంట్లో వరకే పరిమితమయ్యింది. నేడయితే కొద్దిమంది ఒంట్లోకే. అది కూడా కుదిరిన వారు మాత్రమే ప్రసారమాధ్యమాల్లో తెలుగు వింటుంటారు కాబట్టి మాట్లాడగలరు. అలాగంటే మంచివో చెడ్డవో మీరు వివిధ తెలుగు ఛానళ్ళలో ప్రసారం చేస్తున్న కార్యక్రమాలు



లుంగ్లా గ్రామంలో అవ్వ

మాకు మంచినే చేస్తున్నాయి. ఒకే ఒక ధోరణిలో, ఒకే ఒక మాండలికంలో, ఒకే ఒక యాసలో ఉండే ఆ తెలుగు కార్యక్రమాలు పూర్తిగా అర్థం కాకపోయినా– మన పలుకులే అని వింటూ ఉంటాము. రేపు ఆ కొద్దిమంది కూడా మర్చిపోకుండా ఉండాలంటే మేము తెలుగు రాత నేర్వాలి. రాయడం చదవడం నేర్పే వాళ్ళుంటే దానికోసం చెవులతోపాటు మా కళ్ళనీ మనసునీ కూడా అప్పగిస్తాం. మా రాతని దిద్దుకుంటాం.

**మేము ప్రతి ఏడూ ఆగస్టు 9ని తెలుగుభాషా దినోత్సవంగా జరుపుకుంటాము. కానీ చెప్పాలంటే ఐక్యరాజ్యసమితి వారు దానిని మూలజాతివాసుల రోజు (వరల్డ్ ఇండీజీనస్ పీపుల్స్ డే)గా జరుపుకోమన్నది. దాన్ని మేము మాత్రం మా తెలుగుభాష పండుగగా చేసుకుంటాం. ఎందుకంటే ముందే చెప్పినట్లు ఆదివాసులని పిలవబడే మాకు ఇక్కడ తోటల్లో చేతినిండా పని ఉంది. కానీ సెంటు భూమీ, నేల హక్కులూ ఏమీ లేవు. మా ఆస్తి, అస్తిత్వం అంతా మా ఉనికే, మా పలుకే, మా తెలుగే. అదే మమ్ముల్ని కలిపి ఉంచుతుంది కూడా. అందుకే ఆరోజు పండుగ.**

**ఆ మాటకొస్తే అదే ఐక్యరాజ్యసమితి వారు ఇచ్చిన పిలుపు ఫిబ్రవరి 21న మాతృభాషాదినోత్సవము జరుపుకొమ్మని. అది ఎందుకో మీకు తెలుసుంటుంది. అది మా దేశవాసులయిన సలాం, బర్కత్, రఫిక్, జబ్బార్, అనే నలుగురు యువకులు పరభాషా పెత్తనాన్ని ఎదిరించి 61 ఏళ్ళ క్రింద మాతృభాష కోసం చేసిన ప్రాణత్యాగానికి గుర్తుగా ప్రపంచం మాకు ఇస్తున్న మెప్పు. ఇప్పుడు అవసరమైతే మా తల్లి నుడి తెలుగు మెప్పునకు నలుగురమే కాదు, ఈ మా దేశంలో ఉన్న నాలుగు లక్షలమంది తెలుగోళ్ళం కూడా ఏ త్యాగానికైనా సిద్ధమే.**

అనువాదం :

**అడపాల సుబ్బారెడ్డి,** 93468 14601

(తెలుగు భాషోద్యమ సమాఖ్య కార్యకర్త)

కవిత

## మథన విధానాన్ని బట్టి...

**ప**గటి నిద్రమరిగిన నేత్రాలకు
రాత్రి నిద్ర రుచించదు.
ఎడారి పయనాలకు అలవాటుపడిన
పాదాలకు
ఘంటా పథాల గమనం
సరిపడదు.
ఆంతరంగిక ప్రవృత్తులను బట్టి
జీవితం
రేఖామాత్రా చిత్రంగానో
సమగ్ర వర్ణ చిత్రంగానో
రూపు దిద్దుకుంటుంది.
చిక్కని చీకట్లో
మిణుకు మిణుకుమనే మిణుగురు పురుగుల
నడకలతో
తమ చూపులను ముడి వేసుకుంటారు కొందరు.
పగటి వెలుగులతో
తారల దరహాసాలు శ్రుతి కలుపుకున్నట్టు
తన్మయిస్తారు మరికొందరు.
ఎవరి మనోగతులు
ఎప్పుడు ఎట్లా వర్షిస్తుంటాయో
తూచి చూపటం అంత సులభం కాదు.
ఈ క్షణం ఎదుటి కొమ్మమీద
మెడ తిప్పుతూ కూచున్న పక్షి
మరో క్షణంలో
అక్కడెక్కడో వున్న చెట్టు జుట్టులో
ఒదిగొదిగి కూచుని
కుహూ కుహూ స్వరాలతో
తోటి పక్షులను ఆహ్వానించటం
సహజీవన మనస్తత్వానికి దిక్సూచిక.
ఎంతసేపు చూస్తున్నా
చూసే చూపుల అభిరుచిని బట్టి
అంబరం
నిరంతర దర్శనీయంగానే వుంటుంది.
ఎంతగా మథిస్తున్నా
మథన విధానాన్ని బట్టి
అంతరంగం
అభినవ్య ఫలితాలను అందిస్తూనే వుంటుంది.

**–డా॥సి.నారాయణరెడ్డి**

ఫోన్ : 040–23548451

-డా॥మధురాంతకం నరేంద్ర

# కాలంతోబాటు ప్రయాణం చేస్తున్న తెలుగు కథ

**తె**లుగు సాహిత్యంలో యిప్పుడు జరుగుతున్నది కథానికా యుగం అనడంలో అతిశయోక్తి లేదు. సమకాలీన సమాజానికి సరిపోయిన మాధ్యమంగా కథానిక అన్ని రకాలుగానూ తనను తాను రూపుదిద్దుకుంటూ వుంది. 1900వ సంవత్సరపు ప్రాంతంలో పుట్టిందని భావిస్తున్న తెలుగు కథానికలను వరసగా చదివితే గత వందేళ్ళుగా సమాజంలో వచ్చిన మార్పుల అన్ని పార్శ్వాలూ స్పష్టంగా అవగతమవుతాయి. అలా కథానిక గొప్ప కళాస్వరూపంగా మాత్రమే కాకుండా చరిత్రకు ప్రత్యామ్నాయంగా కూడా రూపొందింది. పాఠకుడికి తనను తాను అర్థం చేసుకోవడానికి అవసరమైన వాహికగానూ, తానున్న ప్రపంచాన్ని తరచి చూడడానికి అవసరమైన వేదికగానూ, తనకూ, తన ప్రపంచాన్ని శుభ్రం చేసుకోవడానికి దోహదపడే భూమికగానూ తెలుగు కథానిక తయారయ్యింది. సాహిత్యానికి అంతకంటే మించిన పరమావధేముంటుంది?

ఇంత గొప్పపాత్రను పోషిస్తున్న తెలుగు కథానికను కాలపరిధిలో సంపుటాలుగా వెలువరించవలసిన అవసరమెంతో వుంది. నేషనల్ బుక్‌ట్రస్టు వాళ్ళు ప్రముఖ కథా రచయితలు వాకాటి పాండురంగారావు, పురాణం సుబ్రహ్మణ్యశర్మల సంపాదకత్వంలో ప్రచురించిన 'తెలుగు కథ' బహుశా తొలిముఖ్యమైన సంకలనం కావచ్చు. ఇటువంటి సంకలనాల అవసరాన్ని గుర్తించి, 1975 ప్రాంతాల్లో అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ దశాబ్దాల ప్రాతిపదికపైన కొన్ని కథా సంకలనాలను ప్రచురించాలని సంకల్పించింది. వాటి సంపాదకత్వ బాధ్యతను మా నాన్నగారు వహించటం, రెండు సంకలనాలను వెలువరించడం నా చిన్ననాటి జ్ఞాపకాల్లో యింకా స్పష్టంగా గుర్తుంది.

ఆ రోజుల్లో కథల్ని సేకరించడానికి యిప్పటిలా 'కథానిలయం' లేదు. తిరుపతి శ్రీ వెంకటేశ్వరా విశ్వవిద్యాలయంలోని ప్రాచ్య పరిశోధనా సంస్థ, విశ్వవిద్యాలయ గ్రంథాలయం మాత్రమే అందుబాటులో వుండేవి. అప్పటి గ్రంథాలయంలోని ఉద్యోగి వి.షణ్ముగం గారు ఆ రెండు గ్రంథాలయాల నుంచీ భారతి, ఆంధ్రపత్రిక పాత సంచికలు తీసుకొచ్చి మా నాన్నగారి ముందుంచేవారు. అక్కడే కూర్చుని చదువుకోవలసిందే. అప్పుడు మా నాన్నగారు తిరుపతికి 12 కిలోమీటర్ల దూరంలో వుండే కీటాల అనే గ్రామంలో ఉద్యోగం చేసేవారు. రైల్లో తిరుపతికెళ్ళి, గ్రంథాలయంలో కూర్చుని పని చేసుకోవలసిందే. కథలు సేకరించిన తరువాత, వాటి జిరాక్సు ప్రతులు తయారు చేయడం మరింత పెద్ద పని. అప్పట్లో జిరాక్సు యంత్రం పెద్ద గదినంతా ఆక్రమించేది. ఖాదర్బాషా అనే మరో విశ్వవిద్యాలయ ఉద్యోగి జిరాక్సులు తయారు చేసే అదనపు పనిని ప్రేమగా చేసి పెట్టేవారు. ఒక పేజీని జిరాక్సు చేయాలంటే, దీర్ఘ చతురస్రాకారంలో వుండే పెట్టె లాంటి సాధనంపై నుండే యినప రేకుపైన రసాయనం పూయాలి, దాన్ని యంత్రంలోకి జొనపాలి. పొడవాటి విస్టనుపట్టి బలంగా లాగాలి. మీటను నొక్కి మూలగ్రంథంలోని పేజీలోని అక్షరాలు జిరాక్సు కాగితంపైన ముద్ర పడే వరకూ ఆగాలి. రసాయనపు పొడితో తయారయ్యే ఆనాటి జిరాక్సు ప్రతుల ఆయుర్దాయం కూడా అంతంత మాత్రమే. అయితే యింత కష్టాన్నీ మా నాన్నగారు శ్రమగా భావించకపోవడంలో పెద్ద ఆశ్చర్యమేమీ లేదు. ఆయనీ పనిని పెద్ద ఆటవిడుపుగానూ, తనముందున్న కథానికా స్రష్టలకు తాను చేస్తున్న పూజగానూ భావించారు. షణ్ముగంగారూ, ఖాదర్బాషా గారు గూడా అంతే ప్రేమతో ఆ పనులు చేయడమే గొప్ప విషయం. అలా 'తొలినాటి తెలుగు కథలు', 'ఒక దశాబ్ది తెలుగు కథలు' అనే రెండు సంకలనాలు వెలువడ్డాయి. వరసగా అలాంటి సంకలనాలు వెలువరించాలనే సంకల్పం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి వుండేది. యింతలో అదే మూతబడటంతో ఆ పని ఆగిపోయింది.

తరువాతి కాలంలో కేంద్ర సాహిత్య అకాడమీ కూడా 'తెలుగు కథ', 'ఒకతరం తెలుగు కథ' అనే రెండు సంకలనాలను డి.రామలింగం గారి సంపాదకత్వంలో ప్రచురించింది. అలాగే వేదగిరి రాంబాబు గారి సంపాదకత్వంలో 'బంగారు తెలుగు కథ' అనే 60 కథల సంకలనం కూడా తీసుకొచ్చింది. తానా, రంజని, హైదరాబాదు బుక్ ట్రస్టు వంటి వాళ్ళు అప్పటివరకూ వచ్చిన గొప్ప కథలను సంకలనం చేశారు.

అయితే 1990లో కథాసాహితి అనే సంస్థ పేరుతో వాసిరెడ్డి నవీన్ గారూ, పాపినేని శివశంకర్ గారూ 'కథ' అనే వార్షిక సంకలనాన్ని ప్రచురించడమన్నది తెలుగు కథానికా సాహిత్యంలో జరిగిన గొప్ప సంఘటన. ఎక్కడో తమిళ కథానికను గురించి మాట్లాడుతూ ప్రముఖ తమిళ కథా రచయిత జయకాంతన్ తమిళ సాహిత్యాన్ని 'కురుక్షేత్రం'కు ముందు తర్వాత అని విభజించవచ్చునంటారు. 'కురుక్షేత్రం' అన్నది వొక తమిళ పత్రిక ప్రత్యేక సంచిక. అదే రీతిలో తెలుగు కథానికను 'కథ'కు ముందు, ఆ తర్వాత అని విభజించడం ఒక చారిత్రక సత్యం.

1990 ప్రాంతం, అన్ని కాలాలలాగే గొప్ప సంక్లిష్టమైన, మార్పులకు లోనవుతున్నకాలం. ఆ తరువాత కొద్దికాలానికే రష్యాలో కమ్యూనిస్టు ప్రభుత్వం కూలిపోయింది. ప్రపంచీకరణ ప్రపంచబ్యాంకు పేరుతో ముంచుకొస్తోంది. చరిత్ర కొన్ని అనివార్యమైన విపత్తులను కలుపుకుంటూ ప్రవాహంగా కదులుతూనే వుంటుంది. అయితే సాహిత్యం గొప్పమానవీయ విలువలకు కట్టుబడి పోరాటం చేస్తూనే వుండాలి. ఆ పనిని కథా సంకలనాలు గొప్ప చిత్తశుద్ధితో చేస్తూ వస్తున్నాయి. ప్రపంచీకరణ పేరుతో సామ్యవాదపు, కమ్యూనిజపు మానవీయ విలువలకు జరుగుతున్న హానిని అడ్డుకోడానికి వీరోచితమైన పోరాటం చేస్తూ వస్తోంది.

1990 ప్రాంతాల్లో తెలుగులో ముఖ్యమైన సాహితీ పత్రికలన్నీ

మూతపడ్డాయి. భారతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ చరిత్రగా మారి పోయాయి. మాసపత్రికలసలు అవసరం లేని పరిస్థితి యేర్పడింది. ముంచుకొచ్చిన టీవీ మాధ్యమం పాఠకుల్ని ముంచెత్తేసింది. పాఠకుల సంఖ్య తగ్గిపోయింది. టీవీ సీరియల్ల కోసం వెళ్ళిన పాఠకులు ఆనాటి కాలక్షేపం సీరియల్ నవలల పాఠకులే కావడమొక్కటే మంచి పరి ణామం. అయితే కాలక్షేప రచనల చాటున నిరాటంకంగా ప్రచురించ బడుతూ వస్తున్న గొప్ప సాహిత్యానికి కూడా చోటు లేకుండా పోయింది. రచయితలు కేవలం దినపత్రికల ఆదివారం అనుబంధాలను ఆశ్ర యించవలసి వచ్చింది. అయితే చాలా దినపత్రికలు కేవలం వార్తల కొనసాగింపుగా సాగే సరళ కథనాలనే కథానికలుగా ప్రచురిస్తున్నాయి. అన్నింటికీ మించి యీ పరిస్థితి కథానికల నిడివిపైన కూడా పెత్తనం కొనసాగించింది. 90 ప్రాంతాల్లో పత్రికలు రచయితలను కథలు పంపమని కోరేవి. కథలు ప్రచురించిన ఆ సంచికలను రచయితలకు పంపేవి. దానికి వాళ్ళిచ్చే పారితోషికమేదో అది తప్పకుండా అందేది. యీ మంచి లక్షణాలేవీ యిప్పుడు లేవు. అయితే యిటువంటి కఠినమైన కాలంలో కూడా దాదాపు వందమంది కథకులు కథానికను సాహిత్య సాధనగా, గొప్ప సామాజిక బాధ్యతగా నెరవేర్చడం తెలుగువాళ్ళు తమను తాము మెచ్చుకోవలసినంత గొప్ప విషయం. ఈ సమయంలో యీ కథకులందరికీ ప్రోత్సాహాన్నిచ్చినదీ, గొప్ప నాయకత్వాన్ని నిర్వహించినదీ 'కథ' సంకలనాలే. ఈ పదిహేను సంవత్సరాల్లో 'కథ' సంకలనాల్లో వచ్చిన కథల్లో దాదాపు సగం కథలు ఆంధ్రజ్యోతి ఆదివారం దినపత్రిక అనుబంధాల్లో వచ్చాయి. అందుకు ఆంధ్రజ్యోతిని అభినందించాలి. ఒకసారి 'కథ' సంకలనాల్లో తమ కథ వచ్చిన తర్వాత ఆ రచయితలు వ్యాపార రచనలవైపుకు మర్ల లేదు. అది కూడా కథ సాధించిన గొప్ప విజయాల్లో వొకటి.

1990లలో మెల్లగా ప్రారంభించి, క్రమంగా పెద్ద విప్లవాలుగా పరిణమించిన స్త్రీ వాద, దళిత, మైనారిటీ ఉద్యమాలకంతా 'కథ' సంకలనాలు గొప్ప వూతనూ, ప్రోత్సాహాన్నీ యిచ్చాయి. ఈ ఉద్యమాలు పెరిగి క్రమంగా తీవ్రత తగ్గి, ఆలోచనలు పెరిగి, వో గొప్ప నిర్మాణతను సంతరించుకోవడం యీ కథలను చదివితే అర్థమవుతుంది. మాండలిక రచనలకు తగినంత ప్రాధాన్యత నిస్తూ యీ సంకలనాలు తెలుగు భాషాభివృద్ధికి కూడా తోడ్పాటు నిస్తున్నాయి. ప్రాంతీయ, కుల, మత, లింగ విబేధాలను వీలయినంత వరకూ పట్టించుకోకుండా మంచి కథలను మాత్రమే యెన్నిక చేయడానికీ సంపాదకులు ప్రయత్నిస్తూనే వున్నారు. అయితే యిటువంటి పనేదీ పరిపూర్ణమైనది గాదనీ, యే యెన్నికయినా సాపేక్షికమేనని యీ సంపాదకులకు తెలుసు. అందుకనే యేదయినా మంచి కథను పట్టుకోలేకపోయినప్పు డా విషయాన్ని స్పష్టంగా చెప్పడానికి వాళ్ళు వెనుకాడడం లేదు. కానీ యీ సంచికల భూమికపైన ఆయా సంవత్సరాలలో వచ్చిన యితర మంచి కథలను గురించీ, ఆ కాలంలో వచ్చిన అన్నిరకాల పరిణామాలను గురించీ ఆరోగ్యకరమైన చర్చలు జరగడం లేదు. అటువంటి చర్చల వలన మంచి సాహిత్య వాతావరణం నెలకొనడంతోపాటు, సమకాలీన సమా జాన్ని మరింత స్పష్టంగా అర్థం చేసుకోవడమూ సాధ్యమవుతుంది.

'కథ' సంకలనాల్లో వచ్చిన దాదాపు 356 కథలనన్నింటినీ వొక బృహత్ సంపుటంగా తీసుకురావాలనుకోవడం సాహసం. ఇటువంటి పని బహుశా ప్రపంచంలోనే మొదటిసారేమో. ఈ పనిని 'మనసు' ఫౌండేషన్ వంటి గొప్ప సంస్థ మాత్రమే చేయగలదు. ఇదివరకే రాచకొండ రచనాసాగరం,తిలక్ రచనల వంటి బృహత్ కథా సంపుటా లను ప్రచురించిన మనసు ఫౌండేషన్ మరిన్ని గొప్ప పనులు చేసే సత్తాను నిరూపించుకొంది. (రాయుడుగారికీ, వివినమూర్తి గారికీ అభినందనలు చెప్పి తీరాలి)

'కథ' కోవలో వర్ధమాన కథ, కథావాహిని, కథా స్రవంతి, తెలం గాణ కథ వంటి వార్షిక సంకలనాలు చాలా వచ్చాయి. అయితే అవేవీ నిరాటంకంగా, నిరంతరాయంగా సాగలేదు. 'మధురాంతకం రాజారాం సాహిత్య సంస్థ' ఆధ్వర్యంలో నేను కూడా 12 సంవత్సరాలపాటూ 'కథావార్షిక' సంకలనాలు తీసుకొచ్చాను. గత రెండేళ్ళుగా ఆ పనీ ఆగిపోయింది. అలా యెందుకు ఆగిపోయిందో చెప్పవలసిన బాధ్యత నాపైన వుంది. అదంతా పెద్ద కథ. ఇంకో సారెప్పుడైనా చెప్తాను.

–రచయిత ఫోన్ : 98662 43659

కవిత

## పిరికిచెట్టు!

గోరుముద్దలు తిననంటూ
మారాం చేసినపుడు
అమ్మ నాటిందో
లాల పోసుకోనంటూ
మొరాయించినపుడు
అమ్మమ్మ విత్తిందో
ఈ గింజ నాతోపాటే పెరిగింది
శుక్లపక్షమి చంద్రుడై చెట్టయింది
మనసు మెదడులో నాటుకొనిపోయి



రక్తాన్నంతా అల్లుకొని ప్రవహిస్తూ
చిమ్మచీకట్లో సైతం
నా నీడై వెన్నాడుతూనే వుంది
పాప బడికి వెళ్ళినా
బాబు బైట ఆడుకుంటున్నా
ఎక్కడ ఏ విస్ఫోటనం జరిగినా
ఎక్కడ ఏ రైలు పట్టాలు తప్పినా
పిరికిచెట్టు ప్రభంజనమై
అల్లకల్లోలం సృష్టిస్తూంది
ఇంటి నుండి ఆఫీసుదాకా
మార్కెట్టు నుండి యింటివరకూ
ప్రతిక్షణం నెత్తిమీద సూర్యుడిలా
నా వెంటే నడుస్తూంది
కూకటివేళ్ళ నుండి
ఈ చెట్టుని పెకలిస్తే గానీ
ఒక్క రాత్రయినా
కంటినిండా నిద్ర దక్కదు!

**–గుర్రాల రమణయ్య,**
99639 21943

-డా॥బొర్రా గోవర్ధన్

# మరుగునపడనిది ఈ మానవీయ నిధి...

**పదహారణాల దేశీయం**

అమరావతి శిల్పకళారీతి, పదహారణాల తెలుగు శిల్పకళా రీతి. గాంధార, మధుర శిల్పకళారీతుల్ని క్రమేపీ వదలించుకొని, ఒక అందమైన శిల్పకళారీతిగా పుట్టుకొచ్చిన 'అమరావతి శిల్పకళారీతి' బౌద్ధానికి, బుద్ధుని ప్రబోధాలకీ ఊపిరి పోసింది. బుద్ధుని జన్మ వృత్తాంతాల్ని, మరీ ముఖ్యంగా జాతక కథల్ని అందమైన శిల్పాలుగా మలచిన తీరు అద్వితీయం. బౌద్ధం పరిఢవిల్లిన ప్రపంచంలో ఏ దేశానికి పోయినా అక్కడ అమరావతి శిల్పకళ మనకు ఆహ్వానం పలకడానికి కారణం- ఆ శిల్పకళలోని నైపుణ్యమే.

ఆ నైపుణ్యం ఏమిటంటే-

శిల్పాల విగ్రహ సౌందర్యం మొదటి అంశం. కాళ్ళు, శరీరం, తల, ముఖం, ఆకృతులు సౌష్టవంగా ఉంటాయి. స్త్రీ పురుష శరీరాకృతులు వారి వారి శరీరాకృతులకు తగిన విధంగా ఉంటాయి. మెడ, నడుము, భుజాలు, వ్రేళ్ళు, వెంట్రుకలు అచ్చుగుద్దినట్లుగా ఉంటాయి. ముఖంలోని భావాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఇలా సజీవ రూపాలుగా అమరావతి శిల్పాలు దర్శన మిస్తాయి.

**మానవత్వాన్ని మలచి...**

ఇక్కడొక విషయాన్ని తెలుసుకుందాం.

"ఓ మహాశిల్పీ! ఈ రాతిని ఇంత అందమైన శిల్పంగా ఎలా మలిచావు?" అని ఒకరు అడిగారు. అప్పుడు ఆ శిల్పి...

"అయ్యా! నేను ఆ రాతిలో ఈ శిల్పానికి తగని భాగాలన్నింటినీ తొలగించాను. అంతే!" అన్నాడట. ఈ మాటలు అమరావతి శిల్పకళకి అద్దినట్లు సరిపోతాయి. కఠినమైన శిలలోని కాఠిన్యాన్ని తొలగించితే మన కనులకు కనిపించే కారుణ్యరూపమే అమరావతి శిల్పం. బౌద్ధం కరుణాసాగరం కాబట్టి ఆ కరుణను, ప్రేమ, వాత్సల్యాలను, దయ, శీల గుణాల్ని శిలులుగా మలిచారు అమరావతి శిల్పులు. ఇవే కాదు, ఉల్లాసం, భయం, విషాదం ఇలాంటి నవరసాల్ని రాళ్ళమీద ఒలికించారు.



మరీ ముఖ్యం..బుద్ధుని ముఖంలో తేజస్సును, దయను కళ్ళకు కట్టినట్టు శిల్పించారు.

రూపం, భావం, సృజనల్లో మేటి కాబట్టే అమరావతి శిల్పాలు ప్రపంచ వ్యాపితంగా పేరు పొందాయి.

అంటే..బౌద్ధం శిల్పకళకి ఎంతగా ఊపిరి పోసిందో అర్థమవుతోంది.

అందుకే శంకరంబాడి సుందరాచారి గారు "అమరావతి నగర అపురూపశిల్పాలు" అంటూ తెలుగుతల్లిని కీర్తిస్తూ అమరావతి శిల్పకళను శ్లాఘించారు.

అయితే ..ఆ తర్వాత బౌద్ధంతోపాటు తెలుగు శిల్పకళారీతులు కాలంతోపాటు కనుమరుగయ్యాయి.

అందుకే..'తెలుగువారి శిల్పకళా సృజన, శిల్పకళా నైపుణ్యం, బౌద్ధం క్షీణించడంతో అవీ క్షీణించిపోయాయి' అంటారు బి.యస్.ఎల్. హనుమంతరావు గారు.

**2 చైత్యాలు:**

మనం ఇప్పటిదాకా స్తూపాల గురించి చెప్పుకున్నాం. ఇప్పుడు చైత్యాల గురించి చాలా కొద్దిగా చూద్దాం. 'చితి' అనే పదం నుండి వచ్చిందీ చైత్యం. ఇవి కేవలం స్మృతి చిహ్నాలే కాకుండా ఆరాధనా మందిరాలు కూడా. వీటిని చైత్యాలయాలు, చైత్యగృహాలు అని కూడా అంటాము. బౌద్ధుల పూజామందిరాలివి. ఈ చైత్యాలు కూడా రెండు రకాలు. గుహల్లో తొలిచినవి, ఇటుకలతో కట్టినవి. ఇటుకలతో కట్టిన చైత్యాలు మన తెలుగు నేల మీద చాలా ఎక్కువగా ఉన్నాయి. అయితే వీటిలో పెద్దగా వాస్తు కళ ఉండదు. కానీ, గుహా చైత్యాల్లో మాత్రం అద్భుతమైన శిల్పకళ, చిత్రకళలు ఉన్నాయి. గుహాచైత్యాల్లో గుంటుపల్లి అతి గొప్ప గుహా చైత్యం. దీని గుహా ముఖం ఎంతో ఆకర్షణగా ఉంటుంది. గుంటుపల్లి గుహలు అజంతా, ఎల్లోరా గుహల కంటే ప్రాచీనమైనవి.

గుంటుపల్లి గుహల్ని చూసే ఆ తర్వాత అజంతా గుహలు తొలిచారు.

**3 విహారాలు:**

బౌద్ధ భిక్షువుల నివాసాల్ని విహారాలు అంటారు. అమరావతిలో, నాగార్జునసాగర్‌లోని శ్రీపర్వతాలలో అలనాటి మేటి బౌద్ధ విహారాలున్నాయి. ఈ విహారాలు విద్యా కేంద్రాలు. గుంటుపల్లి, శంకారంలో కూడా విహారాలున్నాయి. అంటే అవి కూడా విద్యా కేంద్రాలే అన్నమాట. నలంద, బుద్ధగయల్లో ఈ విహారాల స్వరూపాల్ని స్పష్టంగా చూడగలం.

మొత్తంమీద భారతీయ శిల్పకళ బౌద్ధులతోనే ప్రారంభమైంది. బౌద్ధంతోనే విశ్వ వ్యాపితం అయ్యింది. బౌద్ధంతోనే క్షీణించింది.

ఆ తర్వాత వచ్చిన బౌద్ధేతర శిల్పకళా రీతు లన్నిటికీ దారి చూపింది మాత్రం బౌద్ధశిల్ప కళే. అందునా అమరావతి శిల్పకళే.

ఇక ఇప్పుడు తెలుగునేల మీద మహో న్నతమైన బౌద్ధాచార్యులుగా కీర్తిగాంచిన వారు బౌద్ధ సాహిత్య సంపదను ఎంతగా సృష్టించారో కొద్దిగా చూద్దాం. ఈ తెలుగు బౌద్ధ తాత్విక దిగ్గజాలు ఏడుగురు.

**1.నాగార్జునుడు**(క్రీ.శ.100-200) : తెలుగు నేల మీద ఉదయించిన వినూత్న బౌద్ధ కిరణం నాగార్జునుడు. రెండో బుద్ధుడుగా కీర్తిగాంచిన తాత్వికుడు. ఈయన జన్మస్థలం 'వేదలి' అని 'లంకావారసూత్ర' అనే గ్రంథంలో ఉంది. ఈ వేదలి గుంటూరు జిల్లాలోని బాపట్ల, పొన్నూరు మధ్యన ఉన్న 'యాజలి' అని ప్రముఖ పురావస్తు పరిశోధకులు, స్థపతి శ్రీ ఈమని శివనాగిరెడ్డిగారి అభిప్రాయం. అయితే ఆ విషయం ఇంకా రుజువు కావాల్సి ఉంది. ఈ యాజలి ఒకనాటి చోడుల రాజ ధాని అయిన 'చందవోలు' సమీపంలో ఉంది. కానీ ఈ యాజలి (వేజలి, వేదలి) గ్రామానికి మూడువైపులా మూడు గ్రామాలున్నాయి. వీటిలో ఒకటి 'బుద్దాం'. ఈ గ్రామంలో బౌద్ధ అవశేషాలు దొరికాయి. బుద్ధుని శిల్పాలు, స్తూప నిర్మాణావశేషాలు దొరికాయి. ఇక రెండోది 'దమ్మన్నపాలెం'. మూడోది 'సంఘు పాలెం'. ఇలా బౌద్ధ త్రిరత్నాలైన బుద్ధం, ధమ్మం, సంఘం- ఈ మూడింటి చిహ్నాలుగా ఈ మూడు గ్రామాలూ యాజలి చుట్టూ ఉన్నాయి. ఈ గ్రామాల భౌతిక నిర్మాణం ఈమని శివనాగిరెడ్డి గారి అభిప్రాయానికి ఊతం ఇస్తున్నాయి.

ఇక-నాగార్జునుని రచనల్లో మంచి రత్నాలు 'రత్నావళి', 'సుహృల్లేఖ'లు. ఈ రెండూ నైతిక ప్రబోధాలు. ఈ సంస్కృత గ్రంథాల్ని డా॥వావిలాల సుబ్బారావు గారు ఇటీవల చక్కని తెలుగులోకి అనువదించారు. ఇక నాగార్జునుని తాత్విక గ్రంథాలు ఐదు. ఇవన్నీ సంస్కృత గ్రంథాలే. 1. మాధ్యమిక కారిక, 2. యుక్తి షష్టిక, 3. శూన్యతా సప్తతి (దీనికి యం.రాజగోపాలరావు గారు చక్కటి తెలుగు వ్యాఖ్యానం రాశారు), 4. విగ్రహ వ్యావర్తని, 5 వైదల్యసూత్ర- ఇవి గాక ప్రతీత్యసముత్పాద హృదయం, మహా ప్రజ్ఞాపారమిత శాస్త్ర గ్రంథాలు కూడా నాగార్జుని రచనలే.

**2.ఆర్యదేవుడు:** (క్రీ.శ.170-270) :ఆచార్య నాగార్జునుని శిష్యుడు. బౌద్ధ మాధ్యమిక వాదంలో మహా దార్శనికుడు. గుంటూరు జిల్లా పొన్నూరు ప్రాంతం వాడని అంటారు. చతుశ్శతక, శతశాస్త్ర, చతుహస్తిక, అక్షర శతక- అనే గ్రంథాలు రాశాడు. వీటిలో శతు శ్శతక చాలా ప్రసిద్ధ గ్రంథం.

**3. బుద్ధపాలితుడు :** (క్రీ.శ.470-540): మాధ్యమిక సంప్రదాయంలో ప్రాసంగిక సంప్ర దాయానికి చెందిన తాత్వికుడు బుద్ధపాలి తుడు. ఈయన జన్మస్థలం దంతపురి. దంత పురి అంటే కళింగపట్టణం అని అంటున్నారు. ఈయన సంఘరక్షిత శిష్యుడు. దంతపురి విహారంలో ఉన్నాడు. నాగార్జునుని 'మూల మాధ్యమిక కారిక' మీద వ్యాఖ్యానం రాశాడు. (ఈ కారిక మీద మరో ఏడుగురు వ్యాఖ్యా నాలు రాశారు. వారు నాగార్జునుడు, భావవివే కుడు, దేవశర్మ, గుణశ్రీ, చంద్రకీర్తి, స్థితిమతి, గుణమతి అనేవారు) ఈయన రాసిన వ్యాఖ్యానం పేరు 'మూలమాధ్యమిక కారికా వృత్తి'.

**4. భావవివేకుడు :** (క్రీ.శ.490-570) : నాగార్జునుని మాధ్యమిక సంప్రదాయంలో 'ప్రాసంగిక' అనే సంప్రదాయానికి చెందిన వాడు బుద్ధిపాలితుడు. అయితే, రెండోదైన 'స్వాతంత్రిక' సంప్రదాయానికి చెందినవాడు భావివివేకుడు. కొందరు భావవివేకుణ్ణి నాగా ర్జునుని శిష్యుడే అంటారు. అమరావతికి నైరుతి దిశలో ఉన్న ఒక గుహలో నివసిం చాడు (ఉండవల్లి). ప్రజ్ఞాప్రదీప, మాధ్యమిక హృదయ కారిక, కరతల రత్న, సాంఖ్య తర్క జ్వాల ఇతని గ్రంథాలు. ఇతని జన్మస్థలం మలయగిరి అంటే ఈనాటి మంగళగిరి. ఈయన కూడా సంఘరక్షిత శిష్యుడే.

మరలా తిరిగి ఈనాడు...మంగళగిరి బౌద్ధ ధర్మ ప్రబోధ కేంద్రంగా విరాజిల్లుతోంది. ధమ్మమిత్రుడు కృష్ణార్జునబోధి గారి నేతృ త్వంలో మంగళగిరి బుద్ధవిహార ఏర్పడింది. గత పదేళ్ళుగా ఎన్నో ధార్మిక కార్య క్రమాలు సాగిస్తూ బౌద్ధ ధమ్మ భూమికకు అంకురార్పణ జరిగింది. ఇందులో భాగంగా గోలి సీతా రామయ్య తదితర మిత్రుల సహకారంతో, ధర్మశ్రీ చెన్నూరు ఆంజనేయరెడ్డి , అన్నపరెడ్డి బుద్ధఘోషుడు మరికొందరు బౌద్ధ పెద్దల సూచనలు, ప్రోత్సాహంతో గత ఐదేళ్ళుగా ప్రముఖ బౌద్ధ సాంస్కృతిక మాసపత్రిక 'బుద్ధ భూమి' ఇక్కడి నుండే వస్తోంది. ఈనాడు బౌద్ధవాణి మాగాణిగా తిరిగి మంగళగిరి మారడం, నిజంగా భావవివేకునికి నిజమైన నివాళే.

**5. బుద్ధఘోషుడు** (క్రీ.శ.5వ శతాబ్దం): బౌద్ధ కొలనులో విరబూసిన కమలం బుద్ధఘోషుడు. ఇతని జన్మస్థలం 'మొరంద ఖేతకం' అంటే మయూరపట్టణం. అదే తెలాంగ్ (త్రిలింగ, తెలుగుదేశం) దేశంలోని ఒక గ్రామం. అదే ఈనాడు గుంటూరు జిల్లాలో ఉన్న కోటినెమలి పురం(మయూరం అన్నా, మొరందం అన్నా నెమలి అని). ఇతని గురువు దేవతుడు. ఇతని గ్రంథాలు:

1. జ్ఞానోదయం (తొలిగ్రంథం), 2. అట్ఠ సాలిని (అభిధమ్మ పిటకంపై వ్యాఖ్యానం), 3. విశుద్ధిమగ్గ, 4. సుమంగళ విలాసిని (దీర్ఘ నికాయం మీద వ్యాఖ్యానం), 5. పపంచ సుధని (మధ్యమ నికాయం మీద వ్యాఖ్యానం), 6. సరత్థ ప్రకాశిని (సంయుక్త నికాయం మీద వ్యాఖ్యానం)

7. మనోరథపూరణి (అంగుత్తారనికాయం మీద వ్యాఖ్యానం)

వీటిలో విశుద్ధిమగ్గ (విశుద్ధి మార్గం) ఎంతో పేరెన్నికగన్నది. దీన్ని శ్రీ మోక్షానంద గారు తెలుగు చేశారు. బౌద్ధసారస్వత పోష కులు, ధర్మదీపం ఫౌండేషన్ వ్యవస్థాపకులు శ్రీ చెన్నూరు ఆంజనేయరెడ్డి , శ్రీ వి. వీర నారాయణ రెడ్డి గార్లు ప్రచురించారు.

**6. దిజ్నాగుడు** (క్రీ.శ.480-540): మహా యాన శాఖకు చెందిన యోగాచార బౌద్ధ సంప్రదాయానికి చెందిన మహా తాత్వికుడు. వసుబంధ శిష్యుడు. కాంచిపురం వాడని కొందరంటారు. విశాఖపట్నం జిల్లాలోని సింహాచలం (సింహవక్త్రపురం) ఈయన జన్మస్థలం అని కొందరంటారు. తెలుగు బౌద్ధ తాత్వికుడు అనేది మాత్రం తిరుగులేని నిజం. ఇతని గ్రంథాలు పదిహేను దాకా ఉన్నాయి. బౌద్ధ తార్కికుల్లో అగ్రగణ్యుడు.

దిజ్నాగుని గ్రంథాలు : 1) మత్రకస్తోత్ర 2) గుణపర్యంతస్తోత్ర 3) ఏకగాథ (టీక) 4) ఆర్యమంజుఘోష (టీక) 5) ప్రజ్ఞాపారమిత సంగ్రహ (కారిక) 6) యోగావచార 7) సమాంతాచార -ప్రణిధానార్థసంగ్రహ 8) అభిధమ్మ కోశ 9) ప్రమాణ సముచ్చయం 10) త్రికళ పరిఖా 13) న్యాయప్రవేశ నామ ప్రమాణ ప్రకరణ 14) న్యాయ ప్రవేశనామ ప్రమాణ శాస్త్ర 15) హేతుచక్ర.

వీటిలో యోగావచార గొప్ప వైజ్ఞానిక గ్రంథం. ఈనాటి ఆధునిక సైన్సుకు తీసిపోని గ్రంథం. ఇక అభిధమ్మకోశం, ప్రమాణ సముచ్చయం బౌద్ధ సాహితీ జగతిలో హిమగిరి శిఖరం లాంటి గ్రంథాలు.

**7. ధర్మకీర్తి ( క్రీ.శ.6వ శతాబ్దం):**

తెలుగు బౌద్ధులలోనే కాదు, ప్రపంచ బౌద్ధ తాత్వికుల్లో మేటి ధర్మకీర్తి. తెలుగు బౌద్ధ తాత్వికుల్లో చివరివాడు. బౌద్ధ దర్శన ఆఖరి వెలుగు. ధర్మకీర్తి త్రిమలయ నివాసి. అంటే తిరుమల వాసి. ఈయన దిఙ్నాగుని శిష్యుడైన ఈశ్వరసేనుని దగ్గర ప్రమాణ సముచ్చయం చదువుకున్నాడు.

ఇతను దాదాపు పద్నాలుగు గ్రంథాలు రచించాడు. అవి 1) న్యాయబిందు, 2) ప్రమాణ వినిశ్చియ, 3) ప్రమాణ వార్తిక, 4) హేతుబంధు, 5) సంబంధ పరీక్ష, 6) వాద న్యాయ, 7) సంతానంతర సిద్ధి, 8) ప్రమాణ వార్తిక (వృత్తి), 9) సంబంధ పరీక్ష (వృత్తి), 10) జాతకమాల (టీక), 11) బుద్ధపరి నిర్వాణ శాస్త్ర, 12) హే వజ్ర మహాతంత్ర రాజస్య పఞ్జిక నేత్ర విభంగ స్తోత్ర, 13) సర్వదుర్గతి పరిశోధన మారహోమ మండల ఉపాయిక, 14) వజ్రదకస్యస్తన దండక.

వీటిలో మొదటి మూడు గ్రంథాలు బౌద్ధ గ్రంథాలలో తలమానికాలు.

ధర్మకీర్తి బౌద్ధం చెప్పిన ప్రమాణాల్ని, హేతు తత్వాన్ని విశదీకరించిన ద్రష్ట. మూఢ నమ్మకాల వెన్ను విరిచిన గొప్ప హేతువాది.

**కాపీలు - కాఫీలు:**

ప్రపంచంలో ఒక నానుడి ఉంది. ప్రపంచంలో రెండు రకాల వ్యక్తులుంటారు. ఒకరు తాను బౌద్ధులమని తెలిసినవారు. రెండు తాము బౌద్ధులమని తెలియని వారు. ఇది నిజం కూడా. ఎందుకంటే- బౌద్ధం మాన వీయ సిద్ధాంతం. మొత్తం మానవ సమాజం ఆటవిక, అనాగరిక దశ నుండి ఈనాటి దశకు వచ్చింది. ఈ పరిణామక్రమంలో మానవజాతిలో మానవీయత క్రమక్రమంగా పెరుగుతూనే ఉంది.

కథల్ని కాపీ కొట్టే కథకులు, సినిమాల్ని కాపీ కొట్టే సినీ దర్శకులు ఉన్నట్టే సిద్ధాంతాల్ని కాపీ కొట్టే 'సిద్ధాంత కర్తలూ' ఉంటారు.. ఉన్నారు.

ఈ కాపీలు చివరికి కాఫీలు తాగినంత తేలికైపోయింది.

గత 2500 సంవత్సరాల కాలంలో...ఆ తర్వాత వచ్చిన నూతన సిద్ధాంతాలు ఎన్నో బౌద్ధాన్ని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తమ లోకి తీసుకున్నాయి. అలాగే బౌద్ధానికి ముందున్న కొన్ని అమానవీయ మతాలూ, ధర్మాలూ ప్రజలు మెచ్చిన బౌద్ధ ధర్మాల్ని తమలోకి తీసుకుని తమ పాత నడక మార్చుకున్నాయి. కొన్నాళ్ళకి ఆ నూతన విధానాలు 'బౌద్ధం నుండి వచ్చినవే' అనే స్పృహనే కోల్పోయి-ఆ 'తత్వాలు' తమవే అని చెప్పుకున్నాయి..నమ్మించాయి.

కవిత

## మాతృభాష

దేశ దేశాలు సంచరిస్తున్నాను
వైశాల్యాలతో విర్రవీగుతున్నాను
పునాదులను మరచి
శిఖరాలకై ఆరాటపడుతున్నాను
ఓ నా మాతృభాషా!
నిన్ను కాస్త కాస్త పోగొట్టుకుంటున్నాను.

ఎంత తిరిగినా ఏదో లోటు
ఏదో అసుఖం
తడిలేని ఒత్తిడి
వేర్లు తెగుతున్న అలజడి
ఓ అసహజ విజిగీష
ఈ శ్రమ బిందువులు
మంచి ముత్యాల్లా లేవు
ఈ తెలివిడి అంతిమ సాఫల్యం కాదు
ఓ నా మాతృభాషా!
క్షోభపడే ఆత్మతో కొట్టుకుంటున్నాను.

దారి తప్పిన
ఆవు లంబాయని ఇండ్ల దారి పట్టాయి
సంధ్య మంటలు అంటుకున్న రెక్కలతో
పక్షులు గూళ్ళకు చేరుకుంటున్నాయి.
దిశను కోల్పోయిన శూన్యంలా
పరిభ్రమిస్తున్నాను.

ఆకాశంలోంచి
విమానాశ్రయం కనపడుతోంది
దిగకముందే దూకేస్తున్నాను
ఓ నా మాతృభాషా!
నీ ఒడి వెచ్చగా వుంది.

**-డా॥ఎన్.గోపి**

-కవి సెల్ నెం.93910 28496

ఆ మధ్య 'మగధీర' అనే ఒక తెలుగు చిత్రం వచ్చింది. మా చిన్నమ్మాయి శ్రీశ్రీ ఆ చిత్రం చూసింది. తర్వాత కొన్నాళ్ళకి నేను ఒకసారి 'ది మిత్' అనే జాకీచాన్ చిత్రం ఆ అమ్మాయికి చూపించాను. ఆ సినిమా చూస్తూ "అబ్బో...ఈ సినిమా మగధీర సినిమాకి కాపీ" అంది. మగధీర కంటే పదిహేనేళ్ళ ముందు 'ది మిత్' సినిమా వచ్చింది. ఆ విషయం ఆ అమ్మాయికి తెలియదు. కానీ తర్వాత వచ్చిన దాన్ని ఆమె ముందుగా చూసింది.

ఈనాడు బౌద్ధం స్థితి కూడా అలాగే ఉంది.

మనలో చాలామంది స్థితి మా పాప స్థితే.

బౌద్ధ మూలాల్ని, బౌద్ధ గ్రంథాల్ని చది వినవాళ్ళు ఆధునిక మతాల్ని, మత సిద్ధాంతాల్ని, ఆధునిక ప్రవక్తలు చెప్పిన ధర్మ, నైతిక సూత్రాల్ని చూసి నివ్వెరపోతారు. ముఖ్యంగా బౌద్ధం తర్వాత వైదిక మతంలో జరిగిన మార్పుల్ని గుర్తించి అవాక్కయిపోతారు.

**మరువరానిది:**

బుద్ధుని దూరదృష్టి, తాత్వికత , సామాజిక దృక్పథం ఎంత విశాలమైనవో, ఎంత వైజ్ఞానికమైనవో అర్థమైతే తప్పక బౌద్ధాన్ని ఆరాధిస్తారు.

ఇలాంటి మహోన్నతమైన ఒక మానవీయ ధర్మాన్ని ప్రపంచానికి పరిచయం చేయడమే కాకుండా ప్రపంచ వ్యాపితం చేయడంలో మన తెలుగునేల పోషించిన చారిత్రక పాత్ర మరువలేనిది. మరువరానిది. ఆ మానవీయ బౌద్ధ నిధి, ఎన్నటికీ మరుగున పడనిది.

ఈ నాడు తిరిగి అశాంతి పెరిగింది. అవినీతి ప్రబలింది. మూఢనమ్మకాలు పెచ్చరిల్లాయి. యజ్ఞయాగాల రూపంలో అశాస్త్రీయ భావజాలం బలిసిపోతున్నది. పరభాష మోజులోపడి పాలకులే అమ్మనుడికి ముళ్ళ కంచెలు కడుతున్నారు.

ఇలాంటి సమయంలో... సమాజ శాంతికి, శాస్త్రీయ విజ్ఞాన విక్రాంతికి, మనల్నిమనం మనుషులుగా, మానవీయులుగా మలచుకోడానికీ...తిరిగి బౌద్ధానికి మది తలుపులు తెరవాల్సిందే!

**(అయిపోయింది)**

రచయిత ఫోను : 93906 00157

-డా॥వావిలాల సుబ్బారావు

# వారసత్వం...మన సత్వం

వారసత్వ నగరాలను ప్రత్యేక శ్రద్ధతో, నిధులతో వృద్ధి చేయాలన్న సంకల్పం కేంద్రానికి కలిగింది. ఎందుకో నాకు నచ్చింది. "అమ్మయ్య! ఇప్పటికైనా ..." అనిపించింది. మనకు రెండుచోట్ల గుర్తింపు వచ్చింది. ఓరుగల్లు, అమరావతి. అమరావతిలో ఏంచెయ్యాలి అనే ఆలోచనలు, ప్రణాళికలు, అధికారుల కదలికలు ప్రారంభమయినాయి. ఊళ్ళో వాళ్ళకు కొత్త ఉబలాటం మొదలయ్యింది. ఏది వారసత్వం? దేన్ని ఉద్ధరించబోతున్నారు అన్న విచికిత్స నాకు కలిగింది.

'వరంగల్లు' అదృష్టవంతురాలు (నగరాలు స్త్రీ లింగాలా?) అక్కడ చాలా శిథిల నిర్మాణాలు, చారిత్రక చిహ్నాలు, రాజ్య రాజధాని గత చిహ్నాలు అనేకం మిగిలి వున్నాయి. ఇక్కడ అమరావతిలో అవ్వేమీ ఘనంగా కనుపించవు. అయితే ఏం చేయబోతున్నారు? వరంగల్లు వారసత్వంలో 'ఓరుగల్లు'గా మారదా, అమరావతి 'ధాన్యకటకం' కాదా?-

ఊరుకు పేరులేని కాలం నుండి -పేరు మారిన కాలం దాకా వారసత్వమే. ఎన్ని వారసత్వాలో ధార్మిక, చారిత్రక, రాచరిక, జీవనశైలి, సాంఘిక, కళా ఇంకా ఇంకా ఎన్నో. కేంద్ర నిధుల ప్రసాదం వేటికి దక్కబోతున్నది. పర్యాటక ఆకర్షణ కోసం వారసత్వాన్ని వంకర్లు తిప్పుతారా? వారసత్వ సందర్శన కోసం పర్యాటకులు వస్తారా? ఏది ప్రధానం? వారసత్వ వేషధారణలో ధోవతులు, లాల్చీలేనా? జీన్సు టీ షర్టులుండవా? గారెలు అరిసెలేనా? పిజ్జాలు బర్గర్లు దొరకవా? కాపుసారా, కల్లుముంతలేనా? మెక్డొనాల్డు, జానీవాకర్లు దొరకవా? వారసత్వ నగరం అంటే అందమైన జాడీలో పాతచింతకాయ పచ్చడిగా ఉండబోతున్నదా? కేంద్ర సంకల్పం విన్నప్పుడు, అమరావతికి అందులో స్థానం దొరికిందన్నప్పుడు కలిగిన సంతోషం, ఇపుడు సందేహాల సంకులంలో పడిపోయింది.

అసలు 'వారసత్వ'మనే మాటే మనది కాదు. ఏ పర్షియనో, ఉర్దూనో కలిపేసుకున్నాం గదా! మొగమాటం లేకుండా వాడేసు కుంటున్నాం గదా! అట్లాగే వేల సంవత్సరాల కాలంలో కొత్తగా వచ్చి కలిసిపోయినవి, ఇటీవలే వచ్చి ఇమడలేక జారిపోయినవి, మనవే అయినా కాలం చెల్లి మొఖం చాటు వేసినవి- పోయినవి పోగా మొన్నటిదాకా మన మధ్యే ఉండిపోయినవన్నీ వారసత్వాలే. జాతి ఆమోద పరీక్షలో నిలబడి తలెత్తుకు తిరిగేవన్నీ వారసత్వ అంశాలే.

పెంకుటిళ్ళు ఎంతో అందంగా ఉంటాయి. బంగళా పెంకుకన్నా దోనెపెంకులు నేసిన ఇంటికప్పులు ఇంకా అందం. అందులో ఉండే వాడికి కష్టాలు తెలుసు. బయటనుండి చూసేవాడికి అందం తెలుసు. టీవీల పుణ్యమా అని రచ్చబండ సంస్కృతి గ్రామాల్లో కూడా కను మరుగయింది. ఇంటి ప్రహరీలకు అరుగులే లేవు కదా! నలుగురు చేరి అరుగుల మీద కబుర్లలోపడితే ఎంత సమాచారం. ప్రాంతీయ వార్తలకన్నా మిన్న. టాబ్లాయిడ్ పత్రిక దీనిముందు సున్న.పదిమందితో అనుబంధం. ఇంటివారికి అది రక్ష. ఆడవారి పేరంటాలు కనపడటమే లేదు. ఆ ముచ్చట్లే వేరు. అక్కడి సరదాలే వేరు. మర్నాడు పక్కదుప్పట్ల మీద కాళ్ళ పసుపుల పచ్చదనమే వేరు. వీధిపక్క భాండీ వంటల రుచులు. నది ఒడ్డున నీలాటి రేవులు. తోమిన ఇత్తడి బిందెలు బంగారు బిందెలై చూపుల తుమ్మెదలు వెంటరాగా నీరు నింపుకొని వెళ్ళే పురంధ్రులు..ఇవన్నీ సజీవ వారసత్వాలు. కేంద్రం ఎన్ని కోట్ల నిధులు యిచ్చినా ఇవి మళ్ళీ రావు. నీటి కుళాయిల సౌకర్యం వొదులు కుంటామా? కావడి బిందెలు భుజాన వేసుకుంటామా? ఒట్టిమాట. ఆటోలు, స్కూటర్లు, అమ్మేసి గుర్రాలు, ఎద్దుబండ్లు కొనుక్కోము కదా? సినిమాలు మానేసి తోలుబొమ్మలాటలు, కరెంటు దీపాలు వొదిలేసి హరికేన్ లాంతర్లు, ఆముదపు దీపాలు ఆశ్రయించం.

కానీ అందంకోసం రాజీ పడతాం. సూటు బూటు హేటు వేసు కోకపోయినా, పేంటు చొక్కా పేంటులో చొక్కా తొడుక్కుంటాం. హరికేన్ లాంతరు ఆకారంలో కరెంటుదీపం, సిమెంటు శ్లాబు మీద పెంకుడిజైన్లు- అలంకరించి పాతలోని సౌందర్యం కొత్తలోని సౌక ర్యంతో రంగరించుకుంటాం. నిన్నతో కలిసిపోయిన మొన్నను నేటికి వారసత్వం అంటాం. అసలు నిన్న మొన్నలే లేని పరాయి'నేటి'తో భుజం కలిపి నడవలేం. వారసత్వ పునరుద్ధరణకు పూనుకున్నవాడు- మన రక్తంలో కలిసే సజాతీయ లక్షణాలేవో రక్తాన్ని విరిచే విజాతీయ లక్షణమేదో గుర్తించాలి.

నేటి పరిణామంలో ఇమడక అంతరించిపోయిన లక్షణాలను ప్రదర్శనశాలకే పరిమితం చేసిగాని, ఒక వారసత్వ పేటను రూపొం దించి గాని, చూపరులకు విశేషంగా అందించవచ్చు. సినిమా హీరో ధోవతి కట్టి తలగుడ్డ చుట్టినట్లు, పట్టుచీర కట్టి పారిస్ వెళ్లినట్లు, కొత్తలోకంలో పాత అనుభవం పొందవచ్చు.

వారసత్వ నగరం దేశ, జాతి సంస్కృతికి ఒక నమూనా. స్థానిక చరిత్రకు ఒక ఆల్బం. కుప్పిగంతులతో పరిగెత్తే వాడి మెడను వెనక్కి తిప్ప చూడటం- ఒకా నాస్టాల్జియానుభవం. పుట్టింటికి పునరా గమనం. అమ్మచేతి పెరుగన్నం ముద్ద. అందులో నంజుకునే ఆవకాయ బద్ద. ఈ వాక్యాన్ని తెలుగులో అంటేనే బాగుంటుంది. నాస్టాల్జియా అనే ఇంగ్లీషుమాట కలిసినా సరే.

స్వభాష లేని స్వీయసంస్కృతి సజీవంగా వుండదు. భాషను మడి కట్టి ఆపలేము. సంస్కృతికి అడ్డుకట్ట వేసి నిలపలేము. పరిణా మాన్ని ఆపటం అసంభవం అని తెలిసినట్లే. భాషా సంస్కృతుల సంబంధం అవిభాజ్యం అని గూడా తెలియాలి. మన రక్తంలో కలిసి జీవశక్తిని పెంచగల ధాతువులను ఆమోదించటం వారసత్వ విరోధం కాదు. సంస్కృతి పోషణకు ఏ సూత్రం వర్తిస్తుందో భాషా పోషణకు అదే సూత్రం వర్తిస్తుంది. సంస్కృతంలోనే సర్వశాస్త్రాలు- దేశపాలన నడవాలనేది ఒక అతివాదం అయితే, ఆధునికలోకంలో పరుగెత్తటానికి తెలుగును మర్చిపోయి విదేశీ భాషలను ఆ బాల్యం నేర్చుకోవాలను కోవటం మరొక అతివాదం. భాషా వారసత్వ పరిణామాన్ని గూడా అధ్యయనం చేయాలి.

క్రీడల వారసత్వాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేశాం. పూర్వకాలంలో




ఈ దేశంలో ఆటలే లేవన్నంతగా దిగుమతి చేసుకున్నాం. ఎవరి పుణ్యమో ఇటీవల కబడ్డీ పేరు మళ్ళీ వినిపిస్తున్నది. చదరంగం మనదేనని మురిసిపోతున్నాం. ఎన్ని నట్టింట ఆటలున్నాయో! పూలజడ సరి(దాడి) ఆట, అష్టాచెమ్మా, పచ్చీసుపాళీ, వామనగుంటలు- ప్రాంగణాల్లో తొక్కుడుబిళ్ళ, గోలీల ఆట... ఎన్ని బాల క్రీడలున్నాయి! కోడి పందాలు, ఎద్దుల పందాలు, పోటేలు పందాలు వంటి పౌరుష క్రీడలు! జూదలక్షణం ప్రవేశిస్తే ఏదయినా తప్పే. ఈ దోషం అంతర్జాతీయ క్రీడలకూ తప్పలేదు. జల్లికట్టు, కర్రలతో సామూహికంగా కొట్టుకోవటం వంటి క్రీడలను దూరం చేయవచ్చు. అది వారసత్వమయినా ప్రమాద గుణం ఉన్నది గనుక.

కొన్ని వారసత్వాలు ప్రదర్శనకు మాత్రమే పనికి వస్తాయి. కొన్ని వారసత్వాంశాలు సజీవ వారసత్వాలుగా ఉంటాయి. వాటిని అనుకరించటానికి ఇష్టం కూడా కలగవచ్చు. సంక్రాంతి అంతా ఎంత గొప్ప ప్రదర్శన మాసం! (ధనుర్మాసం) సంప్రదాయశోభ అధికంగా స్త్రీలను ఆశ్రయించి జీవిస్తున్నది. జుట్టులోనో, కట్టులోనో వారు కొంచెం స్వతంత్రిస్తే ముక్కున వేలు వేసుకుంటారు. గగ్గోలు ఎత్తుతారు. పురుషులు మాత్రం ధోవతి ఉత్తరీయాన్ని, పిలక, గిరజాలను ఏనాడో వదిలేశారు. పైగా పాటిస్తేనే వింత.

నా మిత్రులు ఈ మధ్య లతలు చెక్కిన పాతకాలపు తలుపులు, దర్వాజాలు, నట్టింట స్తంభాలు, స్థంభాలపై గుజ్జులు, పట్టె మంచంపై గిలకలు, చిలకలు సేకరించి శుభ్రపరుస్తున్నారు. కొత్త రీతిలో అనుకరిస్తున్నారు. కళా సంప్రదాయాలకు అందమే ఉంటుంది గానీ కాలదోషాలుండవు. అవి ఉండేది మన మోజులకు.

వారసత్వ పరిరక్షణలో మూడు ప్రధానాంశాలను గుర్తించవచ్చు.

1. ప్రదర్శనశాలకు పరిమితమయినవి. కాలం చెల్లిన పరికరాలు.

జల్లెడ, రోళ్ళు, రోకళ్ళు, తిరగళ్ళు, ఉట్లు, పాన్‌దాన్‌లు, అమాన్ దస్తా మొదలైన గృహోపకరణాలు, మట్టి మిద్దెలవంటి నిర్మాణ నమూనాలు, దారు శిల్పాలు, వ్యవసాయ, నేత, కుమ్మరి వంటి వృత్తి పరికరాలు, వాటి వినియోగ విధానం.

2. సజీవ వారసత్వాలు -వేషభాషలు, వంటలు, గృహాలంకరణలు, దేహాలంకరణలు, వస్త్రాలంకరణలు, రచ్చబండలు, అట్లతద్ది, ఉండ్రాళ్ళతద్ది-సంక్రాంతి ముగ్గులు, గంగిరెద్దులు మొదలైనవి.

3. క్రీడా వారసత్వాలు : పాత ఆటలు ఆడుకోవటం, నేర్పటం, కోడిపందాలు, ఎద్దు పందాలు, భజన బృందాలు.

4. గాన వారసత్వాలు : స్త్రీల పాటలు, ఆటల్లో పాటలు, జానపద గేయరూపాలు, యక్షగానాలు, బుర్రకథలు మొదలైనవి.

వారసత్వ నగరాల ప్రయోజనం ప్రదర్శనశాలగా ఉండటం మాత్రమే కాదు. నేర్పటం, పరిశోధించటం, ఆధునీకరించటం కూడా. అప్పుడే ఈ ప్రయత్నం ఫలవంతమవుతుంది.

*రచయిత ఫోను : 98664 02973*

# సవర భాష

-డా॥అల్లంసెట్టి చంద్రశేఖరరావు

**భా**రతదేశంలో ప్రస్తుతం వాడుకలో ఉన్న భాషలు నూటికి పైబడే ఉన్నాయి. భారతీయ భాషలన్నీ సంస్కృత భాషాజన్యాలే అనే అభిప్రాయం పందొమ్మిదవ శతాబ్దపు పూర్వపాదం వరకూ ఉండేది. 1847లో హోడ్గ్‌జన్ భారతీయ భాషలను మూడు కుటుంబాలుగా వర్గీకరించాడు. అవి, 1) హిమాలియన్, 2) ఇండో ఆర్యన్, 3) తమూలియన్ కుటుంబాలు. తమూలియన్ కుటుంబాలలో ద్రావిడభాషలు, కొలారీ లేక కోల్ భాషలు వుండేవి. 'కోల్' అన్న పదం కూలి జన్యం. కూలి అనగా నైపుణ్యంలేని పనివాడు అని అర్థం. 1854లో మాక్స్ ముల్లర్ కొలారీ భాషలను తమూలియను కుటుంబం నుండి వేరుచేస్తూ ఆ భాషలకు పురాతన జాతివాచకమైన 'ముండా' అని నామకరణం చేశాడు. ముండా పదం భారతంలో జాతివాచకంగా ప్రయోగింపబడింది. కురుక్షేత్ర మహాసంగ్రామంలో వారు కౌరవపక్షం వహించారు. "ఇంద్రుడు రాక్షసులను నాశనం చేసినట్లు నేను ఈ ముండాలను నాశనం చేస్తాను" అని సాత్యకి ప్రగల్భాలు పలుకుతాడు. (భీష్మ 117, 23)

బిషప్ కాల్డ్‌వెల్ ఇదే సమయంలో తమిళాది దక్షిణభారత భాషలను అధ్యయనం చేస్తూ, ఆ భాషలు ద్రావిడభాషా కుటుంబానికి చెందినవంటూ 1856లో ద్రావిడభాషా తులనాత్మక వ్యాకరణాన్ని ప్రకటించాడు. నాటినుండి తెలుగు, తమిళ, కన్నడ, మలయాళాది. భాషలను ద్రావిడ భాషలని పిలుస్తున్నాం. 1866లో ప్రచురితమైన భారతదేశంలోని జాతులశాస్త్రం అన్న గ్రంథంలో కేంప్‌బెల్ మాక్స్ ముల్లర్ వలె కోల్ భాషాకుటుంబాన్ని వేరుగా గుర్తించాడు. కాని దానిని 'ముండా' అనకుండా, 'కొలారియన్' కుటుంబం అన్నాడు. ఈ భాషాకుటుంబాన్ని కొలారీ అనీ, ముండా అనీ, సంతాలీ అనీ, నిషాద అనీ ఒక్కొక్క రచయిత ఒక్కొక్క విధంగా పిలవడం కంటె వేదకాలంలో వాడుకలోవున్న 'శబర' అన్న పేరు ఈ భాషాకుటుంబానికి పునఃస్థాపించి ఈ భాషాకుటుంబాన్ని 'శబర' (సవర) భాషాకుటుంబం అనడం అనుగుణ్యంగా వుంటుందని గిడుగు రామమూర్తి గారు అభిప్రాయపడ్డారు. 'సవర' పదం ఋగ్ వేదంలోని ఐతరేయ బ్రాహ్మణంలోని 'శబర' పదానికి దగ్గరగా వుందనీ, నాటినుండి నేటివరకు ఈభాష, ఈజాతి అనేక ఆటుపోటులను తట్టుకొంటూ నిలిచి వుందనీ వారు తమ సవర- ఆంగ్ల నిఘంటువులో రాశారు. 1906లో వెలువడిన 'లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా అనే గ్రంథంలో 'ముండా' పదాన్నే గ్రియర్‌సన్, స్టెన్ కోనోలు కొలారియన్ భాషాకుటుంబానికి వాడారు.

సవరలు తమ భాషలో తమను 'స-ఓర' అంటారు. సవరభాషలో 'ఓల' అంటే 'ఆకు' అని అర్థం. 'స-ఓర' అంటే 'ఆకుచాటు మనిషి' అని వ్యుత్పత్తి చెప్తారు. అనగా చెట్టు చాటున వుండేవాడు, వన నరుడు, వన చరుడు. 'వన నరుడే' 'వానరుడు' అయ్యాడు. 'ల' 'ర' గా మారడం సహజం. స-ఓర తరవాత సవరగా పరిణామం చెందింది.

**భారతదేశపు ఆదివాసులు :**

20వ శతాబ్దపు ఆరంభంలోనే స్మిత్ 'వంశము, సంస్కృతి, భాషల' ఆధారంగా మానవ జాతులను వర్గీకరించవచ్చు అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఆయా ప్రజలు మాట్లాడే భాషలను బట్టి, వారి సంస్కృతిని బట్టి భారతదేశంలోని జనులను నాలుగు జాతులుగా విభజించవచ్చు. 1) నిషద లేక ఆస్ట్రిక్ (ఆస్ట్రో-ఆసియాటిక్) 2) కిరాట లేక సీనో- టిబెటన్. 3) ద్రావిడ,4) ఇండో- ఆర్యను కుటుంబాలు. వీనిలో ఆస్ట్రో- ఆసియాటిక్ కుటుంబం మనదేశంలో అతి ప్రాచీనమైనది. ముండా కుటుంబం ఈ మహాకుటుంబంలోని ఒక విభాగం. నేడు భారత దేశంలోని సంతాలి, సవర, ముండా, గుటో మొదలైన వారు మాట్లాడే భాష ముండాకుటుంబానికి చెందినది. సంతాలి, సవర, ముండా మొదలైన పేర్లు జాతివాచకంగాను, భాషావాచకంగాను ఉపయోగిస్తున్నాం. ఈ భాషలను మాట్లాడే ప్రజలే ఈ దేశంలోని ఆదివాసులు. ప్రాచీన సంస్కృతీ గ్రంథాలలో వీరిని నిషాదులనే వారు అని మాక్స్ ముల్లర్ 1854లో పేర్కొన్నాడు. ఆర్.పి.చంద ఈ విషయంపై ఇంకా ఎక్కువగా పరిశోధన చేస్తూ నిషాదులు "కాకివలె నల్లగా, పొట్టిగా, పొట్టి చేతులతో, ఎత్తైన హనువులు (దవడలు), చప్పి ముక్కు, ఎర్రనికన్నులు, రాగిజుత్తు కలవారని" విష్ణు, భాగవత పురాణాల నుండి ఎత్తి చూపారు.

ఆర్యులు వలస వచ్చే నాటికి పంజాబ్ నుండి అస్సాం వరకూ గల భారతదేశం అంతా ఆస్ట్రిక్, సినో-టిబెటన్, ద్రావిడ భాషలు మాట్లాడే ప్రజలతో నిండి వుండేది. ఋగ్వేదంలోని ఐతరేయ బ్రాహ్మణంలో ఆంధ్ర, పుండ్ర, శబర, పుళింద, మూతిబా మొదలైన అనార్య జాతుల ప్రస్తావన వుంది. ఈ పదాలు జాతి వాచకాలే గాని భాషావాచకాలు కావు. ఆర్యులు తమ రచనలలో పేర్కొన్న వీరి ఆవాసాలు టోలమీ (130ఎ.డి) గుర్తించిన ప్రాంతాలతో ఇంచుమించుగా సరిపోతున్నాయి.

ఒకప్పుడు ఉత్తర భారతదేశం అంతా వ్యాపించివున్న ఆస్ట్రిక్ భాషావ్యవహర్తలయిన ఈ ఆదివాసీలు నేడు అస్సాం, ప॥బెంగాల్, బీహార్, మధ్య ప్రదేశ్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో మాత్రమే కానవస్తున్నారు. వీరిలో సగం దక్షిణ ఒరిస్సాలోని కోరాపుట్ (పాత) జిల్లాలో (వాల్మీకి రామాయణంలోని దండకారణ్య తూర్పుభాగం) నివసిస్తున్నారు. వీరి ఉనికిని మహారాష్ట్రలోని తూర్పు భాగం నుండి, దక్షిణ బీహార్, తూర్పున ఉత్తర ఒరిస్సా వరకూ, దక్షిణాన ఆంధ్రప్రదేశ్ లోని గోదావరీతీరం వరకూ భారతదేశపటంలో గుర్తించవచ్చు. వీరు ఆయా రాష్ట్రాలలోని కొండలలో నివసిస్తుంటారు. అందుచేతనే వీరిని గిరిజనులు అంటున్నారు.

భారతదేశంలో నేడు వాడుకలో వున్న భాషలన్నిటిలో ముండా భాషలే అతి ప్రాచీన భాషలు. నేడు వాడుకలో వున్న సుమారు 17 గిరిజన భాషలు ముండాకుటుంబానికి చెందినవిగా శాస్త్రజ్ఞులు గుర్తిం

చారు. ముండాకుటుంబాన్ని రెండు ఉప కుటుంబాలుగా విభజించారు. 1. ఉత్తర ముండా కుటుంబం. 2. దక్షిణ ముండా మహాకుటుంబం. 1.జు అంగ్, 2. కరియా 3.హో, 4.అసుర్, 5.బిర్‌హోర్, 6.ముండారీ, 7.సంతాలీ, 8.కొడ్కు, 9.కొర్వ, 10.మోవసి, 11.కొర్కు, 12.నిహలి భాషలు ఉత్తర ముండాకుటుంబానికి చెందినవి కాగా; 13.డిడ్డి, 14.బొండా, 15.గుటో, 16.గొరుమ్ (పరంగి) 17.సోర (సవర) దక్షిణ ముండా మహాకుటుంబానికి చెందినవి.

ఇరవైయవ శతాబ్ది మొదటి పాదాంతానికి సంస్కృత భాషాధ్యయనం బాగా అభివృద్ధి చెందడంతో వేదాలలోను, ఇండో యూరోపియన్ భాషలలోను లేని వికృత రూపాలు సంస్కృత భాషలో వుండడాన్ని, ఆ భాషలపై ద్రావిడ భాషల ప్రభావం వుంది అన్న కాల్డువెల్ మొదలైనవారి వివరణ సంతృప్తినివ్వలేకపోయింది. హరప్పా, మహెంజొదారోలలోని చరిత్ర పూర్వపు కట్టడాలను కనుగొన్న తరువాత, భాషా సంస్కృతుల ఆడుగు పొరను శోధిస్తే, ప్రబలమైన భారతీయ సంస్కృతిలోని వ్యత్యయాలను వివరించగలం అనే ధైర్యం ఇండాలజిష్టులకు వచ్చింది.

కొలారియన్లు (నిషాదులు) ద్రావిడులకంటే ముందునుండి ఈ దేశంలో వున్నారు. అందుచేత వారిభాషా ప్రభావం ద్రావిడ ఆర్య భాషలపై తప్పకుండా పడుతుందనే ఆలోచన పండితులలో కలిగిన ఫలితంగా ఆ దిశలో అధ్యయనం జరిగింది. మన అదృష్టం కొద్దీ ఈ ఆదిమజాతి ప్రజలు మధ్య, తూర్పు భారతదేశంలోని కొండల్లో, కోనల్లో నేటి నాగరికతకు దూరంగా వుంటూ, నేటివరకూ తమ భాషా సంస్కృతులను కాపాడుకొంటూవచ్చారు.

ఎఫ్.బి.జె.కూపర్ ఇరవయ్యవ శతాబ్దపు నాలుగవ దశకంలో ముండాభాషల తులనాత్మక పరిశీలన చేస్తూ, సుమారు ఒక వంద సంస్కృత పదాలు, ఆస్ట్రో–ఆసియాటిక్ కుటుంబానికి చెందిన మూల–ముండా శాఖనుండి వ్యుత్పన్నమయిన విధం నిరూపించారు. కొన్ని ఉదాహరణలు–

1) 'ఉదుంబర' అత్తిచెట్టు, ఇది పొట్టిగా వుంటుంది. కాని నామలింగానుశాసనంలో "ఉన్నతత్వ దుల్లంఘితమంబరం అనేనేతి ఉదుంబర– 'ఔన్నత్యముచేత నాకాశమును దాటునది అని వ్యుత్పత్తి'. కాని, ముండా భాషలలో 'దుమ, దుంబ' అంటే లావుగా, పొట్టిగా, తుంబగా (తుంబకడుపు) అనే అర్థాలున్నాయి. ఉందురు, ఉందుర, ఉందర, ఉందరు, ఇందూర; ఉదర్, (ముండా) వుందర్ (గుటో) ఇందుర్ (హో) కందుర్ (క్మేర్) కంతుర్ (ప్రాత క్మేర్) గుంటుర్ (సవర) ఇందూర (సం) ఎలుక.

2) 'కలింగ–కులింగ' చీలిన తోక గల ఒక గ్రద్ద (ముండా) కలాన్– తెల్లని కడుపుగల సముద్రపు గ్రద్ద. క్లెన్, క్లిన్ (క్మేర్, ఖాసీ) గ్రద్ద, 'కళింగ, కులింగ, కలింగ (సం) గ్రద్ద, 'కళింగం' దేశే జాతా కళింగం', కొడిసె పండు, కే సిరసి లింగం రేఖా రూపమస్యేతి కళింగ– శిరస్సునందు చుంచు అనెడి చిహ్నము గలది; కూకటి మూగ యను పక్షిపేరు.

విట్‌జల్ (1999) కూపర్ మొదలైనవారి పరిశోధనలను కొనసాగిస్తూ ఆధర్వణ వేదంలో కంటే ఋగ్వేదంలో ముండాభాషా పదాలు ఎక్కువగా ఉన్నాయి అనీ, ఆధర్వణ వేదంలో ద్రావిడ భాషా పదాలు చోటుచేసుకొన్నాయనీ తెలియజేస్తున్నారు. అందుచేత ఆర్యులు వచ్చేనాటికి నిషాదులు పంజాబ్ ప్రాంతంలో వుండేవారని అభిప్రాయం వ్యక్తంచేస్తున్నారు.

ఆస్ట్రిక్ భాషా వ్యవహర్తలయిన ఆ ఆదివాసులు భారతదేశపు వ్యావసాయిక నాగరికతా నిర్మాతలు, గంగా మైదానాలలో నివసించే నాటికి చేపలవేట, కోళ్ల పెంపకం, నూలు పడకడం, బట్టలు నేయడం, గ్రామ పరిపాలన వంటివి వీరికి తెలుసు అంటూ "భారతదేశపు భాషలు– సంస్కృతులు" అన్న గ్రంథంలో సునీత్ కుమార్ చటర్జీ రాశారు. భారతదేశంలోని అనేక నదులూ, పర్వతాలకు వారే నామకరణం చేశారు "వారు (కొలేరియన్లు) పెట్టిన పేర్లే నేటికీ మనం వాడుతున్నాము" అంటూ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సర్వజిత్ (1947) భారతిలో 'ప్రాచీన భారతీయ భాషలు' అన్న వ్యాసంలో రాశారు.

**గోదావరి– గోదారి :**

**మన గోదావరికి పేరు పెట్టింది సవరలే, గోదారే గోదావరి ఐంది.** సవర భాషలో 'గో' అంటే ఎక్కువ, చాలా, గొప్ప మొదలైన అర్థాలున్నాయి. 'దా' అంటే నీరు. 'ఇ' కదలికను తెలియజేసే క్రియా పదం. 'అర్' నామ్నీకరణం.

గో+దా+ఆర్+ఇ= గోదారి అంటే, గొప్ప నీటి ప్రవాహం అని అర్థం. నేడు మనం వంశధారను 'పెద్దేరు', నాగావళిని 'చిన్నేరు' అని అనడం లేదా.

'గోదా' తెలుగు నుడికారంలోకి ప్రవేశించింది కూడ. 'గోదా లోకి దిగితే గాని సత్తా తెలీదు'. లావు నీరు అంటే లోతునీటిలోకి దిగితే గదా సత్తా తెలిసేది.

**'జోల' అన్న పదంతో అంతమయ్యే గ్రామ నామాలన్నీ సవర భాషాజన్యాలే.** తెలుగు గ్రామనామాలకు చివర 'ఏరు, గెడ్డ, చెరువు' మొదలైన మాటలుండటం మనకు తెలుసు. 'జోల' అంటే ఏరు, గెడ్డ అని అర్థం. ఓంద్రజోల, దిమిడిజోల, జోలాపుట్టి మొదలైనవి సవర పేర్లే.

**తెలుగులో కూడ కొన్ని సవర పదాలున్నాయి.** పిల్లలకి పాలు పట్టే "గరగ" కూడ సవర పదమే. 'గ' అంటే 'త్రాగు' అని అర్థం. ఇది పునరుక్తి కాగా 'గగ' ఔతుంది. 'తాగుతూ... తాగుతూ' అని అర్థం. పునరుక్తి సవరభాషా లక్షణం. తెలుగులో కూడ పునరుక్తి వుంది. 'అర్' అన్న నామ్నీకరణం మధ్యచేరగా 'గ+అర్+అ+గ=గరగ' అయింది.

రచయిత సెల్ : 999505141

–డా॥బీరం సుందరరావు

# ప్రకాశం జిల్లా రచయితల సంఘం స్వర్ణోత్సవ వేడుకలు



ప్రారంభ సభలో 'తెలుగు లోగిలి'ని ఆవిష్కరిస్తున్న పెద్దలు

**క**విత్వంలో ఎఱ్రన వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్న ప్రకాశం జిల్లా ఎందరో కవులకు జన్మనిచ్చిన తల్లి ఒడి. ఎందరెందరో మహనీయులు ఓనమాలు దిద్దుకున్న తొలి బడి. సాహితీవేత్తలు పుట్టిన పుణ్యభూమి. కళాకారుల కాణాచి. దేశభక్తులైన నాయకుల్ని కన్న ధన్యభూమి. గోపురాల వంటి మూపురాలతో రాజసం ఉట్టిపడే వృషభ రాజాలే కాదు, కవి వృషభాలూ నడయాడిన నందన వనం. పావన గుండ్లకమ్మ జలాల్లో కలాలు ముంచి, గళాలు రగిలించి, తెలుగు సాహిత్యానికి చకచ్చకిత చేలాంచల చేతనత్వాన్ని కలిగించిన జిల్లా కవులు, రచయితలంతా ఆత్మీయంగా కలుసుకున్న అరుదైన వేదిక ప్రకాశం జిల్లా రచయితల సంఘం స్వర్ణోత్సవ వేడుక.

ప్రకాశం జిల్లా ఒంగోలులోని తిరుమల తిరుపతి దేవస్థానం కళ్యాణమండపంలో జనవరి నెల 8,9,10 తేదీల్లో జరిగిన ప్రకాశం జిల్లా రచయితల సంఘం (ప్ర.ర.సం) స్వర్ణోత్సవాలు తెలుగు సాహిత్యానికి సరికొత్త చైతన్యాన్ని కల్గించాయి. కవులకు కర్తవ్యాన్ని నిర్దేశించాయి. సాహిత్య సంస్థల ముందున్న కార్యాచరణను సూచించాయి. మూడురోజులూ స్వర్ణోత్సవ వేదిక విలువైన ప్రసంగాలతో ప్రేక్షకులను యోచింపజేసింది. కవి సమ్మేళనాలు కరచాలనం చేశాయి. అతిధుల సందేశాలు ఆలోచనను రగిలించాయి. ఆంధ్రప్రదేశ్ తెలంగాణలతో పాటు ఇతర రాష్ట్రాల నుండి వచ్చిన 800 వందల మంది కవులు, రచయితలు, భాషాభిమానులు, ప్రతినిధుల పలకరింపులతో ప్రాంగణం పులకరించింది. ఆత్మీయత వెల్లివిరిసింది.

8వ తేదీ శుక్రవారం సాయంవేళ సాహితీవేత్తల సందడి నడుమ రచయితల సంఘం స్వర్ణోత్సవ పతాకాన్ని రాష్ట్ర రవాణాశాఖామంత్రి శిద్ధా రాఘవరావు ఆవిష్కరించారు.

స్వర్ణోత్సవ సభల ప్రారంభోపన్యాసం చేసిన ఆంధ్రప్రదేశ్ శాసన సభ ఉపసభాపతి మండలి బుద్ధప్రసాద్– తెలుగుపట్ల మక్కువ పెంచుకొని, డాలర్ల మోజు తగ్గించుకొనేలా యువతరాన్ని కవులు, రచయితలు తమ రచనల ద్వారా కృషి చేయాలన్నారు. ఇతర రాష్ట్రాల్లో ఉన్న తెలుగువారి భాషా సమస్యలను ప్రభుత్వం, సాహిత్య సంస్థలు చిత్తశుద్ధితో పరిష్కరించాలన్నారు. ఈ సందర్భంగా ప్ర.ర.సం ప్రతిష్ఠాకరంగా ప్రచురించిన స్వర్ణోత్సవ సంచిక 'తెలుగులోగిలి'ని ప్రముఖ సాహితీవేత్త పద్మశ్రీ కొలకలూరి ఇనాక్ ఆవిష్కరించారు.

తెలుగుభాషా వికాసానికి విశేష సేవలందించిన ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు (బెంగుళూరు), డా॥పుల్లారి ఉమ (చెన్నయ్), ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి (కడప), డా॥తుర్లపాటి రాజేశ్వరి (బరంపురం), డా॥రామా చంద్రమౌళి(వరంగల్), సంగినేని రవీంద్ర (ముంబై), కె.అనిల్‌కుమార్‌రెడ్డి (చెన్నయ్)లను స్వర్ణోత్సవ పురస్కారాలతో ఘనంగా సత్కరించారు.

అనంతరం జరిగిన 'గజల్‌మాస్ట్రో' డా॥గజల్ శ్రీనివాస్ గజల్ గాన విభావరి ప్రేక్షకులను మంత్రముగ్ధుల్ని చేసింది.

9వ తేదీ శనివారం ఉదయం జరిగిన మొదటి సాహిత్య సదస్సుకు అభ్యుదయ రచయితల సంఘం జాతీయ కార్యదర్శి పెనుగొండ లక్ష్మీనారాయణ అధ్యక్షత వహించారు. అ.ర.సం, ప్ర.ర.సం. రెండూ సోదర సంస్థలన్నారు. సాహితీ వికాసానికి ప్ర.ర.సం. కృషి ఎంతో విలువైందన్నారు.

ప్రముఖ సాహితీవేత్త డా॥గుమ్మా సాంబశివరావు 'ప్రబంధ సాహిత్యం–సామాజిక ప్రబోధం' అంశంపై సోదాహరణ ప్రసంగం చేశారు. మన ప్రబంధాలు ధార్మిక జీవనానికి ప్రతిబింబాలన్నారు. పెద్దన వర్ణించిన 'గృహస్తు ధర్మాలు' ఏ కాలం వారికైనా ఆచరణీయాలన్నారు. భక్తికి అంటరానితనం లేదని తిన్నడి కథ ద్వారా ఆనాడే మహాకవి ధూర్జటి చాటారన్నారు.

'సమకాలీన సామాజిక కవిత్వ ధోరణులు' అంశంపై ప్రముఖ కవి కె.శివారెడ్డి ప్రసంగించారు. విభిన్న ధోరణులు, వాదాలు ఉన్నప్పటికీ కవిత్వం కాలానుగుణంగా విస్తరించాలన్నారు. కవులు ప్రజల ఆలోచనలకు పదును పెట్టాలన్నారు. కవిత్వం క్రమంగా విస్తరిస్తూ ప్రత్యామ్నాయ విలువల్ని ప్రతిపాదించాలన్నారు. సమాజానికి దిశానిర్దేశం చేయాలన్నారు.

ప్రఖ్యాత సాహితీ విమర్శకులు ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి 'ప్రాచీన తెలుగు సాహిత్య చరిత్రలు–పునర్మూల్యాంకనం' అంశంపై ప్రసంగిస్తూ– మూల్యాంకనంలో సృష్టి, దృష్టి ఒకటేనన్నారు. పునర్మూల్యాంకనంలో సృష్టి పాతది కాగా, దృష్టి కొత్తదన్నారు. ప్రాచీన కవులు ప్రాపంచిక దృక్పథాన్ని ఆధునిక విమర్శకులు అర్థం చేసుకోవాలన్నారు.



మొదటి సాహితీసభలో విశిష్ట అతిథి డా॥సామల రమేష్‌బాబు



జాతీయ కవిసమ్మేళనం అధ్యక్షుడు డా॥కె.శివారెడ్డి

ఏ సాహిత్య చరిత్రకైనా వర్తమాన స్వరం, నవ్యదృక్పథం తప్పక ఉండాలన్నారు.

విశిష్ట అతిథిగా విచ్చేసిన 'అమ్మనుడి' పత్రిక సంపాదకులు డా॥సామల రమేష్‌బాబు జీవో నెం.86(2006) ప్రకారం విద్యాసంస్థల్లో తెలుగును విధిగా బోధించేలా ప్రభుత్వాలు కఠిన చర్యలు తీసుకోవాలన్నారు. ప్రజల భాషలో రచనలు రావాల్సిన అవసరాన్ని కవులు, రచయితలు గుర్తించాలన్నారు. తెలుగు భాషోద్యమ సమాఖ్య పోరాటంతో సాధించిన ప్రత్యేక మంత్రిత్వశాఖను రచయితలు, కవులు ఉపయోగించుకోవాలన్నారు.

9వ తేదీ సాయంత్రం జరిగిన రెండవ సదస్సుకు ప్రముఖ కథా విశ్లేషకులు వాసిరెడ్డి నవీన్ అధ్యక్షత వహించారు. జిల్లా కవులందరికీ డా॥నాగభైరవ స్ఫూర్తిప్రదాతగా నిలిచారన్నారు. సదస్సుకు విశిష్ట అతిథిగా హాజరైన ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం అధ్యక్షులు సోమేపల్లి వెంకటసుబ్బయ్య మాట్లాడుతూ– డా॥నాగభైరవ 1966లో మిత్రుల సహకారంతో రచయితల సంఘాన్ని స్థాపించి, పెంచి పెద్దచేసి బి.హనుమారెడ్డిగారికి అప్పగించారని, రెడ్డిగారు దానికి స్వర్ణాభరణాలను అలంకరించి, ప్రస్తుతం స్వర్ణోత్సవ సభలతో పెళ్ళికూతురిలా ముస్తాబు చేశారని అభివర్ణించారు. ప్రముఖ సాహితీ విమర్శకులు, కవి డా॥పాపినేని శివశంకర్ 'తెలుగు సాహిత్య విమర్శ' అంశంపై ప్రసంగించారు. 'తెలుగు రుబాయిలు' అంశంపై ప్రముఖ కవి ఆచార్య ఎండ్లూరి సుధాకర్ ప్రసంగించారు. ప్రముఖ సాహితీవేత్త, వక్త డా॥ మొవ్వ వృషాద్రిపతి 'ఆధునిక పద్యకావ్యాలు' గురించి ప్రసంగించారు.

9వ తేదీ మూడవరోజు ఉదయం జరిగిన జాతీయ కవి సమ్మేళనానికి ప్రముఖకవి కె.శివారెడ్డి అధ్యక్షత వహించారు. కవిత్వ రచన ఒక సుదీర్ఘ ప్రయాణమన్నారు. జీవితాంతం బాధ్యతతో చేయవలసిన దినచర్య అన్నారు. ప్ర.ర.సం గత 50 ఏళ్ళుగా జిల్లా కవులు, రచయితలకే కాకుండా రాష్ట్రం, రాష్ట్రేతర ప్రాంతాల్లోని కవులకూ ఇచ్చిన ప్రోత్సాహం విలువ కట్టలేనిదన్నారు. కవి సమ్మేళనానికి ప్రజానాట్యమండలి అధ్యక్షులు నల్లూరి వెంకటేశ్వర్లు (అన్న) ఆత్మీయ అతిథిగా హాజరయ్యారు. కవిత్వం, కళలు సమాజానికి రెండు కళ్ళు వంటివన్నారు. సాహిత్య సంస్థలు కవిత్వంతోపాటు కళల్ని కూడా పోషించాలన్నారు.

సమ్మేళనం శ్రోతలకు కవిత్వ పండుగ చేసింది. వివిధ ప్రాంతాల



సన్మానాలందుకున్న రాష్ట్రేతర తెలుగు సాహితీవేత్తలు



సన్మానాలందుకున్న ప్రకాశం జిల్లా విశిష్ట రచయితలు

నుండి 20 మంది ప్రముఖ కవులు కవితాగానం చేశారు. సమకాలీన సామాజిక సంఘటనలతో పాటు పుస్తకం, ప్రేమ, మానవతా విలువలు, వలస జీవితం, వంటి కవితా వస్తువుల్ని అద్భుతంగా కవిత్వీకరించి ప్రేక్షకుల కరతాళ ధ్వనులందుకున్నారు. ఈ సందర్భంగా తెలుగు భాషా, సాహిత్య వికాసాలకు విశేష కృషి చేసిన ప్రకాశం జిల్లా సీనియర్ కవులు ఈమని దయానంద, నాగళ్ళ ఏలియా, పెద్దిభొట్ల సుబ్బరామయ్య, కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు (మహాస్వప్న), నరాల చిన చెన్నారెడ్డి, డా॥మండువ నరసింహారావు, గాడేపల్లి సీతారామమూర్తిలను స్వర్ణోత్సవ వేదికపై ఘనంగా సత్కరించారు.

అనంతరం జరిగిన ముగింపు ఉత్సవాలకు ప్ర.ర.సం అధ్యక్షులు బి.హనుమారెడ్డి అధ్యక్షత వహించారు. ఈ సభలో మహా సహస్రావధాని' డా॥గరికపాటి నరసింహారావు మహోపన్యాసం ప్రేక్షకులను ఆలోచింపజేసింది. ప్ర.ర.సం. కార్యదర్శి పొన్నూరి వెంకట శ్రీనివాసులును, సభలు విజయవంతం కావడానికి విశేష కృషి చేసిన ప్ర.ర.సం కోశాధికారి వై.కొండారెడ్డి, ప్ర.ర.సం. కార్యవర్గ సభ్యులను అందరూ అభినందించారు. సంక్రాంతికి ముందే సాహితీ సంక్రాంతిని నిర్వహించి స్వర్ణోత్సవాలతో ప్రకాశం జిల్లా ప్రతిష్టను, గౌరవాన్ని పెంచిన ప్ర.ర.సం.సారథి హనుమారెడ్డి కృషిని ముక్తకంఠంతో అందరూ అభినందించారు.

రచయిత ఫోన్ : 98480 39080

14 ఏళ్ళపాప రాసిన కథ

# దైవం మానవ రూపేణా...

తెడెల కుసుమస్వాయి సుందరీ రాణి



**తూర్పున సూర్యుడు మెల్లగా ఉదయిస్తున్నాడు. అప్పుడే తెల తెలవారుతోంది. భానుడ్ని చూసిన చీకటి మెల్లగా అంతర్థాన మయిపోతోంది.**

పక్షులన్నీ నిద్ర లేచాయి. కిలకిల రావాలతో పుష్ప ఫల సంపదతో అక్కడున్న అన్ని చెట్లకంటే ఒక తరువు ప్రత్యేకంగా కానవస్తోంది. రెండు పక్షులు ఆశగా వాటి గుడ్ల వంక చూస్తు న్నాయి. మెల్లగా గుడ్డుపగిలి పిల్ల బయటకు వస్తోంది. చిన్ని చిన్ని లేలేత రెక్కలు, బుల్లి ముక్కు, చిన్ని కళ్ళు, కాళ్ళు చూస్తుంటే మనసు ఆనందంలో తేలిపోతుంది తల్లి పక్షి మనసు.

పిల్లల్ని చూసిన తండ్రికి బాధ్యత గుర్తుకొచ్చింది. పిల్లల్ని తనివి తీరా చూసుకొని ఆహారం తేవడం కోసం ఎగిరిపోయింది. పిల్లల్ని చూసుకుని మురిసిపోతోంది తల్లి పక్షి. తండ్రి పక్షి వచ్చిన తరువాత ఆహారాన్ని ఆనందంగా పిల్లలకు పెట్టింది. తోటమాలి మనుమరాలు ఆతృత నేడు తీరింది.

తల్లి పక్షి, తండ్రి పక్షి ఎప్పుడెప్పుడు పిల్లల్ని చూద్దామా అని ఎదురు చూస్తున్నట్టే తోటమాలి మనుమరాలు కూడా ఎదురుచూసింది. ఆ తరుణం నేడాసన్నమైంది. ఆ అమ్మాయి ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బ యింది.

అందరూ ఆనందంగా ఉన్నారు. పిల్లపక్షులకు మెల్లమెల్లగా అన్ని విషయాలు నేర్పుతున్నాయి పెద్ద పక్షులు. ఇంతలో పిడుగులాంటి వార్త. ఆహారం కోసం వెళ్ళిన తండ్రి పక్షి, తాను దారిలో కాంట్రాక్టర్లు మాట్లాడుకోవడం విన్నానని, ఇంకొన్ని రోజులలో ఈ తోట మొత్తాన్ని నరికేసి, ఇక్కడ ఒక కర్మాగారాన్ని నెలకొల్పుతున్నారని వాపోయింది. అది విన్న తల్లిపక్షి ముఖంలో వెన్నెల రేఖలు వెంటనే చీకటి ఛాయలుగా మారిపోయాయి.

తను ఇప్పటివరకు ఆ చెట్టుతో పెంచుకున్న అనుబంధాన్ని తెంచు కోవాల్సి వస్తుందేమోనన్న బాధ ఇంకా అప్పుడప్పుడే రెక్కలు మొలు స్తున్న పిల్లలతో ఈ సమయంలో ఎక్కడికి వెళ్ళగలం? ఎలా వెళ్ళగలం? అనే ప్రశ్నలు తల్లిపక్షి వేదనకు కారణమయ్యాయి. తండ్రిపక్షి ఈ విషయాన్ని మిగిలిన పక్షులకు కూడా చెప్పడానికి వెళ్ళింది. అందరూ సమావేశమయ్యారు.

వృద్ధ పక్షులు మాట్లాడుకున్నాయి.

"ఆ మానవ దానవుల ధనదాహానికి మనలాంటి అల్పప్రాణులు బలౌతున్నాయి. పర్యావరణ కాలుష్యానికి కారణమయ్యే కర్మాగారాలను నెలకొల్పటానికి పచ్చని ప్రకృతిని పాడు చేస్తున్నారు. మనలాంటి పక్షులకు మరెన్నో జీవులకు ఆవాసాన్ని లేకుండా చేస్తున్నారు. వీరి

## పుస్తక సమీక్ష



# తాంగ్డి

(బంజారా సాంస్కృతిక సమాలోచనం)

డా॥సూర్యా ధనుంజయ్ వ్రాసిన తాంగ్డి వ్యాస సంపుటి బంజారాల సంస్కృతిని సమగ్రంగా తెలుపుతుంది. మొగలుల దండయాత్రలప్పుడు రాజస్థాన్‌లోని రాజ కుటుంబాల స్త్రీలకు రక్షణ లేనందున, వారు అడవుల్లో తిరిగారనీ ఆత్మరక్షణలో భాగంగా వాళ్ళని చూసి భయపడేవిధంగా వేషధారణ అవలంబించినట్టు తెలిసిన విషయమైనా, చారిత్రకంగా వారు యూరప్ ఖండంలోని సంచార జీవనం చేసే రోమనులనీ, ఆఫ్ఘనిస్తాన్ గుండా ప్రయాణం చేసి భారతదేశంలోని ఎడారి ప్రాంతమైన రాజస్థాన్ చేరుకున్నారనే విషయం కొత్తగా అనిపించింది. సంచార జీవులుగా, గుంపులుగా జీవనం సాగించే బంజారాల సంస్కృతి మాత్రం నిలకడగా ఉంటుంది. ఆధునిక కాలానికి తెలంగాణా ప్రాంతంలో బంజారా తెగలు వ్యవసాయ రంగంలో స్థిరపడటంతో నేటికీ తెలంగాణాలో వెన్నల రాత్రి చేసుకునే ఆటపాటల ఆనందహేల ఐన 'హోలీ' పండుగ, 'నారు'ను పూజించే 'బతకమ్మ తీజ్'లు గొప్ప పండుగలుగా తెలంగాణ ప్రజలందరూ అధికారికంగా జరుపుకోగలుగుతున్నారని ఈ పుస్తకం తెలియజేస్తుంది.

సంచార జీవులైన బంజారాల కుటుంబ నిర్మాణ వ్యవస్థలో జీవన విధానానికి 'తాంగ్డి' పునాది వంటిది. షాజహాను సైన్యానికి వస్తు సామగ్రి రవాణా వ్యవస్థలో ఉపయోగించుకుని, అభినందనగా ఇచ్చిన నాటి 'బంజారా గద్ద' చరిత్రలో వీరి శక్తి సామర్థ్యాలు ప్రతిఫలిస్తూనే ఉంటాయి. వ్యవస్థలోని ఆర్థిక వెసులుబాటు సంచార జీవనంలో ఉండకపోవటంతోపాటు మాతృభాషలో విద్యాబోధన లేకపోవటం వారి వెనుకబాటు తనానికి కారణం. బంజారాల భాషకు తప్పనిసరిగా లిపి తయారు కావాలి. అప్పుడే అంతర్జాలంలోను సాంకేతిక భాషా స్థాయిని చేరుకోగలుగుతుందని అర్థం అవుతుంది. అందుకే అమ్మనుడి బడి చదువు వల్ల అమ్మ ఒడిలో నుండి భద్రంగా ప్రపంచాన్ని చూడ గలుగుతుందని, మాతృభాషలో బోధన గిరిజనాభివృద్ధికి గీటురాయి వంటిదని రచయిత్రి భావించారు.

వివిధ వేదికలపై సమర్పించిన పత్రాల (14 తెలుగు, 2 ఇంగ్లీషు) వ్యాస సంపుటిలో బంజారాల సంస్కృతిని ప్రపంచానికి ఎఱుక చేశారు. అందరూ చదవదగ్గ పుస్తకం

రచయిత డా॥సూర్యా ధనుంజయ్, వెల:రు. 150/-లు. ప్రతులకు రచయిత, 12-5-55/1/టి-2, విజయపురి, తార్నాక, సికిందరా బాదు-500 007. ఫోన్ : 040-27015930 మరియు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ అన్ని అంగళ్ళు.

**-జె. కనకదుర్గ,**

సెల్ : 94911 40299

---

క్రూర కార్యాచరణ మన బ్రతుకులకు గొడ్డలిపెట్టులా తయారయింది. అయితే మనమేం చేయగలం? అల్పప్రాణులం. ఈ ప్రదేశాన్ని వదిలి పెట్టి కొత్త ఆవాసాన్ని వెతుక్కోక తప్పదు కదా! అందరూ వేరేచోటికి పయనమవ్వండంటూ" తమ నిర్ణయాన్ని తేల్చి చెప్పేశాయి.

చేసేదేమీలేక తల్లిపక్షి, తండ్రిపక్షి విచారంగా ఇంటికొచ్చేశాయి. వాటి మదినిండా వారి పిల్లల ముద్దుమోములే. ఎగరడం రాని వారిని ఎలా తీసుకువెళ్ళడం..వారి ఆవేదనకు అంతులేకుండా పోయింది. ఏం చేయాలన్న ప్రశ్న వారి మెదడును తొలుస్తోంది. ఏమీ చేయలేని నిస్సహాయులు. ఆ తోటలోని పక్షులన్నీ ఒక్కొక్కటిగా వలస వెళ్ళిపోతు న్నాయి. కానీ రెక్కలు రాని పిల్లల్ని వదలలేక పక్షులు వెళ్ళలేక మధన పడుతున్నాయి.

రోజులు గడుస్తున్నాయి. చెట్లు నరకడం ప్రారంభమయింది. దాదాపు పక్షులేవీ లేవు. ఒక్కొక్క చెట్టు నేలమీద రాలిపడుతుంటే పక్షుల గుండెల్లో ఆవేదన అంచులు దాటుతుంది. ఏం చేయాలో తెలియని దిక్కుతోచని పరిస్థితి, అయోమయం వారి ముఖాలలో ప్రస్ఫు టంగా కనిపిస్తున్నాయి.

మనుషుల క్రూరకార్యాచరణ వారి బ్రతుకులను వారి వారి పిల్లల బ్రతుకులను చిదిమేయబోతుందన్న నిజాన్ని జీర్ణించుకోలేకపోతు న్నాయి. గొడ్డలి వారి చెట్టు మీద కూడా పడింది. ఒక్కొక్క వేటు చెట్టు మీద పడుతుంటే, పక్షి గుండె మీద మానసికంగా పడుతోంది. చెట్టు నేలకూలింది. అదృష్టవశాత్తూ గూడు ఒత్తుగా ఉన్న ఆకులపై పడింది. కింద పడిన పిల్లల్ని ఒకచోటుకు చేరుస్తున్నాయి తల్లిపక్షి, తండ్రిపక్షి. ఇంతలో వారికి తెలియని ఏదో శబ్దం అంతకంతకు చేరువవుతుంది. వెనక్కి తిరిగి చూస్తే ఏదో యంత్రం వారికి దగ్గరవుతోంది.. మీద కొస్తోంది. మూలిగే నక్క మీద తాటికాయ పడ్డట్టయింది. పక్షులు రెండూ వాటి రెక్కల మధ్య పిల్లల్ని దాచాయి. గట్టిగా కళ్ళు మూసు కున్నాయి. ప్రాణాలు పోయే సమయంలో అభయహస్తం చేయి అందించినట్టయింది. ఒక చేయి గూడును వెనక్కి లాగింది. పక్షులు బ్రతికిపోయాయి. ఊపిరి పీల్చుకున్నాయి. మనుషులకు ప్రాణాలు తీయడమే కాదు, పోయడం కూడా తెలుసునని తెలుసుకున్నాయి. ప్రతి మానవ హృదయం బండరాయి కాదని, వెన్నలాంటి మనసులు కూడా ఉన్నాయని, ఆవాసాన్ని కోల్పోయేలా చేసిన మనుషులలో జాలితో తమ ప్రాణాలు కాపాడిన మనిషి కూడా ఉందని తెలుసుకొని ఎంతో కృతజ్ఞతా పూర్వకంగా ఆపన్నహస్తం అందించిన తోటమాలి మనుమరాలి వంక చూశాయి. ఆ తరువాత వాటి ఆవాసాన్ని ఒక సురక్షిత ప్రదేశానికి మార్చింది తోటమాలి మనుమరాలు. 'ఏ దిక్కూ లేనివారికి దేవుడే దిక్కు'.. ఏ దిక్కూలేని తమని కాపాడిన ఆ తోటమాలి మనుమరాలే తమ దైవమని భావించాయి ఆ పక్షి జంట. ❋

*ఈ కథను వ్రాసిన 14 ఏళ్ళ పాప తాడాల కుసుమ సాయి సుందరీ రాణి తూ.గో.జిల్లా కపిలేశ్వరపురం మండలంలోని మాచర గ్రామంలో జిల్లా ప్రజాపరిషత్ ఉన్నత పాఠశాలలో 9వ తరగతి చదువుతోంది. జనవరి 23, 24 తేదీలలో కాకినాడలో 'క్రియ' స్వచ్ఛంద సంస్థ వారు పెద్ద ఎత్తున నిర్వ హించిన బాలల పండుగలో కథల రచన పోటీలో పాల్గొని వ్రాసింది. ఒక ప్రఖ్యాత రచయిత్రి, మరొక ప్రముఖ రచయిత న్యాయనిర్ణేతలుగా ఉండి ఈ కథను ఉత్తమకథగా ఎంపిక చేశారు. ఈ పాపకు గురువుగారు (టీచర్) శ్రీ విజయ్‌మోహన్, ఫోన్ : 90006 95844*

-దుగ్గిరాల రాజశేఖర్

# దేశభాషల పట్ల నాయకుల చిన్నచూపు-విధానలేమి

**భా**రతదేశం ఎన్నో భాషలకు నెలవు. శతాబ్దాల కాలంలో ఎందరో భారతీయ భాషలలో అత్యుత్తమ సాహిత్యాన్ని అందించారు. బ్రిటీషువారు మన దేశాన్ని 175 ఏళ్ళు పాలించారు. వారు మనపై ఆంగ్లభాషను, ఆంగ్లేయ విద్యావిధానాన్ని రుద్దారు. మనకి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మనదైన భాషలలో ఏదో ఒకదానిని జాతీయస్థాయిలో సంధాన భాషగా మలచుకోలేకపోయాం. విభిన్న భాషలవారు సంభాషించుకోవాలంటే ఆంగ్లాన్ని ఉపయోగిస్తున్నాం కానీ, భారతీయభాషలలో మాట్లాడుకోలేకపోతున్నాం. దేశంలో ఎవరితోనైనా ఆంగ్లంలో మాట్లాడగలగడం ఏదో ప్రగతి సాధించినట్లు మనం మురిసిపోతున్నామే కానీ, స్వాతంత్ర్యం వచ్చి 65 ఏళ్ళు గడిచినా ఏ ఒక్క భారతీయ భాషనూ జాతీయస్థాయిలో వికసింపజేసుకోలేకపోయాం.'ఆధునిక విజ్ఞాన యుగంలో భారతీయ భాషలు ఉపయోగపడవన్న' భావన మనలో పాతుకొనిపోవడమే దీనికి కారణం.

ఆధునికయుగంలో గ్రాంధికము, వ్యావహారిక పరంగానే కాకుండా విజ్ఞానశాస్త్ర పరంగా కూడా మన మేధ వికసింపజేసుకోవడం కోసం మన భాషలను వికసింపజేసుకోవాలి. ప్రపంచంలో ఎంతో ప్రాచీనమైనవి, మనోహరమైనవి అయిన భారతీయ భాషలు కేవలం కావ్య భాషలుగానే మిగిలిపోకుండా ఆధునిక వ్యవహారాలకు అనుగుణంగా వాటిని వికసింపజేసుకొని వాడుకలోకి తెచ్చుకోవాలి. ప్రపంచానికి మానవీయ విలువలను అందించిన మహోన్నతమైన సాహిత్యాన్ని నిక్షిప్తం చేసుకున్న భారతీయ భాషలు గత వైభవాలుగానే మిగిలిపోకుండా, భవిష్యత్తులో కూడా మహోన్నతంగా విలసిల్లేందుకు తగిన రీతిలో ఆధునీకీకరణ జరగాలి.

అమెరికా పూర్వ అధ్యక్షుడైన బుష్ అమెరికనులను హిందీ, అరబిక్ భాషలను నేర్చుకోమని ప్రోత్సాహపరిచాడు. ఎందుకంటే వారు భారతీయుల కాలగణనను అంచనా వేయలేక పోతున్నారు. వారి పిల్లలకు ప్రాథమికదశ నుండే ఈ భాషలను బోధించాలన్నాడు. కానీ ప్రపంచంలో తామే గొప్ప అన్న తలబిరుసుతనం వల్ల అమెరికన్లు ఈ భాషలను నేర్చుకోలేదు.

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మన భాషలకు బదులుగా సామాజిక జీవనంలోని ప్రతి రంగంలోనూ ఆంగ్లభాష ఆధిక్యత కొనసాగేందుకే ఆసక్తి చూపారు. ఆ సమయంలోనే మన రాజ్యాంగ రచన జరిగింది. వివిధ శాస్త్ర శాఖల సాంకేతిక పదాలను సృష్టించుటకు చాలా కృషి చేసిన డాక్టర్ రఘువీర్ ఈ విషయంలో ఎంతో మనస్తాపానికి గురయ్యారు. ఆయన గాంధీజీ వద్దకు పోయి "హిందీ దేశభాష కావాలి. ఎందుకంటే ఒక భాష కేవలం ఆలోచనలను పంచుకోవడానికే కాదు. అది జీవిత విలువలతో ముడిపడివున్నది. అంతేకాక భాషను అనేక విజ్ఞాన, సామాజిక శాస్త్రములకు కూడా ఉపయోగించవచ్చు" అన్నారు. గాంధీజీ "నేను బహుభాషావేత్తను కాను. నీవు సర్దార్ పటేల్‌తో కలిసి వెళ్ళి నెహ్రూను ఒప్పించు" అన్నాడు. అయితే రఘువీర్ ప్రయత్నాలేవీ ఫలించలేదు. **భారతీయ భాషల పట్ల నాయకులలోని ఉదాసీన వైఖరి కారణంగా మనదైన భాషను అనుసంధాన భాషగా రూపొందించుకోలేకపోయాం.**

ఈ సందర్భంగా మనం టర్కీ ఉదంతాన్ని గుర్తు చేసుకోవాలి. మొదటి ప్రపంచ యుద్ధం తరువాత టర్కీ ఖలీఫాని పదవీభ్రష్టుణ్ణి చేశారు. ముస్తఫా కమాల్ పాషా అనే టర్కీ యువకుడు పాలకుడయ్యాడు. అతడు తన దేశంలోని అధికారులను పిలిపించి "మన పరిపాలనా వ్యవస్థ ఏ భాషలో జరుగుతోంది?" అని అడిగాడు. వారు లాటిన్ భాషలో నని సమాధానం చెప్పారు. "ఈ వ్యవహారాలన్నీ టర్కీ భాషలోకి మార్చడానికి ఎంతకాలం పడుతుంది?" అని కమాల్ అడిగాడు. దానికి ఆ అధికారులు పది సంవత్సరాలు పడుతుందని బదులిచ్చారు. దానికి కమాల్ "పది సంవత్సరాలు కాదు, పది గంటలలో అన్ని పరిపాలనా వ్యవహారాలూ టర్కీ భాషలో మొదలు కావాలి" అని ఆదేశించాడు. వెంటనే అక్కడ టర్కీలో వ్యవహారాలూ మొదలయ్యాయి. మొదట్లో ఇబ్బందిగానే అనిపించినా తరువాత టర్కీ భాషలోనే అక్కడి వ్యవహారాలను కొనసాగించడం అలవాటయిపోయింది.

తరువాత కమాల్ పాషా తన దేశంలోని ముల్లాలను, మౌల్వీలను పిలిచి "మీరు ఏ భాషలో నమాజు చేస్తారు?" అని అడిగాడు. దానికి వారు "మేము అరబ్బీలో చేస్తాము" అని చెప్పారు. "దేవునికి ఒక్క అరబ్బీ భాషే వచ్చా? రేపటి నుండి టర్కీ భాషలోనే ప్రార్థన చేయండి" అని కమాల్ ఆదేశించాడు. దీనికి కొందరు మౌల్వీలు అయిష్టత చూపారు. వాళ్ళెవరో ముందుకి రండి అన్నాడు కమాల్. ఎవరూ బదులివ్వలేదు. అతడు చెప్పినదే బావుందని అందరూ అన్నారు. వెంటనే అక్కడ టర్కీభాషలో ప్రార్థనలు మొదలయ్యాయి.

దురదృష్టవశాత్తూ అలా గట్టి నిర్ణయాలు తీసుకునేవారు మనదేశంలో లేకపోయారు. మనం పరాయి భాషను మన రాజ్యభాషగా అంగీకరించాము. అది 15 సంవత్సరాల వరకే అన్నారు. అప్పుడు డా॥అంబేద్కర్ రాజ్యాంగానికి కేంద్రభాష గూర్చి ఒక రాజ్యాంగ సవరణను ప్రతిపాదించారు. అన్నీ వివరంగా చర్చించి హిందీ అభివృద్ధి పొందేందుకు అవసరమైన 15 సంవత్సరాలు ఆంగ్ల భాషను కొనసాగించాలనే అంశాన్ని దానిలో పొందుపరిచారు. దానితోపాటే సంస్కృతం రాజభాష కావాలనే సవరణను డా॥అంబేద్కర్ ప్రవేశపెట్టారు. హిందీ, తెలుగు మొదలైన వాటి వలె సంస్కృతం ఒక భాష కాదనీ, అది మన సంస్కృతి అనీ, అనాదియైన భార

తీయ జీవనానికి ప్రతిరూపమనీ ఆయన అన్నారు. నాటి విదేశీ వ్యవహారాల సహాయ మంత్రి డా॥బి.వి.కేస్కర్, శ్రీ నజరుద్దీన్ అహ్మద్ (పశ్చిమబెంగాల్), త్రిపుర, మణిపూర్, కూర్గ్, మద్రాస్ నుంచి ఆరుగురు అంబేద్కర్ ప్రతిపాదనని సమర్థించారు. భారత ప్రథమ రాష్ట్రపతి ఈ 15 సంవత్సరాల లోపల ఆంగ్లంతోపాటు సంస్కృతాన్ని కూడా కేంద్రీయ రాజభాషగా ఉపయోగించుకో వచ్చుననే అంశాన్ని పొందుపరిచారు. కానీ అది అంగీకరించబడలేదు. 15 సంవత్సరాల తరువాత హిందీని అధికార భాషగా చేయాలని అంగీకరించినప్పటికీ, మార్పు చేయవలసిన సమయం వచ్చినపుడు నాటి ప్రధాని నెహ్రూ, "హిందీని అన్ని రాష్ట్రాలవారూ అంగీకరించారా? అలా జరిగినప్పుడే మార్పు వీలవుతుంది" అని అన్నారు. అప్పటికే రూపు దిద్దుకున్న నాగాలాండ్‌లో ఆంగ్లాన్ని రాష్ట్ర భాషగా చేశారు. హిందీని దేశభాషగానూ, తక్కిన భాషలను ప్రాంతీయ భాషలు గాను ప్రకటించారు. కానీ తమిళనాట హిందీని వ్యతిరేకిస్తూ తమ భాషతోపాటు మరొక భాషగా ఆంగ్లాన్నే స్వీకరిస్తామని వారు పట్టుబట్టారు.

**నిజానికి అనాదిగా మనదేశంలో విలసిల్లిన భాషలన్నీ దేశభాషలే. అవి మన సంస్కృతిని పరిపుష్టం చేస్తూ, మన జాతి వికాసానికి దోహదం చేస్తూ వచ్చాయి. వాటిపట్ల మన నాయకులలో స్పష్టమైన, సమగ్రమైన దృక్పథం లేకపోవటం వల్లనే మన భాషలకు అథోగతి దాపురించింది. మన దేశభాషలన్నింటిపైన మనలో జాతీయ దృక్పథంతో కూడిన భావన నెలకొన్నప్పుడు మాత్రమే అవి పూర్ణవైభవాన్ని సంతరించు కుంటాయి.**

–రచయిత సెల్ : 80082 64690

కవిత

## గుండె దిటవుతో అలలపై నడవండి

నిశ్శబ్దం ఓ సంగీతం
నిశ్శబ్దం ఓ మంచు అల
నిశ్శబ్దం ఓ జీవన గీతం
నిశ్శబ్దంలో ఓ కేక వుంది
సముద్రం నర్మగర్భంగా మూలుగుతోంది
అలకీ అలకీ మధ్య ఒక వైరుధ్యం
ఆకాశం కడలిని ముద్దాడుతున్న ఓ సృజన
సుడిలో చిక్కుకున్న ఒక చిరుచేప
ఊపిరి ఆడక ఎగిరి దూకింది
మునక ఈత వేస్తున్న చేపలన్నీ
ఆంతరంగికంగా మాట్లాడుకొంటున్నాయి
వేటగానికి అందని ఓ ఆట
పడవమీదున్న జాలరి వేస్తున్న
ఈలపాటకు తలలూపుతున్న అలలు
చీకటి అలలమీద కాసేపు నిద్రించింది
ఆకాశంలో నక్షత్రాల జాతర
కడలి ఒడ్డున గవ్వల మొలతాడుతో
ఓ బుడ్డోడి చిందుల్లోను ఓ లయ తప్పని శ్రుతి
తడిసిన ఇసుకలో చారిత్రక ముద్రలు
ఒడ్డునే తిరిగి తిరిగి అలసిన ఓ పడవ
ఎన్నో కన్నీటి గాథలను వినిపిస్తుంది.
ఆ చెలియలి కట్టపైన ఓ గుడిసె
అందులో ఓ ముదుసలి
కర్ర లేకుండా నడుస్తూంది
సముద్రంలో వేటకని వెళ్ళిన కొడుకు
మళ్ళీ తిరిగిరాలేదు
కడలి 'జీవితాన్ని ఇచ్చింది, తీసుకొంది'
అని నిట్టూర్చింది
ఆ చలిమంట చుట్టూ కూర్చున్న
పిల్లల గుంపు మధ్యలో చలిగాచుకొంది
అవును! ముసలితనం కూడా ఓ శైశవమే!
బాల్యాన్ని గుర్తుపెట్టుకోని వాడు
భవితవ్యాన్నేమి గుర్తుపెట్టుకోగలడు
ఆమె బొటనవేలుతో తాటిముంజెను
జుర్రుతోంది
గోరుగుజ్జును తాటిడొప్పను నాకింది
మనుష్యులు లోభులవుతున్నారు
పెదాలు ఆడించి బతుకుతున్నారు
జీవితానికి ఆయువైన స్థైర్యాన్ని
పోగొట్టుకొంటున్నారు
నదులకు ఆనకట్టలు కడుతున్నారు
కోరికలకు హద్దులు లేవు
ఈత బొత్తిగా రాదు
సుడిగుండంలో మునక
అర్ధరాత్రిలో కూడా వారు సందడి చేస్తున్నారు
సూర్యోదయం వారికి లేదు
ఆ యువకుల ఎముకలు గుల్లబారుతున్నాయి
వెలుగులో చీకటి బతుకుతోంది
చీకటిలో వెలుగు కునుకు తీస్తూంది
ఆ పక్షులు ఆ కొలనుపై
అడుగులేస్తూ నడుస్తున్నాయి
ఆత్మవిశ్వాసం వాటినడకకు ప్రాణం
ఆ పక్షులు గుంపులుగా జీవిస్తున్నాయి
వాటి కనుల్లో నక్షత్రమండలాలున్నాయి
అవి వేటగాడికందనంత ఎత్తుకు
ఎగురుతున్నాయి
ఎల్లలను చెరిపేస్తున్నాయి
మబ్బులను వాహనాలుగా చేసుకొంటున్నాయి
ఆ చిలకలు చిగురాకులను మేసి
జీవిత సత్యాలను పలుకుతున్నాయి
ఆ గోరింటాకును చిదిమే కొద్దీ
ఆనందాన్ని చిమ్ముతోంది
ఆ తెల్లవారుజామున మెరిసే
ఒకే ఒక చుక్క
దిశానిర్దేశం చేస్తూంది
ఆ కొండపైకి ఎక్కుతున్న గొర్రెపిక్క
బలంగా వుంది
ఏ మత్తుమందులూ లేకుండానే
అది విజేత అవుతోంది
వధకు అందనంతకాలం అది విజేతే!
అవును! కడలి, పక్షి, గొర్రె
మనకు ఆత్మస్థైర్యాన్నిస్తున్నాయి
ఇతరుల వాహనం ఎక్కినంతకాలం
మీ గమ్యం సుదూరమవుతోంది!
మీ వాహనానికి మీరే సారథులు కండి!
మనుష్యులారా! ప్రేమను పెంచుకోండి!
చీకటిని వెలుగును అధ్యయనం చేయండి!
మనస్సును అర్థం చేయండి!
మెదడుకు పదును పెట్టండి!
విజేతలు కండి!
కడలి అలలలోని అగ్గిని పుక్కిలించండి!
నిప్పుకణికల్లోని వేడిసెగలను అందుకోండి!

**–డా॥కత్తి పద్మారావు,**
98497 41695

పర్యావరణం

-శ్రీ సంకేపల్లి నాగేంద్రశర్మ

# భూతాపాన్ని కొంతైనా తగ్గించడానికి ఒప్పందం కుదిరింది!

**భారత్**లో గత రెండేళ్ళ నుండి ఎల్‌నినో ఏర్పడి సముద్ర ఉష్ణోగ్రతలు పెరగడం వల్ల దక్షిణాదితోపాటు, ఉత్తరాదిలో వర్షాలు తగ్గిపోతున్నాయి. కావేరి, తుంగభద్ర, కృష్ణా, గోదావరి నదుల్లో వర్షాభావం కారణంగా నీటి ప్రవాహాలు చాలామటుకు తగ్గిపోయి, రిజర్వాయర్లన్నీ బోసిపోయాయి. బ్రహ్మపుత్ర, యమున, గంగానది వంటి హిమనదాలు వాతావరణ, పారిశ్రామిక కాలుష్యంతో నిండి రెండు తెలుగు రాష్ట్రాల్లో వ్యవసాయానికి తాగునీటికి కటకట ఏర్పడింది. తరచుగా వేయి కిలో మీటర్ల ఆంధ్ర కోస్తా ప్రాంతాల్లో సముద్రపు అలల అల్లకల్లోలాలు, అలల తాకిడులు సంభవిస్తున్నాయి. కరువుకాటకాలు వల్ల రైతులు, పేదలు, చేనేత పనుల వారి ఆత్మహత్యలు తారాస్థాయికి చేరుకున్నాయి. బ్యాంకు రుణమాఫీలు వంటి పథకాలను అమలు చేసినా, ప్రకృతి ప్రకోపానికి కరువు విలయతాండవానికి అన్నమో రామచంద్రా అన్న పరిస్థితి ఏర్పడింది. ఇటీవల చెన్నయ్‌లో పెనువరదలు సంభవించి, నాలుగు వందల మంది మృత్యువాత పడటంతోపాటు సుమారు లక్షకోట్ల రూపాయల భారీ నష్టం సంభవించింది. గత ఏడాది విశాఖలో హుద్ హుద్ తుఫాన్ వచ్చి భారీ ఆస్తి నష్టాన్ని కల్గించింది. బొంబాయిలో కుండపోత వర్షాలు పడ్డాయి. సుందర విశాఖ రూపురేఖల్ని ఈ తుఫాన్ దెబ్బ తీసింది. అరేబియా సముద్రం, బంగాళాఖాతాల్లో అగాధాలు ఏర్పడి, తుఫానులు ముంచుకురావడం, సునామీల వంటి ఉప్పెనలు రావడం కనిపిస్తున్న విషయమే. నేపాల్, ఆఫ్ఘనిస్తాన్, భూకంపాలు భారత్‌తోపాటు ఇతర సమీప పాక్‌ను కూడా కుదిపేసింది. కలకత్తా, ముంబై, ఢిల్లీ, విశాఖ, గుంటూరు, హైదరాబాద్, తిరుపతి, విజయవాడ వంటి నగరాలలో వాహన బంధన కాలుష్యం పెరిగి, చివరకు సుప్రీం కోర్టుతో సహా ఆయా న్యాయస్థానాలు జోక్యం చేసుకోవడం, కాలం చెల్లిన వాహనాలను సీల్ చేయడం, మితిమీరిన వాహనాల సంచారాలను సరి చేసి, సంఖ్యల వారీగా అదుపుచేయడానికి రోజు విడిచి రోజు అనుమతించడం వంటి చర్యలకై ఉపక్రమించింది.

**అభివృద్ధి, పర్యావరణ పరిరక్షణ దిశలో ప్రపంచదేశాలు**

అభివృద్ధి, పర్యావరణ పరిరక్షణ దిశలో ప్రపంచ దేశాలు సామూహికంగా, ఉమ్మడిగా కలిసి సాగాలని అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామాతోపాటు, భారత్ ప్రధాని నరేంద్రమోడి ఇటీవల డిసెంబరులో ప్యారిస్‌లో జరిగిన సదస్సుల్లో ఉద్ఘాటించారు. ప్రస్తుతం వాతావరణ మార్పు పెనుముప్పుగా పరిణమించిందని, ప్రపంచానికి ఇదొక పెను సవాల్‌గా నిలిచిపోయిందని వీరిద్దరు అన్నారు. పేదరిక నిర్మూలనకు, అభివృద్ధికి ప్రాధాన్యం ఇస్తూనే బొగ్గుపులుసు వాయువు వంటి కర్బన ఉద్గారాల అదుపుకు చర్యలు తీసుకోవాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పారు. పెరిగిపోతున్న ఉగ్రవాదాన్ని, కాలుష్యాన్ని అదుపులోకి తేవాల్సి వుందని వివిధ ప్రపంచ దేశాధినేతలు ఈ సదస్సులో పిలుపునిచ్చారు. 21వ (కాన్ఫరెన్స్ ఆఫ్ పార్టీస్, కోప్) ప్రపంచ వాతావరణ సదస్సులో ఫ్రాన్స్ అధ్యక్షుడు హోలాండే, చైనా అధ్యక్షుడు క్సీజిన్‌సింగ్, రష్యా అధ్యక్షుడు వ్లాదిమన్ పుతిన్‌తో సహా 180 దేశాల నేతలు పాల్గొన్నారు.

ఉద్గారాల నియంత్రణకు అయ్యే భారాన్ని పేద దేశాలు ఎలా పంచుకోవాలి, అగ్రరాజ్యాలు ఈ దేశాలకు పరిహార సహాయాలు ఎలా ఉండాలి అనే అంశాలను ఎజెండాగా తీసుకుని చర్చించారు.

1997లో కుదిరిన ప్రోటోకాల్ కార్బన్ కాలుష్యాల విడుదలపై నియంత్రణ విధించింది. 2009లో కోఫెన్‌హాగ్‌లో జరిగిన 15వ కాప్ చర్చల్లో 2020 నాటికి కాలుష్య పరిమితులు సాధించేందుకు వర్ధమాన దేశాలకు పదివేల కోట్ల డాలర్ల సాయాన్ని సంపన్న దేశాలు అందించాలని తీర్మానించింది. ఈ తీర్మానాన్ని అమెరికా ఆమోదించలేదు సరికదా, సంతకాలు చేసిన ఇతర దేశాలు పట్టించుకోలేదు. మరోవైపు భారత్ లాంటి వర్ధమాన దేశాలు కర్బన ఉద్గారాల విడుదలపై ఎలాంటి ఆంక్షలూ విధించలేదు. గత రెండు దశాబ్దాల నుండి వాతావరణంలో కాలుష్యం పెరిగిపోవటానికి సంపన్నదేశాల అరాచకత్వాలే. అగ్రరాజ్యాల దురహంకార విధానాలే కారణం. 16వ శతాబ్దం నుండి పారిశ్రామికీకరణం, తదుపరి పెట్టుబడిదారీ వ్యవస్థలు, వ్యవసాయ రంగంలో పరిమితికి మించి కెమికల్స్ వినియోగం పెరగటం, రెండు ప్రపంచ యుద్ధాలు జరిగి భారీగా, ధన, జన వ్యయాలు జరగడం, అణ్వాయుధ అస్త్రాల ఉత్పత్తులు పెరగటం, సముద్ర, నదీ జలాలు కలుషితం కావడం, అడవులు, ఇసుక పర్రెలు తగ్గిపోవడం, పట్టణ వలసలు పెరగడం, గ్రామ వృత్తులు చితికిపోవడం, సహజ వనరుల దోపిడి, జనాభా నియంత్రణలు అదుపుతప్పడం, రోగాలు పెరిగి, ఆహార సమస్య వంటివి ఉత్పన్నం కావడం వాతావరణ సమస్యలతో ఒకదానినొకటి ముడిపడి పోయాయి.

19, 20 శతాబ్దాల్లో కాలుష్యం పెరిగిందని శాస్త్రవేత్తలు అంటున్నారు. కాలుష్య కారక పరిశ్రమలు భారీగా పెరిగి, విపరీతమైన కర్బన ఉద్గారాలను విడుదల చేయడం వల్ల ప్రకృతిలో బొగ్గు పులుసు వాయువు పెరిగి ఆక్సిజన్ ఉత్పత్తి తగ్గిపోయింది. దీనివల్ల భూ తాపం పెరిగిపోవడానికి ఆస్కారాలు ఏర్పడ్డాయి. ధృవాల మంచు వేగంగా కరగడాన్ని సముద్రమట్టాలు పెరగడాన్ని ఇవి అరికట్టలేవని అంటున్నారు. దీనితోపాటు అనేక పర్యావరణ హితచర్యలు పాటించాల్సి వుంటుందని అంటున్నారు. కరువు కాటకాలు, మంచినీటి కొరత, ఆహార సమస్యలు మళ్ళీ మళ్ళీ పునరావృతమవుతుంటాయని అంటున్నారు. భూతాపాన్ని రెండు సెల్సియస్ డిగ్రీలకు పరిమితం




చేసినా, సమస్య పూర్తిగా అదుపులోకి రాదని వాతావరణ వేత్తలు అంటున్నారు.

భూగోళం లోని భూతాపాన్ని కనీసంగా రెండు డిగ్రీల సెల్సీయస్ దిగువ వరకు తగ్గించడానికి, తద్వారా కర్బన ఉద్గారాలను (గ్రీన్ గ్యాసెస్ వాయువులు) అదుపుచేయడానికి, పర్యావరణ సమతుల్యతతో పాటు, వాతావరణ కాలుష్యం నివారణలో భాగంగా జరిపిన చర్చల్లో భారతదేశం పెద్దన్న పాత్రను పోషించి, చివరకు చారిత్రాత్మక ఒప్పందాన్ని ఆమోదింపజేసింది. చారిత్రాత్మక ఘట్టానికి తెరతీసినట్లయింది. గత రెండు దశాబ్దాల నుండి ఐక్యరాజ్యసమితి చేస్తున్న గ్లోబల్ వార్మింగ్ అదుపులో భాగంగా కర్బన్ ఉద్గారాలను తగ్గించడానికి చేస్తున్న కృషి కార్యక్రమం ఆచరణలోకి వచ్చినట్లయింది. ప్రపంచ వాతావరణ నియంత్రణపై డిసెంబరు 12న జరిగిన చారిత్రాత్మక ఒప్పందం ప్రపంచ దేశాల కీలక ఒప్పందాలతో, ఐక్యరాజ్యసమితి పర్యావరణ పరిరక్షణ సదస్సుల్లో మూలమలుపే. అగ్రరాజ్యాలను సుముఖత దిశగా ఒప్పింపజేయడం, భారత్ ఎదుగుతున్న తీరుకు అద్దం పట్టింది. నవంబరు 30 నుండి డిసెంబరు 11 వరకు 12 రోజులపాటు జరిగిన ఈ సదస్సులో ముసాయిదా ఒప్పందం కొరకు, మెజార్టీ దేశాలను ఒప్పంపజేయడానికి ఒక రోజును ఆఖరుక్షణంలో పొడిగించారు. కర్బన రహిత ప్రపంచం దిశగా ప్రపంచ దేశాలు పయనిస్తున్నాయనడానికి, ఈ ప్యారిస్ సదస్సులో తొలి విజయం సాధించడానికి, పర్యావరణ ఉద్యమకారులు తమ సంతోషాన్ని వ్యక్తం చేస్తున్నారు. ఈ ప్రారంభ సదస్సులో పాల్గొనడానికి నవంబరు 29న ఒక్కరోజు ముందు ప్యారిస్ చేరుకున్న భారత్ ప్రధాని నరేంద్రమోడి భూతాప నియంత్రణ చర్యలు తీసుకోవాల్సిన బాధ్యత అందరిపై వుందని ట్విట్టర్‌లో ట్వీట్ చేశారు. 2009లో జరిగిన కోపెన్‌హాగ్ సదస్సులో వర్థమాన దేశాలకు 2020 నాటికి వంద బిలియన్ డాలర్ల ఆర్థిక సాయాన్ని అందజేయాలన్న హామీని సంపన్న దేశాలు నిలుపుకునే దిశలో ఈ చర్చల్లో పురోగతి సాధించినట్లయిందని భావిస్తున్నారు.

ఈ ఒప్పందం సమగ్రంగా రాకపోయినా, వెనకడుగు వేయాల్సింది లేదని, ఈ ఒప్పందం వల్ల, ఆహార భద్రత, ప్రజారోగ్యం, పేదరిక నిర్మూలన, శాంతి సుస్థిరతల సాధనలకు బాటలు వేస్తాయని, పక్కాగా పునాదులు పడినట్లేనని పర్యావరణ ఉద్యమనేతలు అంటున్నారు. ఐరాస ప్ర.కా.బాన్‌కీ మాటల్లో– పర్యావరణ విధ్వంసం పట్ల కనపడుతున్న ఆందోళనతోపాటు జరుగుతున్న మానవ వినాశనాన్ని ఆపాలని, ప్రపంచదేశాల్లో కాలుష్య మేఘాలు తొలగాలన్న ఆకాంక్ష, ఆశాభావం ఈ సదస్సు ద్వారా కనిపించాయి. ప్రపంచంలోని కోట్ల మంది గమనిస్తున్న ఈ పర్యావరణ సదస్సు చర్చల్లో శాంతిపర్వానికి తెరలేచిందని, ఇక వర్థమాన దేశాలు తమ క్రియాశీల పాత్రను పోషించాలని కోరారు.

కర్బన ఉద్గారాల విడుదలలో 24 శాతంతో చైనాముందు నిలిస్తే, 12 శాతంతో అమెరికా సంయుక్త రాష్ట్రాలు రెండవస్థానంలో వున్నాయి. ఐరోపా దేశాలు 9 శాతం, భారత్, బ్రెజిల్ ఆరు శాతం, రష్యా ఐదు శాతం, జపాన్ 3 శాతంలో వున్నాయి. ఉద్గారాల విడుదల అదుపులో 2030 నాటికి లక్ష్యాలను చేరుకుంటామని చైనా ప్రకటించగా, భారత్ సగం లక్ష్యాలను చేరుకుంటామని ప్రకటించింది. వాతావరణంలో ఉష్ణోగ్రత మరో రెండు డిగ్రీల సెల్సీయస్ పెరిగితే పర్వత శ్రేణుల్లోని హిమం కరిగిపోతుందని, మంచు కరిగిన ప్రవాహాలు పెరిగి తద్వారా సముద్రమట్టాలు పెరిగిపోతాయని శాస్త్రవేత్తలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ఎల్‌నినో వంటి సముద్ర ఉష్ణోగ్రతలు, ఓజోన్ పొర పలుచబడిపోవడం, కరువు కాటకాల సమస్యలు పెరిగి, త్రాగు నీటి కొరత ఏర్పడడం వంటి జటిల సమస్యలతో పోరాడక తప్పదని పర్యావరణ శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. ఆహార ధాన్యాల కొరతతో వనరుల సమస్య సంక్లిష్టమవుతుంది. సామూహిక వలసలతో సమస్యల పరిష్కారాలలో ప్రభుత్వాలు విఫలమవుతాయని, పర్యావరణ ఒప్పందం అమలుపై ఎప్పటికప్పుడు ఏకాభిప్రాయం వుండాలని ఎక్కువ దేశాలు వాదిస్తున్నాయి.

### ఒప్పందం పట్ల భారత్ హర్షం

వాతావరణ నియంత్రణపై తొలిసారిగా పాదులు పడడం పట్ల భారత్ తన హర్షాన్ని ప్రకటించింది. ఈ ప్రతిష్ఠాత్మకమైన ఒప్పందం భారత్ లాంటి అభివృద్ధి చెందుతున్న దేశాలపట్ల సమతుల్యంగా వుందని ఈ చర్చలకు ప్యారిస్‌లో కీలక సారధ్యం వహించిన కేంద్ర పర్యావరణ శాఖామంత్రి ప్రకాశ్ జవదేకర్ వ్యాఖ్యానించారు. ఉద్గారాల తగ్గింపులో, ఒప్పందం అమలులో సంపన్నదేశాలు ఇతర దేశాలకు ఆదర్శంగా నిలవాలని, అమలులో చిత్తశుద్ధి ప్రదర్శించాల్సి వుంటుందని వర్థమాన దేశాలు డిమాండ్ చేస్తున్నాయి.

### అమరావతి రాజధాని నిర్మాణంపై గ్రీన్ ట్రిబ్యునల్ విచారణ

ఆంధ్రప్రదేశ్ నూతన రాజధాని అమరావతి నిర్మాణంపై పర్యావరణ వేత్తల నుండి అభ్యంతరాలు వ్యక్తమయ్యాయి. ఈ మేరకు జాతీయ వాతావరణ ట్రిబ్యునల్‌కు వీరు పిటిషన్ దాఖలు చేయగా ప్రస్తుతం కేసు విచారణలో వుంది. సుమారు 30 వేలకు పైగా పంట భూములను సేకరించి నూతన రాజధాని నిర్మాణం చేయడం వల్ల పర్యావరణం, సమతుల్యత దెబ్బతింటాయని పర్యావరణ వేత్తలు తమ అభ్యంతరాల్ని లేవదీశారు.

–రచయిత సెల్ : 94417 97650

## సందేహాలు- సమాధానాలు

ప్రశ్న : గోవులొస్తున్నాయి జాగ్రత్త (జనవరి 2016 సంచిక)లో రచయిత వ్రాసినట్లు వివేకానందుడు బీఫ్ తినమని ఎప్పుడు, ఏ సందర్భంలో చెప్పాడో, సావర్కార్ గోపూజను ఎప్పుడు ఏ సందర్భంలో పరిహాసం చేశాడో స్పష్టం చేయాలి. అలాగే కంచి పరమాచార్యుల విషయం కూడా.

**-ఎం.వి.ఎస్.ప్రసాద్,** హైదరాబాద్

**రచయిత రాణి శివశంకరశర్మ సమాధానం :**

1. బీఫ్, భగవద్గీతలపై వివేకానంద అభిప్రాయం :
SWAMI VIVEKANANDA : A REASSESMENT-NARASIMHA PRASAD SIL-ASSOCIATED UNIVERSITY PRESS 1997 (పేజీ-53)
2. గోపూజకి వ్యతిరేకంగా సావర్కార్ మాటలు :
HINDUTVA : EXPLORING THE IDEA OF HINDU NATIONALISM -JYOTHIRMAYA SARMA (పేజీ-180) Pengvin Books 2011.
(ఈ రెండు ఆధారాలూ ఇంటర్నెట్‌లో ఉచితంగా లభిస్తాయి)
3. మాంసాహారం గురించి పరమాచార్య :

మన మతంలో బ్రాహ్మణులు తప్ప మిగిలిన వారికి మాంసభోజనం నిషిద్ధం కాదు (187వ పేజీ)

మాంసాహారం పూర్వులు తిన్నారు గదా అని నేటి బ్రాహ్మణులు తినకూడదు. ఇక బ్రాహ్మణేతరులు తమ కులాచారాన్ని వెంటనే మాననవసరం లేదు కూడా (197వ పేజీ)

క్షత్రియునికి మాంసాహారం ధర్మమే. అది అతని ఆధ్యాత్మిక ప్రగతికి ఆటంకం కాదు. (155వ పేజీ)

బ్రాహ్మణులకున్న నియమాలు ఇతరులకు లేవు. మద్యం, మాంసభోజనం, క్షత్రియులు మొదలైన వారికి ఉన్నాయి (188వ పేజీ)

(సనాతన ధర్మంలో సంఘసేవ-మహా విద్యాపీఠం, హైదరాబాద్ 2012)

## భాషారాష్ట్రాల ఏర్పాటు వల్ల నష్టం

స్వాతంత్ర్య పూర్వపు అవిభాజ్య భారతదేశంలో లాహోర్ తెలుగు తమ్ముళ్ళతో ఆచార్య తిరుమల రామచంద్ర గారి అనుభవాన్ని, అనుబంధాన్ని మీకు పంపియున్నాను. ఇప్పుడు ఢాకాలో ఉన్నవారి కంటే వారి అవస్థ భిన్నముగా ఉండకపోవచ్చు. ఇతర దేశాలలో కాదు. కొందరి అభిప్రాయము ప్రకారం భాషా ప్రాతిపదికమైన రాష్ట్రాల విభజన-భారత రాజ్యాంగం గుర్తించిన భాషా అల్ప సంఖ్యాకులకు విపరీతమైన నష్టం కలిగించినది. కొంతవరకు నిజమే కాదా?

**-కురాడి చంద్రశేఖర కల్కూర,** కర్నూలు

## సవరణలు

0 జనవరి సంచిక 39వ పుటలో- "చింతల గోపాలరావు గారు 2015 డిసెంబరు 7న" అనే దానికి బదులు "1969 డిసెంబరు 7న" అని ముద్రణలో వచ్చింది.

0 29వ పుటలో మూడవ వరుస చివరలో 'తురక మంత్రులు చదివి' అని వుంది. దానిని 'తురక మంత్రాలు చదివి' అని సరి దిద్దుకోవాలి.

0 29వ పుటలో 4వ పేరాలో 'మ్లేచ్ఛులకీ' తప్పు. 'మ్లేచ్ఛులకీ' ఒప్పు.

0 అదే పేరాలో 'పరిశోశకురాలు' తప్పు. 'పరిశోధకురాలు' ఒప్పు.

0 30వ పుటలో మూడవ వరుసలో మూడవ పేరా చివరిలో 'వైదిక మతమని' అని వుంది. అది తప్పు. 'వైదిక ఋతమని' అని ఉండాలి.

0 5వ పుట-డా॥కె.వి.రమణాచారి గారు తి.తి.దే. కార్యనిర్వహణాధికారి (ఇ.ఒ)గా చేశారు. కమిషనర్‌గా కాదు.

0 12వ పుట : శశిదేశ్ పాండే - తప్పు, శశి దేశ్పాండే- ఒప్పు. ఉపమాన్య చటర్జీ-తప్పు, ఉపమన్యు చటర్జీ- ఒప్పు.

0 13వ పుట : అశుతోష్- తప్పు, ఆశుతోష్- ఒప్పు. చివరి పేరాలో- పుస్తక మహోత్సవం, పుస్తకోత్సవం- తప్పు సాహిత్య మహోత్సవం, సాహిత్యోత్సవం - ఒప్పు.

0 30వ పుట- 6వ పేరాలో - వివక్షత - తప్పు, వివక్ష- ఒప్పు. ఈ పొరపాట్లకు చింతిస్తున్నాము. -సం.



## తెలుగుజాతి ట్రస్టుకు విరాళం



**శ్రీ త్రిపురమల్లు వెంకటరమణ,** తెనాలి/హైదరాబాదు, ఫోన్ : 94400 73636

శ్రీ త్రిపురమల్లు వెంకటరమణ హిందూస్థాన్ ఏరోనాటిక్స్‌లో సీనియర్ మేనేజర్‌గా పనిచేస్తున్నారు. వీరి తాతగారు కీ.శే.త్రిపురమల్లు నరసింహ్వాంగారు అజాతశత్రువుగా తెనాలి పట్టణ శ్రేయోభిలాషిగా విశిష్టజీవితం గడపిన వ్యక్తి. తండ్రి శ్రీ త్రిపురమల్లు పున్నారావు కెనరాబ్యాంకు అధికారిగా పనిచేసి హైదరాబాదులో స్థిరపడ్డారు. నాయనమ్మ శ్రీమతి అరవింద అన్నపూర్ణ, అమ్మ శ్రీమతి దుర్గాప్రమీల, భార్య రోహిణి. వీరి కుటుంబమంతా తొలినుండి జాతీయవాదులు. నడుస్తున్న చరిత్ర/ అమ్మనుడికి అభిమాన పాఠకులు. తెలుగుజాతి ట్రస్టు కోసం ఎంతో అభిమానంతో ప్రోత్సాహక విరాళం రు.10,000/-లు అందజేశారు.

పాండెనాడు కథ

# తలుపు

కి. రాజనారాయణన్ (కీరా)

తెలుగుసేత: స. వెం. రమేశ్



**తలుపు ఆట మునుగొనింది.**

**పక్కింటి పిన్నాండ్లునూ అలబలగా వచ్చి కలుసుకొనిరి.**

**“అందురూ చిర్రాకును తీసుకోండ” అనినాడు శీనివాసుడు. తోడనే “నాకొక ఆకు, నీకొక ఆకు” అంటా దొమ్ములాడిరి.**

**“ఏ ఊరికి కావాల? ఏయ్ ఈ మాదిరి నెట్టి తోసితే ఎట్ట? ఇట్టయితే నేను ఆటకే రాను”**

“లేదు, లేదు, నెట్టలేదు”

“సరి, ఏ ఊరికి చిర్రాకు కావాల?”

బిడ్డలు ఒకరి మూతిని ఒకరు చూసికొనిరి, ఒకడు “తిన్నెవెల్లికి” అని చెప్పినాడు, “తిన్నెవెల్లికి తిన్నెవెల్లికి” అని కూతలు పెట్టి చెప్పినారు అందురునూ.

లచ్చిమి ఒక పాతతోడ తలువును తుడుచుకొని ఉండాది. శీనివాసుడు ఉత్త చెయ్యితోడ చిర్రాకుని చింపి ఇచ్చినాక, తలువుని పట్టి తొత్తుకొనిరి. కొందరు తలువును ముందుకూ వెనకకూ ఆడించిరి. తనమిందకు ఎక్కి నిండి నిలిచిన బిడ్డలను, బరువయిన ఆ పెద్ద తలువు విరవిరగా ఆడించి మగిలించింది. “తిన్నెవెల్లి వచ్చేసింది” అనినాడు శీనివాసుడు. అందరూ దిగేసిరి. తలువును నెట్టిన వాండ్లు చిర్రాకుని తీసుకొనిరి. దిగినవాండ్లు నెట్టికొని ఉండారు. మళ్లా తలువాట తొడరింది.

❊ ❊ ❊

అది పాతతరి గారఇల్లు. పెద ఒంటిరెక్క తలువును పెట్టి ఉండేది. దానిలో ఉండేవాండ్లు మునపు వసతిగా బతికినవాండ్లే. ఇప్పుడు బాగా నుజ్జిపోయిరి. ఆ ఇంటిలోగా ఉండే ఆడబిడ్డల్లో పెద్దదానికి ఎనిమిది ఏండ్లు ఉండును. ఇంకొకటి సంకబిడ్డ.

అమ్మ, చేనులోకి పనికి పోవును. అబ్బ, మణిముత్తారుకు కూలి పని కోసరం పోయి ఉండాడు. లచ్చిమీ శీనివాసుడూ చేరి, అమ్మ చేనునుండి వచ్చేవరకూ పసిబిడ్డను పెట్టుకొని, తలువాటను ఆడికొని ఉండుతురు.

❊ ❊ ❊

ఒకనాడు ఒక నిప్పుపెట్టి అట్టబొమ్మను తెరువులో చూసి ఎత్తుకొనింది లచ్చిమి. బొమ్మలో ఒక కుక్క ఉండాది. మురికిగా ఉండిన దాన్నించి బొమ్మమింద ఎంగిలిని ఉమిసి తన పావడతోడ తుడిచింది. దాన్నించి కొన్ని తావుల్లోనే ఉండిన మురికి బొమ్మంతా పరుచుకొనింది. కానీ లచ్చిమికి నిండు తనివి, బొమ్మ తోమమయింది కదా అని.

బొమ్మను మొకానికి నేరుగా పెట్టుకొని, తలను కొంచెం వంచి చూసింది. అవతల ఈపక్కకు వంచి చూసింది. నవ్వుకొనింది. కన పడిన తావున ఎవురయినా ఉండారా అని చుట్టుముట్టూ చూసింది. ఎవురూలేరు. ఇంటితట్టుకు విరవిరగా గంతులు వేసుకొని పోయింది, మగిలిని తట్టుకోలేక.

లచ్చిమి ఇంటికి వచ్చేవేళకు, శీనివాసుడు గడ్డాన్ని చేతికి దాపుకొని వాకిలి పడికట్టు మింద కుచుండి ఉండాడు. వాండిని చూసిన తోడనే బొమ్మను వెనకదక్క మరుగుచేసికొని "రేయ్ నేనేమి తెచ్చితినో చెప్పు చూడచ్చు" అనింది.

"ఏమి తెచ్చితివో నాకు తెలవదు"

"చెప్పేమి చూడచ్చు"

"నాకు తెలవదు"

లచ్చిమి ఎడంగా నిలిచే బొమ్మను చూపింది.

"అక్కా, అక్కా, నాకు ఈవా" అని అడుగుకొనే దిగివచ్చినాడు శీనివాసుడు. 'మాలదు' అన్నట్టుగా తలను అడ్డంగా ఊపి, బొమ్మను పైకెత్తి పట్టుకొనింది. శీనివాసుడు అక్కచుట్టూ చుట్టినాడు. "ఊహూఁ … అవదు. ఇయ్యను…. నేను ఎంతనో పాటుపడి తొడవి ఎత్తుకొని వచ్చితి తెలుసా?" అనింది.

"ఒకే ఒకసారి చూసేసి ఇచ్చేసుతును. అక్కా, అక్కా" అని గెంజినాడు.

"చూసేసి ఇచ్చేయాల"

"సరే"

"చింపకూడదు"

"సరే సరే"

శీనివాసుడు బొమ్మను తీసి చూసినాడు. మగిలితోడ వాండిమూతి వెలిగింది.

"రేయ్ లోగాకు పోయి కొంచెం కంబుకూటిని కొనిరా, ఈ బొమ్మను మన తలువుకు కరిపించాల" అనింది.

"అవు అవు" అని ఇంటిలోగాకు పరిగెత్తినాడు శీనివాసుడు.

ఇద్దరూ చేరి తలువుకు కరిపించిరి. బొమ్మను చూసి మగిలితోడ చేతుల్ని తట్టికొని దూకిరి. దానిని విని పక్కింటి బిడ్డలు పరిగెత్తి వచ్చిరి. మళ్ళా తలువాట తొడరింది.

❊ ❊ ❊

ఆ తలువును కొంచెం గవనంగా చూసేవాండ్లకు, ఈ బిడ్డలు కరిపించిన బొమ్మకు సుంత పైన, ఇదే మాదిరిగా కరిపించి ఉండే ఇంకొక బొమ్మ కనిపించును. ఆ బొమ్మను కరిపించి ఎన్నో నాళ్లు అయినదాన్నించి, మురికీ పాగా పట్టి మాసిపాయి ఉండాది. ఒకవేళ అది, లచ్చిమివాండ్ల అబ్బ, పిన్నాండిగా ఉండినప్పుడు కనిపించినది అయి ఉండవచ్చు.

బిడ్డలు ఇట్ల ఆటాడుకొని ఉండినప్పుడు ఊరి తలారి అక్కడకు వచ్చినాడు.

"లచ్చిమీ మీ అబ్బ ఎక్కడ?"

"ఊరికి పోయి ఉండాడు"

"మీ అమ్మా?"

"చేనుకి పోయి ఉండాది"

"వచ్చితే, తీరువును కొనివచ్చి కట్టమని చెప్పు. తలారి దేవరు వచ్చి తొడవేసి పొయినాడని చెప్పు"

"సరే" అన్నట్టుగా లచ్చిమి తలను ఆడించింది.

మరునాడు లచ్చిమివాండ్ల అమ్మ ఉండినప్పుడే వచ్చి, తీరువును కట్టమని అడిగినాడు తలారి.

"అయ్యా, ఆయన ఊర్లో లేదు. మణిముత్తారుకు పోయి అయిదు నెలలు అయింది. ఏ తగవలీ లేదు. మూడు ఏండ్లుగా వానచుక్క లేదే. మేము ఏమిపెట్టి మీ తీరువును కట్టుతుము? ఏదో చేనులో కూలిపనికి పోయి ఈ బిడ్డల్ని కాపాడుకొనేదే పెద్దపని; మీకు తెలవనిదా?" అనింది.

ఆ మాటలు తలారి గుండెలని తడమలేదు. ఇట్టాంటి పలుకులని పలువురు పలికితే వినినవాడు కదా ఆతడు.

"మేమేమి చేసుతుమమ్మా దీనికి? ఈ ఏండాది ఎట్టయినా తీరువును కట్టేకావాల. అవతల మామింద వేసారి ఒదవు లేదు" అని చెప్పేసి పోయినాడు.

❊ ❊ ❊

ఒకనాడు తెల్లవారి, ఇంటిముందరుండే బయల్లో కుచుండి బిడ్డలు మాటాడుకొని ఉండారు. నలుగురిని తోడుకొని ఇంటితట్టుకు వచ్చినాడు తలారి. వచ్చినవాండ్లు ఆ తలువును ఎత్తి విప్పాలని మొసలిరి. మాలలేదు. బిడ్డలు ఇంటితట్టుకు పరిగెత్తి వచ్చి చూసిరి. వాండ్లకు ఇది ఒక వేడుకగా ఉండాది. తలారీ చేరి పట్టగా, ఎట్టనో విప్పి, నలుగురునూ తలువును ఎత్తి తలమింద పెట్టుకొని బయలెక్కిరి. ఆ బిడ్డలకు ఏమి తోచిందో తెలవదు. దానిని ఒక ఊరేగింపుగా తలచిరేమో తెలవదు. ఒకడు సన్నాయిని వాయించేవాండి మాదిరిగా చేతుల్ని పెట్టుకొని "పిప్పీ… పీ…పీ…" అని సద్దుచేసి; వేళ్లను చాపుకొని, ఒళ్లను వెనక్కువంచి తొడలమీద దంచికొట్టే మాదిరిగా "దిడుమ్…. దిడుమ్… తదిక్కుణం… తదిక్కుణ" అంటా డోలునుకొట్టే వాడి పోలె మొళగినాడు. శీనివాసుడునూ దానిలో పాలుపంచుకొనినాడు. అట్ల ఉవ్వాయిగా బిడ్డలు, తలువును ఎత్తుకొని పోయేవాండ్ల వెనకదక్క ఊరేగింపుగా కదిలిరి.

తలారి దీనిని తట్టుకోలేకపోయినాడు. "ఇప్పుడు పోతారా లేదా గాడిదలారా" అని అరిచినాడు. బిడ్డలు పరుగులు తీసిరి.

వాండ్లు ఇంటికి తిరిగి వచ్చేటప్పుటికి లచ్చిమి వాకిలిమెట్టు మింద కుచుండి ఏడిచికొని ఉండాది. అందరూ రచ్చ చేయకుండా లచ్చిమి పక్కనే వచ్చికుచుండిరి. ఎవురూ ఏమీ మాటాడలేదు. శీనివాసుడునూ మూతిని ముడుచుకొని ఉండాడు. ఇట్ల ఎక్కువసేపు వాండ్లు ఉండలేకపోయిరి. తన్నేతగా ఒకపిల్ల "నేను ఇంటికి పోయేను" అంటా లేచింది. తోడనే అందురూ అక్కడనుండి బయలెక్కి పోయేసిరి. లచ్చిమీ శీనివాసుడూ మట్టుకే అక్కడ ఉండారు. నిండావేళ వాండ్లు ఒకరికొకరు మాటాడుకోలేదు.

పసిబిడ్డ ఏడిచిన గొంతును విని, లచ్చిమి లోగాకు తిరిగింది.

అంతలోగానే శీనివాసుడు ఆ బిడ్డను ఎత్తుకొనేదానికి పొయినాడు. బిడ్డను తాకి, చెయ్యిని వెనక్కి ఈడుచుకొనానాడు. అక్కను చూసినాడు. లచ్చిమి కూడా చూసింది.

"అమ్మిని తాకి చూడక్కా, ఒళ్లు కాలె" అనినాడు. లచ్చిమి తాకి చూసింది. నిప్పుపోలె మండుకొని ఉండాది.

మాపున నిండావేళ తాలి, తలమింద పుల్లలమోపుతోడ వచ్చింది అమ్మ. పుల్లలను ఎడువుకొనేటప్పుడు చెయ్యిని తేలు కుట్టి ఉండే దాన్నించి మూతిలో నొప్పికనపడ, నిమ్మదిగా వచ్చి బిడ్డల పక్కన కుచుండి పసిబిడ్డను తీసుకొనింది. 'ఒళ్లు కాలతుండాదే' అని లోగానే అనుకొనింది. అంతలోగా తెల్లవారి నడిచిన సోదను అమ్మదగ్గిరి చెప్పిరి.

సోదను వినిన రంగమ్మకు ఊపిరే నిలిచినట్టు అయిపోయింది. ఒళ్లంతా కన్నుకు తెలవని ఒక అదురు పాకింది. ఆపె విడిచే ఊపిరిలో వేడి పెరిగింది. కడుపులో తాళలేని ఒక తొప్పర కలిగినట్టు, బిడ్డలను బిగించి పొదువుకొనింది. బిడ్డలముందు ఏడవకూడదు అని ఎంతనో అణచుకొనితేనూ అవలేదు. "ఓయమ్మా..." అంటా అంగలారిచింది. వెరపు వలన బిడ్డలు, ఆమె దగ్గరనించి ఎడంగా జరిగిరి. ఏదో తెలవని బిత్తరలో వాండ్లునూ ఏడుపును ఎత్తుకొనిరి.

❊ ❊ ❊

మునిముత్తారునుండి ఏ తగవలినూ రాలేదు. నాళ్లు గడిచికొనే ఉండాయి. రేయి వచ్చితేనే చలికి తాళలేక బిడ్డలు అదరికొని ఉండారు. తలువు లేనిదాన్నించి ఇల్లు ఉండీ ఒదవు లేనట్టు అయింది. కార్తీకనెల ఈదర, నంజుగాలి పోలె ఇంటిలోగాకు వచ్చి అలమోదుకొని ఉండాది. పసిబిడ్డ ఒళ్లు చెడిపోయి కొనే ఉండాది. ఒకనాడు రెయ్యి ఈదరను తాళలేక ఆ బిడ్డ, ఇంటినీ వాండ్లనూ విడిచిపెట్టి ఎగిరిపోయింది. రంగమ్మ అలమటను అంతింత అని చెప్పలేము. లచ్చిమి కోసరమూ శీనివాసుడి కోసరమే ఆమె ఊపిరిని నిలుపుకొనింది.

❊ ❊ ❊

శీనివాసుడు ఇప్పుడు పల్టెంకు పోతుండాడు. ఒకనాడు నడి పొద్దులో పల్టెంనుండి ఇంటికి వచ్చేటప్పుడు, వాండికి ఒక నిప్పుపెట్టి బొమ్మ దొరికింది. కొనివచ్చి తన అక్కకు చూపినాడు. లచ్చిమి దానిపైన ఆరువాన్ని చూపలేదు.

"అక్కా, నాకు బిరాన గంజిపోయి, ఆకలయ్యే; తినేసి ఈ బొమ్మను కరిపించాల"

"తమ్ముడా, గంజిలేదు" ఏడుపును మింగుకొని ఈమాటను చెప్పింది ఆ బిడ్డ.

"ఏల! నువ్వు తెల్లవారి కాంచేటప్పుడు నేను చూసితినే"

"అవు" అన్నట్టుగా తలను ఆడించి, "నేను బయిటికి పోయి ఉండితి. ఏదో కుక్క వచ్చి, గంజినంతా తాగేసి పోయింది తమ్ముడా... తలువు లేదు కదా" అనింది అలమటా అంగలారుపూ ఉలివేటట్లు. అమ్మ ఆకలితోడ చేనునుండి వచ్చునే అని తలచి ఉలికింది లచ్చిమి.

శీనివాసుడు అక్కడ చెదరిపడి ఉండే, కంబు మెతుకులని ఏరి, బొమ్మకు వెనకదక్క పూసి కరిపించేదానికి వచ్చినాడు. తలువు లేదు. ఏమి చెయ్యాలో తెలవలేదు. గోడమీద కరిపించినాడు. బొమ్మ కింద పడిపోయింది. ఇంకొక తావున, ఇంకొక గోడకు, అంతా కరిపించి చూసినాడు. ఏమీ ఒదవు లేదు. ఏమరపు వలనా ఆకలి వలనా వాడు ఏడిచేదానికి తొడంగినాడు.

మాపున కుండాచట్టిని రుద్ది కడిగికొని ఉండాది లచ్చిమి. మూతిలో ఆబ పొంగికొని, ఎగూపిరి దిగూపిరిగా పరిగెత్తి వచ్చినాడు శీనివాసుడు.

"అక్కా అక్కా మన పల్టెంకు పక్కనే సావడి ఉండాది చూడు. దానికి వెనకదక్క మన ఇంటి తలువు ఉండాది కా. నా కన్నారా చూసితి కా" అనినాడు.

"అట్టనా, నిక్కంగా! ఎక్కడ రా చూడచ్చు" అని శీనివాసుడి చెయ్యిని పట్టుకొనింది. ఇద్దురూ చావడితట్టుకు పరిగెత్తిరి.

నిక్కమే. అదే తలువు పడి ఉండాది. ఎడంనుండే తమ ననుపరి ఆనవాలుని కనిపెట్టేసిరి ఆ చిరువరులు. పక్కన ఎవురయినా ఉండారా అని చుట్టుముట్టూ చూసిరి. ఎవురూ లేరు. వాండ్లకు కలిగిన మగిలిని చెప్పలేము.

అక్కడ మొలిచి ఉండే అటికిమావిడీ వామింటా చెట్లు వాండ్ల కాళ్లకింద పడి నలిగినాయి. విరవిరగా ఆ తలువుతట్టుకు ఉరికిరి. దగ్గరికి పోయి దానిని తాకిరి. తడిమిరి. దానికి పట్టి ఉండే చెద మన్నును లచ్చిమి తన పావడతో తట్టి తుడిచింది.

తలువుకు తన మొకాన్ని ఆనించుకొనింది. ఏడవాల అనే మాదిరిగా ఉండాది ఆ బిడ్డకు. శీనివాసుడిని పత్తుకొనింది. ముద్దా డింది. నవ్వింది. కన్నులనుండి నీరు కారుకొని ఉండాయి. శీనివాసుడు కూడా లచ్చిమిని చూసి నవ్వినాడు. వాండ్ల ఇద్దురీ చేతులూ తలువును గట్టిగా పట్టుకొని ఉండాయి.

**పొండెనాడు తెలుగు మాటలు :**

1) తలువు : తలుపు
2) మునుగొను : మొదలగు
3) అలబల : గోల
4) చిర్రాకు : టిక్కెట్
5) తోడనే : వెంటనే
6) దొమ్ములాడు : గొడవపడు
7) మూతి : మొకం
8) తొత్తుకొను : అనుకొను
9) మగిలించు : సంతోషపెట్టు
10) తొడరు : కొనసాగు
11) నుజ్జిపోవు : చితికిపోవు
12) నిప్పుపెట్టి : అగ్గిపెట్టె
13) తోమము : శుభ్రం
14) మగిలి : సంతోషం
15) దాపుకొను : అనించుకొను
16) పటికట్టు : మెట్టు
17) మాలదు : వీలుపడదు
18) తొడవు : వెతకు
19) గెంజు : బ్రతిమాలు
20) కంబు : సజ్జలు
21) తీరువు : పన్ను
22) తగవలి : సమాచారం
23) ఒదవు : ప్రయోజనం
24) మొసలు : ప్రయత్నించు
25) బయలెక్కు : బయలుదేరు
26) మొళగు : గర్జించు
27) ఉవ్వాయి : ఉత్సాహం
28) తన్నేత : సహజం
29) పోలె : వలె
30) ఎడువు : సేకరించు
31) సోద : సమాచారం
32) అదురు : వణుకు
33) ఆపె : ఆమె
34) తొప్పర : బాధ
35) ఈదర : చలిగాలి
36) నంజు : విషం
37) నడిపొదు : మధ్యాహ్నం
38) ఆరువం : కుతూహలం
39) ఉలువు : ధ్వనించు
40) ఉలుకు : భయపడు
41) తొడంగు : ప్రారంభించు
42) ననుపరి : మిత్రుడు
43) చిరువరి : చిన్నారి
44) పత్తుకొను : కౌగలించుకొను

స.వెం.రమేశ్ ఫోను-8500548142

## ఆశయాలు, ఆచరణ కలగలిసిన ఆదర్శం–'క్రియ'

# కాకినాడలో రెండురోజుల పిల్లల పండుగ

జనవరి 23 సాయంత్రం....కాకినాడ నుంచి స.వెం. రమేశ్ ఫోన్ చేశాడు... "బాబాయ్ ఇక్కడొక అరుదైన కార్యక్రమాన్ని చూస్తు న్నాను. వేలాదిమంది పిల్లలు...వాళ్లను ప్రోత్సహిస్తే ఎంత గొప్ప వ్యక్తులు ఈ సమాజంలో పైకివస్తారో' అనిపిస్తున్నది" అంటూ కాకినాడలో ఆరోజు ఉదయం నుండి జరుగుతున్న 'క్రియ' పిల్లల పండుగ విశేషాలు చెప్పాడు. ఎంత పనుల వత్తిడున్నా, వెంటనే నిర్ణ యించుకొని మర్నాడు వేకువనే రత్నాచల్ ఎక్స్‌ప్రెస్‌లో సామర్లకోట చేరుకున్నాను. అక్కడికి 'క్రియ' యువబృందంతో కలిసి పనిచేస్తున్న ఒక కళాశాల విశ్రాంత ప్రిన్సిపాల్ గాంధీగారు పంపిన కారులో కాకినాడ చేరుకున్నాను. జె.ఎన్.టి.యు విశాల ప్రాంగణంలోకి అడుగుపెట్టినప్పటినుండీ అక్కడ జరుగుతున్న కార్యక్రమాల్ని చూసి ముచ్చటపడ్డాను. సుమారు 10వేల మంది పిల్లలు అంతా ప్రభుత్వ పాఠశాలల్లో చదివే 5 నుండి 15 ఏళ్లలోపు పిల్లలు– 23 రకాల కార్య క్రమాల్లో తమ ప్రతిభను ప్రదర్శిస్తున్నారు. చిన్నిచిన్ని నాటికలు, నృత్యాలు, పాటలు పాడటం, తెలుగుతో చిన్నిచిన్ని ప్రసంగాలు, ఉపన్యాసాలు, జ్ఞానాన్ని, సమాచార వినిమయ నేర్పుల్ని (కమ్యునికేషన్ స్కిల్స్) పెంచే స్పెల్లింగ్, క్విజ్ వంటివి, కథారచన (అక్కడి కక్కడే వ్రాయాలి), కథావిశ్లేషణ కథ చెప్పడం కవితారచన, మ్యాప్‌లో ప్రదేశాల్ని గుర్తించడం, సంవాదం (డిబేట్) యోగ, విచిత్ర వేషధారణ, పద్యధారణ, సైన్స్ ప్రయోగాలు, చిన్న సినిమాల సమీక్ష, చిత్రలేఖనం, ఏకపాత్రాభినయం, ప్రాజెక్ట్ పనులు, మట్టితో బొమ్మలు చేయడం, ఇంకా అనేక ప్రక్రియలు.

'క్రియ' కార్యక్రమాలు 2013 నుంచి జరుగుతున్నాయి. ఇది నాలుగో ఏడు. కొత్తగూడెంలో ఇరవై అయిదు ఏళ్లుగా ప్రతిఏటా జరుగుతున్న 'బాలోత్సవ్' (డిసెంబరు 'అమ్మనుడి' ముఖచిత్రకథనం) కార్యక్రమాలను స్ఫూర్తిగా తీసుకొని, ఇంతపెద్ద ఎత్తున మొదలుపెట్టారు ఈ 'క్రియ'బృందం.



ఈ సంస్థను 14 ఏళ్లక్రితం కాకినాడ దగ్గర తిమ్మాపురంలో ఎస్.ఎస్.ఆర్.జగన్నాధరావు, ఆయన మిత్రులు మరి అయిదుగురు కలిసి ప్రభుత్వ పాఠశాలల్లో పిల్లలకు పోటీ పెడదాం అనుకొని మొద లైన పని మెల్లమెల్లగా ఇంతస్థాయికి చేరుకుంది పన్నెండు వేలమందికి పైగా ఒకేసారి అనేక వేదికలపై ఒక ప్రాగంణంలో ఇన్ని కార్యక్రమా లను నిర్వహించడానికి ఎంతమంది కార్యకర్తలు కావాలి! వారిలో ఎంత నిబద్ధత, సేవాదృక్పథం ఉండాలి! ఇక్కడ నిశ్శబ్దంగా– ఎక్కడా గందరగోళానికి తావివ్వకుండా ఇన్ని కార్యక్రమాలను నడపడానికి ఎంతటి నేర్పు, పట్టుదల, కృషి ఉండాలి. జగన్నాధరావుతోపాటు వందమందికిపైగా కార్యకర్తలు కలిసి పనిచేసి ఇంతటి పని చెయ్య గలుగుతున్నారు. ఎంతో డబ్బు కూడా కావాలి. వీరిపై నమ్మకంతో దాతలు ముందుకు వచ్చి సహకరించడంతో అదంతా ఒక సమస్యే కాలేదు వీరికి.

'క్రియ' సంస్థ ఇంకా కొన్ని ఇతర కార్యక్రమాల్ని కూడా చేస్తున్నది. ప్రభుత్వ పాఠశాలల్లో పదవ తరగతి మంచి మార్కులతో పాసై, పేదరికం వల్ల చదువును కొనసాగించలేని పిల్లలకు ఉపకార వేతనం (స్కాలర్‌షిప్) ఇస్తున్నారు. ఇప్పటి వరకు అలా 230 మందికి ఇచ్చారు. ఉచిత కోచింగ్‌సెంటర్ల నిర్వహణవంటి కొన్ని పనులు కూడా చేస్తు న్నారు. 'క్రియ' వెబ్‌సైటు ఉంది. www.kriyaonline.org చూస్తే క్రియ చేస్తున్న కృషి అంతా తెలుస్తుంది.– ఆడిట్ రిపోర్టుతో సహా.

క్రియ కార్యక్రమాలు మొదలు పెట్టాక చాలా స్కూళ్ళలో పిల్లలు లైబ్రరీని, ల్యాబ్ పరికరాలను ఉపయోగించడం పెరిగింది. పిల్లలు తమ ఊరి యొక్క మ్యాప్‌లను స్వయంగా తయారు చేసుకోవడం మొదలుపెట్టారు. చుట్టూ ఉన్న ప్రపంచాన్ని పరిశీలించడం, అవగాహన చేసుకోవడం, మరింతగా పరిశోధన చేయడం, భావాలను చక్కగా వ్యక్తీకరించడం. ఓటమి–గెలుపులను అనుభవించడం, స్వతంత్రంగా ఆలోచించగలగటం వంటి వ్యక్తిగత ప్రయోజనాలు, చుట్టూ ఉన్న వారిని అర్థం చేసుకోవడం, కలిసి పని చేయడం వలన సహానుభూతిని పొంది బాధ్యతాయుతమయిన వ్యక్తులుగా తయారవడం అనే సామా జిక ప్రయోజనాలు ఉంటాయి. అన్నిటికంటే ముఖ్యంగా జీవితాన్ని బాగా ఆస్వాదించేలా చేసి, పుస్తకాలలో గ్రహించిన విషయాలను పదాల దగ్గర ఆగిపోకుండా వాటిని క్రియాత్మకం చేస్తుంది.

కొత్తగూడెం 'బాలోత్సవ్' డా॥వాసిరెడ్డి రమేష్‌బాబు నేతృత్వంలో, కాకినాడ 'క్రియ' జగన్నాధరావు కార్యదర్శిత్వంలో– ఇతర చోట్ల కూడా ఇటువంటి కార్యక్రమాలు జరగడానికి ఆదర్శంగా నిలుస్తున్నాయి. తెలుగు రాష్ట్రాలలో, బయట కూడా తెలుగు పిల్లల మేధోశక్తిని పెంచ డానికీ ఉత్తమ విద్యార్థులుగా, పౌరులుగా తీర్చిదిద్దడానికి ఇలాంటి సంస్థలు ఎన్నో ముందుకురావాలి. ఇలాంటి పనులకు మన ప్రభు త్వాలు పూనుకోవు. పూనుకొన్నా అవన్నీ మొక్కుబడి చర్యలే. కనుక



ప్రజల్లోంచే యువకుల్లోంచే ఇలాంటి చైతన్యం వెల్లివిరియాలి.

**'క్రియ' పిల్లల పండుగ ఎందుకోసం?**

ఐన్‌స్టీన్ శాస్త్రవేత్త అని అందరికీ తెలుసు. కానీ అతనికి వయోలిన్ వాయించడం చాలా ఇష్టమని, అతడొక గొప్ప సంగీత ప్రేమికుడని కొద్దిమందికే తెలుసు. ఐన్‌స్టీన్ ప్రతిపాదించిన ప్రసిద్ధ "సాపేక్ష సిద్ధాంతం" (థియరీ ఆఫ్ రెలటివిటి) ప్రణాళికబద్ధంగా చేసిన ఆలోచన కాదు. అది అతనికి సహజంగా, స్ఫురించిన సత్యం. సైన్సుకు సంబంధించిన మూల సూత్రాలపై లోతయిన అవగాహన లేకుండా ఇది సాధ్యం అయ్యేది కాదు. కానీ ఆ క్షణంలో ఆ సత్యం తట్టడానికి వెనుక ఉన్న బలమయిన శక్తి సంగీతమని చాలాసార్లు చెప్పాడు కూడా. సైన్స్ లేదా ఆర్ట్ రెండిటిలో ఏదో ఒకటే ఎంచుకోవడం వలన ఆ రంగం ఉన్నత స్థానాన్ని చేరుకోవచ్చు అన్నది ఒక అపోహ మాత్రమే అని ఐన్‌స్టీన్ జీవితాన్ని గమనిస్తే బోధపడుతుంది. మనిషి మెదడులో ఎడమ భాగం లాజికల్‌గా ఆలోచించడానికి, కుడి భాగం కళాత్మక భావనలకు సంబంధించినది. ఒక భాగాన్ని మాత్రమే ఎక్కువ ఉపయోగించి, ఆ ఒక్క భాగమే అభివృద్ధి చెందితే సమతుల్యం దెబ్బతినే పరిస్థితి వస్తుంది. కాబట్టి అలా జరగకుండా ఉండటానికి ఒక స్థాయికి చేరుకున్న తరువాత మెదడు ఎదుగుదలను నిలుపుదల చేసుకుంటుంది. రెండవ అర్ధభాగాన్ని కూడా సమానంగా ఉపయోగించగలిగితేనే, మళ్ళీ మొదటి భాగం ఇంకా అభివృద్ధిచెంది పూర్తి స్థాయిలో ఉపయోగించుకోవడం జరుగుతుంది. కళకో లేక సైన్స్‌కో ఏదో ఒక దానికే పరిమితమయిపోతే ఒకదశ తరువాత మెదడు అభివృద్ధి చెందడం శాశ్వతంగా ఆగిపోతుంది. ప్రస్తుతం అందరూ మార్కులు, ర్యాంకులు మీదే దృష్టి కేంద్రీకరించడం వలన సమాజం మొత్తంలో ఒక విధమయిన మానసిక అసమతుల్యం, అసంతృప్తి కనిపిస్తున్నాయి. ఇటువంటి పరిస్థితులలో కళ మనిషి జీవితానికి వెలుగును తీసుకొస్తుంది. అందులోనూ ఆ విత్తనం చిన్న పిల్లలలోనే పడటం మంచిది అన్న ముఖ్య ఉద్దేశ్యంతో 'క్రియ' సంస్థ వివిధ అంశాలలో సాంస్కృతిక పోటీలు నిర్వహిస్తున్నది.

**-డా॥సామల రమేష్‌బాబు**

మరికొన్ని ఫోటోలు 3వ అట్టమీద చూడండి

---

## (ఆంగ్లం ముఖ్యమే కానీ... 17వ పుట తరువాయి)

5. ఒక స్కూల్లో, మైనారిటీ భాషల పిల్లలు తగిన సంఖ్యలో ఉన్నప్పుడు వారికి అదనంగా వారి భాషాభివృద్ధికి తగిన ప్రత్యేక చర్యలను చేపట్టాలని అయిదవ నమూనా చెబుతున్నది.

ద్విభాషా విధానాన్ని సరిగా అమలు చేయలేకపోతే అది ఆంగ్ల మాధ్యమం పెరగడానికే తోడ్పడుతుందనీ, అపుడు ఇంగ్లీషు మాతృభాష కాని వారి భాషాభివృద్ధి, భావనాభివృద్ధి కుంటు పడుతాయని వీరి అధ్యయనాలు చెబుతున్నాయి. మన రాష్ట్రంలో సక్సెస్ స్కూళ్ళ వ్యవహారం కూడా ఈ పాఠాన్నే నేర్పింది. బోధనా భాషల విషయంలో కర్ణాటక, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, తెలంగాణా రాష్ట్రాలలో జరుగుతున్న పరిణామాలకు, చర్చలకు ఈ నమూనాలు తగిన నిర్దేశాన్ని ఇవ్వగలుగుతాయి.

ఇంగ్లీషును కేవలం భావవ్యక్తీకరణకు మాత్రమే సాధనంగా చూసే ప్రస్తుత విద్యా నమూనాను మార్చకుండా ఇంగ్లీషు భాషను సరైన రీతిలో నేర్చుకోవడానికి తగిన పరిస్థితులను కల్పించకుండా, చారిత్రిక, తాత్విక, ఆర్థిక సామాజిక, బోధనాభ్యసన సూత్రాలను పరిగణనలోకి తీసుకోకుండా ఇంగ్లీషును నేర్పే ప్రయత్నాలు వికటిస్తాయి. సరైన భాషా నిర్మాణం. భావనా నిర్మాణంతోనే సరైన ఆలోచనలకు ఆకృతి కలుగుతుంది. దానితోనే కొత్త విషయాలను ఆవిష్కరించే సామర్థ్యాలు వస్తాయి. అభివృద్ధి సుగమం అవుతుంది. అనర్గళంగా మాట్లాడగలగడం కన్నా కొత్త విషయాన్ని ఆవిష్కరించగలగడమే అత్యంత ప్రాధాన్యమైనది. ఆంగ్లం ముఖ్యమే కాని ఆలోచించే సామర్థ్యం మరీ ముఖ్యం.

-రచయిత శ్రీ ఎడమ శ్రీనివాసరెడ్డి-వరంగల్లు(హన్మకొండ)లోని కాకతీయ ప్రభుత్వ కళాశాలలో అధ్యాపకులు. విద్యామార్పు సమాజం (SCIE-Society for Change in Education) వ్యవస్థాపక సభ్యులు. ఫోన్ : 99499 05069

**ఈ జనవరి నెల తెలుగు సాహిత్యలోకానికి, ప్రజలకు ఎంతో లోటును మిగిల్చింది. ఇద్దరు సాహితీమూర్తులు శ్రీ కరణం బాలసుబ్రహ్మణ్య పిళ్లై, శ్రీ అద్దేపల్లి రామమోహనరావు కన్ను మూశారు. 6 నెలల తేడాతో ఇద్దరూ 80 ఏళ్ళ వయసువారే.**



## కరణం బాలసుబ్రహ్మణ్యంపిళ్లై

ఉత్తమ ఉపాధ్యాయుడు, కవి, రచయిత, విమర్శకుడు శ్రీ కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్లై 80 ఏళ్ల వయసులో ఈ జనవరి 11న తనువు చాలించారు. చిత్తూరు జిల్లా తలుపులపల్లెలో 1936 ఫిబ్రవరి 1న పుట్టిన పిళ్ళై ఆంధ్రాయూనివర్శిటీలో భాషాప్రవీణ పట్టా పొంది ఉపాధ్యాయునిగా పనిచేశారు. సంస్కృతంలో, తెలుగులో పండితుడైన బాలసుబ్రహ్మణ్యం పిళ్లైగారికి తమిళం మీదా పట్టుంది. 'నడుస్తున్న చరిత్ర'లో తెలుగును రక్షించుకోవడం అన్న అంశంపై తన భావాలను వ్యాసాలుగా వ్రాశారు. ఈ అంశంపై ఆయనలో అంతర్గత సంఘర్షణ ఉండేది. అది 'నడుస్తున్న చరిత్ర' లోను, 'ఆంధ్రభూమి' దినపత్రికలోనూ ఆయన వ్రాసిన వ్యాసాల్లో కనిపించేది. కొన్నిసార్లు మా మధ్య ఆ అంశాల మీద చర్చ జరిగేది. తెలుగుపై సంస్కృతం ప్రభావం మితిమించిందని, అచ్చ తెలుగు మాటలను కాపాడుకోవడమే కాదు, మరచిపోయిన వాటిని మళ్లీ బయటకు తెచ్చుకోవాలని, తెలుగును తెలుగుగా బ్రతికించుకోవాలని ఆయన ఒక చోట వ్రాస్తే, సంస్కృతం లేకుండా కుదరదని, సంస్కృతాన్ని నిరసించకూడదని మరొకచోట అనేవారు. ఇది "మీలో ఏర్పడ్డ సంఘర్షణ కాదు; వాస్తవాల విశ్లేషణలో ఒక రచయితగా, ఒక ఉపాధ్యాయుడిగా మీలో ఆలోచనలను వెల్లడించడంలో జరుగుతున్న ప్రక్రియ మాత్రమే"నని నేనాయనతో అన్నాను. తనకు యాభై ఏళ్లు దాటిందాకా తాను రచనల జోలికి పోలేదనీ ఆ తర్వాత రచయిత కావడం కోసం చాలా కృషి చేశానని, నిరంతర అధ్యయనంతోపాటు తెలుసుకొన్నదానిని రచనగా జనంలోకి తేవాలని తపన పడ్డానని, ఆయన నాతో చిత్తూరులో కలిసినప్పుడు చెప్పారు. 'వెలుగు తగ్గిన తెలుగు' పేరుతో ఆయన 'ఆంధ్రభూమి'లో వ్రాసిన వ్యాసాల సంకలనం చదివితే, ఆయన తెలుగును రక్షించుకోవాలని ఎంతగా తపన పడ్డారో తెలుస్తుంది.

పద్యం మీద, వచనం మీద సమానమైన పట్టు కలిగి, చెప్పదలచుకొన్న దానిని స్పష్టంగా నిర్మొగమాటంగా ఆయన వ్రాసేవారు. ఆయనకు ఖ్యాతి తెచ్చిన 'బోయ కొట్టములు పండ్రెండు' అనే పుస్తకం తెలుగు చారిత్రక ప్రాచీనతను వెల్లడి చేసింది. 'చండాలుడు' పౌరాణిక నవల ఆయన సునిశిత పరిశీలనకు, చైతన్యానికి అద్దం పడుతుంది. భక్తి భావంతో ఆయన సంస్కృతంలో సుప్రభాత శ్లోకాలను, అష్టకాలను, స్తోత్రాలను వ్రాసిన చేత్తోనే సంస్కరణ భావాలను వెదజల్లే 'ఒక రాఘవరెడ్డి కథ' వంటి రచనల్ని ఆయన చేశారు. ప్రచురణ కాని ఆయన వ్యాసాలు, రచనలు ఇంకా కొన్ని ఉన్నట్లు ఒకసారి నాతో అన్నారు. 'నడుస్తున్న చరిత్ర' పత్రికను ఆయన అభిమానించేవారు. తెలుగు విషయమై జరిగే సభలకు వీలు చేసుకుని హాజరయ్యేవారు. తెలుగు భాషోద్యమ సమాఖ్య కార్యక్రమాల్లో ఆయన పాల్గొన్నారు. కరణం బాలసుబ్రహ్మణ్యం గారు ఇంకా కొన్నేళ్లు జీవించివుంటే తెలుగు సమాజానికి ఎంతో ఉపయోగించే, దారి చూపే రచనల్ని చేసే అవకాశం ఉండేది. సాహితీ సమాజానికి, తెలుగు భాషోద్యమానికి ఆయన మరణం లోటును మిగిల్చింది.

## డా॥అద్దేపల్లి రామమోహనరావు



కవిగా– ఎంత ప్రఖ్యాతుడో, సాహితీ విమర్శకుడుగా కూడా అంతటి పేరు గడించినవాడు. 80 ఏళ్ల ప్రాయంలో కూడా ఎంతో చైతన్యంతో యువకులతో పోటీపడినట్లుగా ఆయన వేషధారణ, నడక, పలుకు ఉండేది. యువ కవులకు ఆయనో దిక్సూచి, పెద్ద దిక్కు. తన 24వ ఏట కవితను రచించడంతో మొదలుపెట్టి, జీవితమంతా సాహిత్యంలో మునిగి తేలిన అద్దేపల్లి–ఉమర్‌ఖయ్యామ్ రుబాయీలను 'మధుజ్వాల' పేరుతో తెలుగులోకి అనువదించారు. ఇంకా అంతర్జ్వాల, రక్తసంధ్య, గోదావరి నా ప్రతిబింబం, మెరుపుపువ్వు దీర్ఘ కవితలు వెలయించారు. 'శ్రీశ్రీ కవితా ప్రస్థానం', "శ్రీశ్రీ మహాప్రస్థానం–ఒక పరిశీలన', 'కుందుర్తి వచన కవితా వైభవం', 'స్త్రీవాద కవిత్వం–ఒక పరిశీలన', 'మహాకవి జాషువా కవితా సమీక్ష' వంటి సాహిత్య విమర్శ గ్రంథాలతో ఆయన విమర్శకుడుగా విశిష్టత సంపాదించుకొన్నారు. వయసుతో, ప్రతిభతో కొలవకుండా, వచ్చిన కవులందరినీ ప్రోత్సహించేవారు. సుమారు 75 పుస్తకాలకు పైగా 'ముందుమాట'ను మనసు పెట్టి వ్రాశారు. మచిలీపట్నం సాంస్కృతిక సమితికీ, కాకినాడ క్రాంతి సాహితీ సంస్థకూ వ్యవస్థాపకుడు. అన్ని సాహితీ సంస్థలతో కలిసి మెలిసి తిరిగినా, కవుల్లో అభ్యుదయవాదిగా పేరు గడించిన విజ్ఞుడు. 1936 సెప్టెంబరు 6న బందరులో పుట్టి, అక్కడే చదువుకొని కళాశాల ఆధ్యాపకుడుగా పనిచేసి, 1971లో కాకినాడ ఎం.ఎస్.ఎన్ ఛారిటీస్ డిగ్రీ కళాశాలలో పని చేసి, అక్కడే 1994 సెప్టెంబరులో ఉద్యోగ విరమణ చేశారు. కృష్ణాజిల్లాలో పుట్టి గోదావరి జిల్లాలో ప్రతిభావంతుడిగా ఎదిగిన అద్దేపల్లి, పై రెండు నదులతోపాటు బంగాళాఖాతపు రెండు తీర పట్టణాల ప్రభావం ఉంది. ఎప్పుడూ సానుకూల (పాజిటివ్) దృక్పథంతో, సరసంగా జీవితాన్ని గడిపిన అద్దేపల్లి రామమోహనరావు గారు మరణించారంటే నమ్మడానికి వీలుగాని సంగతి. ఎప్పుడూ ఉత్సాహంగా వుండేవారు. ఆయన మరణంతో వర్తమాన తెలుగు కవులకు, తెలుగు విమర్శనా సాహిత్యానికి ఎంతో లోటు ఏర్పడింది.

కీర్తిశేషులు కరణం బాలసుబ్రహ్మణ్య పిళ్లై, అద్దేపల్లి రామమోహనరావు గార్లకు మా నివాళి. –సంపాదకుడు

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362












కొత్తగూడెం బాలోత్సవ్ స్ఫూర్తితో కాకినాడలో మూడేళ్లుగా 'క్రియ' స్వచ్ఛంద సంస్థ ప్రతి ఏటా అద్భుతంగా నడుపుతున్న పిల్లల పండుగ...పిల్లల బహుముఖ ప్రజ్ఞకు అద్దం పడుతున్న పెద్ద వేడుక. తెలుగుదనం ఉట్టిపడే కళాత్మక సృజన ప్రదర్శనలు....

(జనవరి 23, 24 లలో కాకినాడలో జరిగిన పండుగలో కొన్ని దృశ్యాలు)



